# జ్యోతిష్మతి

(సామాజ్ కా అత్యాచార్)

శరత్ బాబు





అనువాదం :

దిగవల్లి శేషగిరిరావు



నవభారతీ ప్రచురణ

ప్రకాశకులు :

ది వెరైటీ ఏజన్సీస్

తిలక్ పేట _ బక్కింగ్ హామ్ పేట P. O.

విజయవాడ - 2

5

# జ్యోతిష్మతి

సంధ్యాసమయం. రోడ్లమీది దీపాలు యింకా వెలగటంలేదు. కలకత్తావీధుల్లో ఇంకా జనసంచారం విస్తారంగా ఉంది. ట్రాంబస్సు, ముఖ్యంగా కచ్చేరీలనుంచి ఇళ్ళకు వెళ్ళే బాబులతో కిక్కిరిసి ఉన్నాయి. కొద్దజీతగాళ్ళయిన దురదృష్టవంతులు మెదలకుండా తలవంచుకుని కాలినడకను వెళుతున్నారు. కొందరి చేతుల్లో కూరల సంచులు ఉన్నాయి. మరికొందరు కాళీచేతులుతోనే వెళుతున్నారు. ఒకరు ప్రసన్నవదనంతో కాన్పిస్తే మరొకరు విచారవదనంతో కనుపిస్తున్నారు. ఆలోచించగా వారి మనోవాంఛలు సంధ్యవేళ చీకటి వలె వృద్ధిపొందుచున్నవి. కొందరుబాబులు కిళ్ళీకొట్లవద్ద నుంచుని అకుబీడాలు, సిగరెట్లు మొదలైనవి కొనుక్కుంటున్నారు.

దురాచారులు, వ్యభిచారులునగు ధనికుల బళ్ళు, మోటారులు ధూళితో నిండిఉన్న కంకరరోడ్లమీద దుమ్మును ఆకాశం కంటేటట్లుగా దేవుకుంటూ మహావేగంతో పోతూఉన్నాయి. చిత్పూర్ రోడ్డుమీద జనం మరీ వత్తుగా ఉన్నారు.

కలకత్తాలోని ఆ అందమైన బజారులా! ఇరువైపులా ఆకాశాన్నంటే మేడలూ, భుజంభుజం రాసుకుంటున్నట్లున్నాయి. అక్కడక్కడ కొన్నిబజారులలో పైఅంతస్తువరండాలలో చిత్రవిచిత్రమైన నగలు, దుస్తులు ధరించి, ముడతలుపడి వాడిపోయిన ముఖములు, పీక్కుపోయిన బుగ్గలతో వరుసగా ఎత్తున కూర్చునివున్న పరిభ్రష్ట స్త్రీలు కనుపిస్తున్నారు.

ఒక దుకాణంముందు జనం విస్తారంగా గుమిగూడి ఉన్నారు. ఎదురుగాఉన్న మేడపైన వరండాలో నుంచుని ఒకయువతి అవైపే చూస్తూఉన్నది. అప్పుడప్పుడు తనదృష్టిని ప్రక్కనిగల పూలకుండ్ల పైకి పోనిస్తోంది. ఈమెకంకణరవళికి ఎన్నో మానవహృదయాలు డోలాందోళితము లవుతున్నాయి. సాహసవంతులగు యువకులు

బండ్లలో పోతూ, తలలు బయటకు పెట్టి ఆమెపై ఒకతీవ్రదృష్టిని ప్రసరించి పోసాగారు.

ఆమె నుంచున్నచోటుకు దగ్గరనే ఒక అందమైన పంజరము వ్రేలాడుతున్నది. అందులో ఒక సుందరమైన చకోరము బంధింపబడి ఉన్నది. విద్యుల్లేఖ చేతితో దానితలపైన మృదువుగా నిమురుతూ ప్రేమ వ్యక్తపరుస్తోంది. ఇంతలో ఒక దాసీది పాందాను తీసుకుని వచ్చి ఆకువక్కల నందీయ నములుచూ మరల చకోరమును పరామర్శింపసాగింది.

దాసీది ఆమె ధ్యానమును భంగపరుస్తూ "అమ్మా! అలా వీధి వైపు ఒకమారు చూడండి!" అంది.

"ఏమి? ఏ మున్న దక్కడ?"

"ఆ జనసమూహంవైపు చూడండి." అంది దాసి. కొద్ది దూరంలో ఎదుటఉన్న ఒకదుకాణంముందు చాలామంది జనం గుమిగూడి ఉన్నారు. ఆగుంపులో ఎర్రటోపీ ధరించిన ఒక కానిస్టేబుల్ కూడా కనుపిస్తున్నాడు. కచ్చేరీలలో పని చేసే బాబులందగ్గరనుంచి తమలపాకులు అమ్మే ఆదుకాణాదారులవరకు అక్కడ నుంచుని తమాషా చూస్తున్నారు. విద్యుల్లేఖ కొంతసేపటివరకూ ఆగుంపువైపు ఏకాగ్రదృష్టితో చూచి అర్థంగాక దాసీదానివైపు తిరిగి "ఆజనమంతా అలా మూగింది దేనికి?" అని ప్రశ్నించింది.

"చూసిరానా?"

"వెళ్ళు. త్వరగా వెళ్ళి చూచిరా?"

ఆ జనసమూహాన్ని చూసి విద్యుల్లేఖ విస్మితురా లయిన మాట వాస్తవమే! ఇంత పెద్దపట్టణంలో సాధారణంగా జనసమ్మర్దం ఎక్కువగానే ఉంటుంది. అయినప్పటికీ, నేడు ఈగుంపును చూపినందువల్ల ఆమెహృదయంలో ఇంత కలవరం ఎందుకు కలిగిందో తెలియదు.

దాసీది వెళ్ళింది. విద్యుల్లేఖ వరండాలో ఆమెరాకకొరకు ఎదురుచూస్తూ వున్నది. ఆమె మరలిరాగానే ఆతురతతో "గంగా!

ఏమిటి ఆగుంపుకు కారణం?" అని అడిగింది.

"ఏం చెప్పేది? ఎవరిపిల్లవాడో రాచవారబ్బాయిలా గున్నాడు! చక్కనిచుక్క. పళ్ళాల్లుగే భ్యంటాయి—"

"ఆతని కే మయిందే?"

"బండిక్రింద పడ్డాడు."

"స్పృహ ఉన్నదా?"

"ఇంకా రాలే దమ్మా!" అని బజారువైపు చూస్తూ "ఎవరి పిల్లవాడో తెలియదు. తల్లితండ్రులు ఈసంగతి వింటే ఎంత బాధ పడతారో?"

"గంగా! ఒకపని చెయ్యి. చౌకీదారుతో ఆఅబ్బాయిని యిక్కడికి పంపించమని చెప్పు. ఇంతమంది అక్కడ చేరి తమాషా చూస్తున్నారు. కాని, ఎవరిబుద్ధికీ ఆఅర్భకుని సురక్షితస్థానానికి చేర్చటం అవసరం అన్నసంగతయినా తట్టలేదు?"

"వాళ్ళ కేం? తమాషా చూస్తున్నారు."

"నువ్వు వెళ్ళు. వెళ్ళి కానిస్టేబుల్‌తో చెప్పి ఆ అబ్బాయిని యిక్కడకు చేర్చగల ఉపాయం చూడు. ఏదైనా బహుమానం యిద్దాం."

దాసీది మౌనంగా వెళ్ళిపోయింది.

## 2

క్రిందిగదిలో రేవతి భోజనం చేస్తూన్నది. ఇంతలో ఆకస్మికంగా ఇంట్లో ఏదో గందరగోళం అవుతున్నట్లు విని విస్మితురాలయింది. ఇంతలోకే గంగ ఇద్దరుముగ్గురు మనుష్యుల సహాయంతో స్పృహతప్పిన ఆపిల్లవాణ్ణి తీసుకువచ్చింది. కానిస్టేబుల్ కూడా వెంట ఉన్నాడు. తమాషా చూస్తూన్న ఆజనసమూహమంతా ఇంట్లోకి జొరబడకుండా గుమ్మంవద్ద నుంచుని ఆటకాయిస్తున్నాడు. ఇది చూచిన రేవతి "గంగా! ఎవరె ఆఅబ్బాయి? ఆతని కే మయింది? ఇక్కడకు తీసుకువచ్చా వెందుకు?" అని ప్రశ్నించింది.

ఈసమయానికి విద్యుల్లేఖ పైఅంతస్తునుంచి క్రిందకు దిగి వచ్చింది. గంగను పిలచి "అతణ్ణి నాగదిలో మంచంమీద పడుకో బెట్టిరా. వచ్చి డాక్టర్ కిషోర్‌బాబును పిలచిరమ్మని చౌకీదార్‌ను పంపించు" అని ఆమె తనగదివైపుకు మళ్ళింది.

దుకాణాదారుకూడా ఆపిల్లవాణ్ణి తీసుకురావటంలో సహాయ పడ్డాడు. అతణ్ణి చూచి విద్యుల్లేఖ "ఏమి జరిగింది?" అని అడిగింది.

"మంచినీళ్ళిమ్మని ఈకుర్రవాడు నాదుకాణంవద్దకు వచ్చాడు. నే నిచ్చిన నీళ్ళు త్రాగి మరల రోడ్డు ఎక్కాడో లేదో ఇంతలోనే ఒకబండి వచ్చి గుద్దుకుంది. స్పృహ తప్పి క్రింద పడిపోయాడు. బండి వెళ్ళిపోయింది" అన్నాడు.

"అయితే మీలో ఎవరూ అతనిముఖంమీద ఇన్ని నీళ్ళయినా చల్లలేకపోయా రన్నమాట? అక్కడ చేరి అందరూ తమాషా చూస్తున్నా రన్నమాట!" అంది విద్యుల్లేఖ. "ఎక్కడ దెబ్బతగిలిందో అని నేను విచారించటానికి వెళ్ళేటప్పటికే జనం క్రిక్కిరిసిపోయారు." అన్నాడు దుకాణదారు సిగ్గుపడుతూ.

"సరే! ఇంక మీరు వెళ్ళవచ్చు. డాక్టరుకు కబురు పంపాను. నేను స్వయంగా అతనివిషయంలో జాగ్రత్త తీసుకుంటాను" అంది.

కానిస్టేబుల్‌కు తనబరువు దించినట్లనిపించింది. లేకపోతే, ఆస్పృహతప్పిన పిల్లవాణ్ణి తాను స్వయంగా ఆస్పత్రికి తీసుకువెళ్ళవలసివచ్చేది అని అనుకున్నాడు. పిల్లవానికి ఇక పరవా లేదనుకుని దుకాణదారు, అక్కడకు వచ్చిన యితరులు ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. తరువాత రేవతి విద్యుల్లేఖతో "ఏమే విద్యూ! ఈ పీభారాన్ని బుద్ధిపూర్వకంగా ఎందుకు తెచ్చిపెట్టుకుంటున్నావు?" అంది. "నీ కెందు కంత కష్టం" అంది విద్యుల్లేఖ కోపంతో. దాసీని పిలచి "గంగా! చౌకీదారు డాక్టర్ని పిలుచుకురావటానికి వెళ్ళాడు గదూ?" అంది. "ఆఁ! ఈపాటికి వారు వస్తూఉండవచ్చు." అంది గంగ. రేవతి తనలో "అందగత్తె నని దీని కెంత గర్వం!" అని గొణుక్కుంటూ తనగదివైపు వెళ్ళిపోయింది. స్నానాలగదిలోనుంచి బయటకు వస్తూ ఇది విని శ్యామ, సుమా, రేవతితో "ఎవరినే తిడుతున్నావు?" అని అడిగారు.

"అదుగో! ఆ అందకత్తెను. ఎంత గర్వంగా తిరుగుతోందో చూడండి" అంది రేవతి. వాళ్ళిద్దరి సానుభూతి కళ్ళనీళ్ళు లాగ ఆకస్మికంగా రేవతికి వచ్చిపడింది.

"ఏమి జరిగిం దేమిటి?"

"వినాలనిఉంటే నాగదిలోకి పదండి. ఇక్కడ చెప్పుకుని తరువాత ఆమెచేత ఏ తిట్లెవరు తినగలరు!" అని వాళ్ళను తీసుకుని తనగదిలోకి దారితీసింది. గదిలో చేరగానే రేవతి చేతులు త్రిప్పుకుంటూ "ఎవరో పిల్లవాడు బాడ్సి క్రింద పడి బజారులో స్పృహతప్పి పడిపోయాడు, నిరంజని నా కీసంగతి చెప్పింది. వినికూడా మెదలకుండా ఊరుకున్నాను. పరాయివాళ్ళ అగ్నిలో దూకి శరీరాన్ని ఎవరూ కాల్చుకోరు. కాని విద్యుల్లేఖ గంగన్ను ఆపిల్లవాణ్ణి తన యింట్లోకి తెప్పించుకొని మంచంమీద పెట్టించి, అతడికి శుశ్రూష చేస్తోంది. డాక్టరుకు కబురు 'నేను ఎందుకమ్మా! నీ కిదంతా' అని అనేప్పటికే నాకు లేని కోపమూ వచ్చింది. అందగత్తెఅయితే అనవచ్చు అహంభావమా! ఈఅందం శాశ్వతమా ఏం? మనంకూ అందగత్తెలమే!" అని అన్నది.

ఈమాటలు విని సరమ యిలా అన్నది. "ఏదో మోటార్లు వచ్చి తనగుమ్మంవద్ద ఆగినంతమాత్రాన, యీ భావం వుండాలాయేం? ఆరోజున నేను ఒకరూపాయి బదు గాను. రూపాయి విసిరిపుచ్చుకు నామీద పడవేసి, ఎప్పు రూపాయిముఖం ఎరుగనివాళ్ళ నన్నట్లు యిదుగో తీసుకో తిరి నాకు యివ్వనక్కర్లేదు తే" అన్నది.

ఈసంభాషణ జరుగుతూవున్నసమయంలో విద్యుల్లేఖ తన గదిలో కూర్చొని ఆపిల్లవానికి స్పృహ వచ్చే ప్రయత్నాలు చేస్తూ వుంది. ఆమె అతనికి విసురుతూ ఉపచారం చేస్తూంది. దగ్గరనే కూర్చు వున్న గంగ పిల్లవాని శిరస్సును నిమురుతూంది. పిల్లవాడు ఒక పర్యాయం కళ్ళు తెరచి, మరల మూసుకొన్నాడు. "చూశావా గంగా! ఇతడిశరీరం ఎంత వెచ్చగా వున్నదో" అన్నది విద్యుల్లేఖ.

గంగ అతని శరీరంమీద చెయ్యి పెట్టి చూచి, "ఒడలు తెలియనంత తీవ్రంగా వచ్చింది జ్వరం. శరీరం అగ్నిలాగా మండుతోన్నది. చెయ్యికూడా పెట్టేందుకు వీల్లేకుండా వుంది. డాక్టరుగారు ఎప్పటికి వస్తారో తెలియదు. భగవంతుడు సరిగా చూడకపోతే పరిస్థితి ఎలా మారుతుందో అని ఆలోచిస్తున్నాను. వెనుకాముందూ ఆలోచించకుండా యీబరువు ఎందుకు ఎత్తుకొన్నారమ్మా! మీయీ విలువగల బట్టలుకూడా పాడైపోతున్నాయి" అన్నది.

"గంగా!........"అంది విద్యుల్లేఖ. ఆమెగొంతు కీచినంగా లేదు. అయినప్పటికీ, ఆమెదృష్టిని చూచి గంగ హడలిపోయింది.

# 3

ం ఎక్కువగా వుంది. పిల్లవాడు బతికే ఆశ నా కేమీ . ఇతణ్ణి హాస్పటలుకు పంపించటం మంచిది. లేకపోతే కష్టాల్ని ఎదుర్కోవలసివుంటుంది" అన్నాడు డాక్టరు.

ఖ "అందుకని మీ రేమీ విచారించనక్కరలేదు. అన్ని చేందుకు నేను సిద్ధంగా వున్నాను. రోగికి చికిత్స కు ఏదైనా సందేహం ఉంటే చెప్పండి. మరివోళ రు చేస్తాను."

చ్చె, రోగికి చికిత్స చేయటంలో నాకు ఏమాత్రము లేదు. నాపని రోగులకు చికిత్స చేయుటమేగదా! ఇతడికి న చేసేందుకు కావలసిన ఔషధాలవిషయం గాదు, శుశ్రూషల విషయంలో నాసందేహం" అని సిగ్గిలుతూ డాక్టరు జవాబిచ్చాడు.

"మీ రావిషయంలో ఏమాత్రమూ విచారించనక్కరలేదు. ఆవిషయంలో నేను ఎక్కువగా శ్రద్ధ పుచ్చుకొంటాను. మీరు సందేహించ నవసరం లేదు." కొంచెం ఆగి విద్యుల్లేఖ ఇలా అన్నది.

"ఇదంతా అనవసరం. మీరు మందు యిచ్చి ఏమి చెయ్యాలో చెప్పండి. ఏదైనా అవుసరం వచ్చేటట్లయితే, వెంటనే మీకు కబురు చేస్తాను. ఫీజువిషయంలో మీ రేమీ వెనుకాడ నక్కరలేదు. కావాలంటే యిప్పుడే, ఒకవందరూపాయలు తీసుకోనండి."

ఆరోజుల్లో విద్యుల్లేఖ పట్నంలో బాగా పేరుపడిన పాటకత్తె. ప్రతిసందులోనూ, ప్రతివీధిలోనూ ఆమెనుగురించి చెప్పుకొనేవారు. కలకత్తానివాసులు ఆమెయొక్క జ్యోతిర్మయ సౌందర్యానికి మధురస్వరానికి హావభావాలకు పాటకు ప్రాణాలర్పిస్తూవుండేవారు. విద్యుల్లేఖ పాల్గొనని సభలు, సొసైటీలూ నిస్సారమైనవిగా తలంచబడుతూవుండేవి. ఎంత ప్రయత్నించినప్పటికీ ఆసమావేశాలు ఆకర్షవంతంగా వుండేవికావు. ఆమె అనే ప్రతిమాటకూ, లోకులు వెట్టిచాకిరీ చేసేందుకు తయారయేవారు. అలాంటి విద్యుల్లేఖ ఈకుర్రవాడివిషయంలో నేడింత నమ్రురాలుగా మారింది. ఈమార్పును చూసి డాక్టరు పొందిన విస్మయానికి మేర లేదు. ఆమెకు జవాబిస్తూ డాక్టరు "సరేనండి, నాచేతనైనంతవరకు కృషి చేస్తాను. కుర్రవాడు ఆరోగ్యవంతుడు అయినతరువాత ఫీజు యివ్వవచ్చు. ఫీజు విషయంలో మీ రింత తొందరపడనక్కరలేదు" అన్నాడు.

మందు, దానిని ఉపయోగించే విధానమూ వ్రాసి డాక్టరు కిషోరీబాబు అక్కడినుంచి వెళ్ళిపోయాడు. విద్యుల్లేఖ అలాగే కుర్రవాడి తలవైపున కూర్చునివున్నది. ఇంతకుపూర్వం ఒకానొకనాడు తాను యీవిధంగానే ఒకరోగితలవైపున కూర్చుంది. కాని, ఆసంఘటన జరిగి చాలాసంవత్సరాలు గడిచిపోయాయి. ఇప్పట్లో లీలగా అది స్ఫురణకు వచ్చింది.

ఆరోజులకూ యీరోజులకూ ఎంత తేడా వున్నది! అప్పుడామె యింత కఠినహృదయ కాదు. ఒక స్వర్గీయ అపూర్వఅప్సరస. ఆరోగి ఎవరు?.........ఒక అపరిచితుడు. ఎచ్చటినుంచి వచ్చాడో తెలియదు. స్త్రీయొక్క అపూర్వమగు నిశ్చలప్రేమను వాంఛించి అతడామెకు తనహృదయమును సమర్పించాడు. నమ్రభావముతో ప్రేమభిక్షను యాచించాడు.

ఈవిధంగా విద్యుల్లేఖ ఎన్నోసంగతులనుగురించి యోచిస్తూవున్నది. ఇంతలో గంగ ఆకస్మికంగా వచ్చి "అమ్మా! భోజనం చెయ్యండి" అంది.

విద్యుల్లేఖ ఉలికిపడి "నేనిప్పుడు భోజనం చెయ్యను. నీవు భోజనం చేసి త్వరగా రా. ఇవ్వాళ ఇక్కడే పడుకో. అవసరమైతే నిద్ర లేపుతాను" అంది.

గంగ వెళ్ళింది. విద్యుల్లేఖ రోగికి మందిచ్చింది. నౌకరు మంచు గడ్డ, సోడాబాటిలు తీసుకువచ్చాడు. విద్యుల్లేఖ రోగితలపై మంచు గడ్డ వుంచింది. సరిగా ఆసమయానికి బయటినుంచి ఎవరో "విద్యా" అని పిలిచారు.

ఇంతలోనే గంగ పైకి వచ్చి "అమ్మా! నారాయణబాబు వచ్చారు" అంది.

నారాయణబాబు ప్రసిద్ధిగల ఒక జమీందారు. అతని వ్రేళ్ళ యందలి మణులుపొదిగిన వుంగరాలవలె, ఆతనిపేరుకూడా చాలా ప్రఖ్యాతమైనది. కలకత్తాలోగల పెక్కు రంగస్థలాల్లో ఆయన పేర ఒకబాక్సు ఎల్లప్పుడూ రిజర్వు చేయబడవుంటుంది. తనబంధుజనులతో అభినయమును చూచేందుకు నారాయణబాబు రంగశాలకు వెళ్ళినప్పుడు కంపెనీమేనేజరు ఆయనకు తగిన ఏర్పాట్లు చేయుటలో ఏమరుపాటు లేకుండా జాగ్రత్త తీసుకుంటాడు. ఇంతే గాదు. ఆయన ఇంట ఎప్పుడూ మిత్రులూ, బంధువులూ ఆటపాటల్లో మునిగి తేలుతూ ఉంటారు.

"ఇవ్వాళ వెళ్ళిపోవలసినదని వారితో చెప్పు" అన్నది విద్యుల్లేఖ.

గంగ ఏమీ అనలేదు. ఆమె పొందిన ఆశ్చర్యానికి మేర లేదు. అమ్మగారు వినిపించుకోకుండా యిల్లా అనివుంటారని ఆమె అనుకున్నది. అందుకని "అమ్మా! నారాయణబాబు వచ్చారు" అని యింకొకమారు హెచ్చరించింది.

"ఏం వస్తే? గంతులు వెయ్యమంటావా? ఆయనను వెళ్ళిపొమ్మని చెప్పు. నాకివ్వాళ యివేవీ నచ్చవు."

గంగ మెరుపువలె బయటకు వెళ్ళిపోయింది. ఆమెకు విద్యుల్లేఖపైన కోపం వస్తూవుంది. మహాపురుషులకు నీచులు, అధములపైనా ఎంత త్వరగా దయ కలుగుతుందో అంత త్వరగానే మార్పుకూడా వస్తూవుంటుంది. అతిత్వరలోనే వారు అసంతుష్టులు అవుతారు. గంగ త్వరగా వెళ్ళి జరిగినసంగతి అంతా నారాయణబాబుకు చెప్పింది. అక్కడితో తృప్తిపడక "బాబూ, లోపలిగదిలోకి పదండి. అమ్మ

గారు ఎంత పిచ్చిలో పడ్డారో చూడురుగాని. ఎంతమంది వద్దని చెప్పినా ఏమాత్రమూ వినిపించుకోలేదు” అన్నది.

“అయితే వెడతాను” అన్నాడు నారాయణబాబు. అతని కనులల్లోనుండి నమ్రభావము తొణికిసలాడుతూవున్నది.

“తొందరగా వెళ్ళండి! ఆమె మనగొడవలో లేదు. తన శరీర స్పృహనుకూడా యిప్పుడామె మరిచిపోయింది. మిమ్మల్ని చూస్తే నైనా ఏమైనా స్పృహ వస్తుందేమో!”

నారాయణబాబు మెల్లమెల్లగా గదివైపుకు వెళ్ళాడు. ఆసమయంలో విద్యుల్లేఖ రోగి టెంపరేచరు చూస్తోంది. ఆకస్మికంగా దొంగవలె నారాయణబాబు తన గదిలో ప్రవేశించటం చూసి “ఎవరు?” అన్నది.

“నేనే!” అన్నాడు నారాయణబాబు. ఆసమయంలో నారాయణబాబు గొంతు గద్గదికంగా వుంది. ఆమాట కఠినాతికఠినహృదయాన్నికూడా ద్రవింపజేసేట్టుగా వుంది. కాని విద్యుల్లేఖను ఆ సమయంలో భూతం ఆవేశించివున్నది. అందువల్ల ఆమెలో ఏమార్పూ రాలేదు. “నేను వెళ్ళమని చెప్పానుగా!” అని కఠినంగా అన్నది.

“వెడుతున్నాను విద్యా” అని నారాయణబాబు ఆమె ముఖంవైపు చూచాడు. కాని, ఆమె నారాయణబాబువైపు చూడకుండానే “గంగా!” అని పిలిచింది.

గంగ వచ్చింది. “కొద్దిగా మంచుగడ్డ కొనుక్కువచ్చి, నాపెట్టెలోనుంచి ఉతికిన తువ్వాలు ఒకటి తీసి, తెచ్చియివ్వు” అన్నది. తాను యజమానురాలివల్ల చివాట్లు తినవలసివస్తుందేమోనని గంగ అనుకున్నది. కాని, అలా జరుగలేదు. గదిలోనుంచి బయటకు వచ్చి, ‘బ్రతికానురా బాబూ’ అనుకున్నది.

“విద్యా! నర్సును తీసుకురానా?” అన్నాడు నారాయణబాబు.

“అక్కరలేదు.”

"నీవు చాలా శ్రమపడుతున్నావు. అనవసరంగా నీవు రోగ గ్రస్తురాలవు కావటం ఎందుకు?"

ఈమాటకు విద్యుల్లేఖ జవాబేమీ యివ్వలేదు. నారాయణ బాబు నలువైపులా దృష్టిని సారించి, నెమ్మదిగా మంచందగ్గరకు వచ్చి ఆమెవైపు ప్రేమదృక్కులను ప్రసరిస్తూ "విద్యా! నీవు దేవివి" అన్నాడు. విద్యుల్లేఖ వెటకారంగానవ్వి "ఇప్పాళకు మీరు వెళ్ళండి. ఇంకా కొద్దిరోజులవరకు మిమ్ములను కలిసికోజాలను. మీరు వ్యర్థంగా శ్రమపడవద్దు" అన్నది.

"నిన్ను యింకొకమారు చూచేందుకు తప్పకవస్తాను. తీసుకు రమ్మంటే ఎవరైనా యోగ్యుడైన యింగ్లీషు డాక్టర్ని తీసుకువస్తాను" అన్నాడు నారాయణబాబు.

"ఇప్పుడు మందు యిస్తున్న డాక్టరు అనుమతి తీసుకోకుండా, మరివకడాక్టరును పిలిపించటం బాగుండదు" అని విద్యుల్లేఖ జవాబిచ్చింది. సరిగా అదే సమయానికి గంగ మంచుగడ్డ, తువ్వాలు తీసుకునివచ్చింది.

"నారాయణబాబు క్రిందికి వెడతారు, వారికి లాంతరు చూపించు" అన్నది విద్యుల్లేఖ గంగతో. విద్యుల్లేఖ నోట యీమాట విని, అక్కడ తాను వుండవగదని నారాయణబాబు అనుకున్నాడు. తాను ఆమె యిష్టంలేకుండా అక్కడ వుంటే ఆమెకు కోపం వస్తుందనీ, అందువల్ల తానామె గాఢ ప్రేమను కోల్పోవలసివస్తుందనీ తలచి, నారాయణబాబు అచ్చటినుంచి మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ గదిబయటకు వెళ్ళిపోయాడు.

గంగ అతనివెనుక వెళ్ళింది. ఆమెచేతిలో అరికెన్‌లాంతరు వుంది. కోపముచే ఆమె కంపిస్తూన్నది. తనకు వచ్చే అయిదురూపాయలూ నారాయణబాబు యీ విధంగా నిరాశతో తిరిగివెళ్ళటంవల్ల లాభించకుండాపోయాయి.

# 4

విద్యుల్లేఖ మరునాడు సంధ్యాసమయాన రోగి మంచమువద్ద కూర్చొని గాజుగ్లాసులో ద్రాక్షరసం తయారుచేస్తూవున్నది. ఆకస్మికంగా రోగికి స్పృహవచ్చి, ప్రక్కకు ఒత్తిగిలి "అమ్మా!" అని అన్నాడు.

విద్యుల్లేఖ చేతిలోవున్న పనిని విడిచిపెట్టి, రోగి మంచమువద్ద నుంచున్నది. యూ-డీ-కలోన్ పట్టీ తయారుచేసి ఆతడితలపై అద్ద సాగింది. పిల్లవాడు దీర్ఘంగా శ్వాసించి కళ్ళు తెరిచాడు. తరువాత గదిలో నలుదిశలూ పరికించి చూచాడు. విస్మయంగా చూస్తూ నెమ్మదిగా కళ్ళు మూసుకొన్నాడు.

విద్యుల్లేఖ ఎంతో సంతోషించింది. తాను పడిన శ్రమ వ్యర్థం కాలేదు ప్రయోజనకారి అయింది. ఇప్పు డాపిరపిల్లవాడు జీవించుననే ఆశ ఆమెకు పూర్తిగా కలిగింది. ఉదయాన డాక్టరు వచ్చినప్పుడు సాయంత్రంలోపున స్పృహ వచ్చేటట్లయితే, ఆ కుర్రవాడు జీవించవచ్చుననీ, సాయంత్రంలోపల స్పృహ రాకపోతే జీవించటం చాలా కష్టం అనీ చెప్పి వెళ్ళాడు.

విద్యుల్లేఖ ఒక నిట్టూర్పు విడిచి, గాజుగ్లాసు తీసుకొని రోగి వద్దకు వెళ్ళి "ఇది త్రాగు" అన్నది. రోగి ఏమీ జవా బివ్వలేదు. ఆమె మరియొకమారు "ఇది త్రాగు" అన్నది. రోగి కనులు తెరిచాడు. అతని నేత్రాలు భయభీతహరిణివలె వున్నాయి. 'ఎవరు?' అన్నాడు.

ఇదేమిటి? ఒక సర్వాంగసుందరి, తనవంటి ఒక దురదృష్టబాలునకు యీవిధంగా సేవ చేయుటేమిటి! 'ఇది కలయేమో' అనుకొని అతడు మరల కళ్ళు మూశాడు. కాని కల కాదు. యీ కోమలమగు పరోపకార హస్తము......ఇంతటి స్నేహము......ఇది కల కానేరదు! ఎన్నడునూ కాదు.

అతని వుంగరాలుతిరిగిన బిరుసు వెంట్రుకలు మస్తకంమీద పడ్డాయి. విద్యుల్లేఖ ఆ చెదరిపోయిన ముంగురులను మస్తకముపైనుంచి తొలగిస్తూ "పేనిని త్రాగు" అన్నది. 'ఈ స్నేహాభరితమగు కంఠము

......వాస్తవమునకు యీజీవితం యిలా గాక స్వప్నంగా వున్నట్లయితే ఎంత బాగుండును!' అని అత డనుకున్నాడు.

విద్యుల్లేఖ మళ్ళీ "త్రాగు" అని అన్నది.

ఇది స్వప్నం కాజాలదు. ఇట్టి మధురగాత్రం స్వప్నమందలి సితారు తంత్రులనుండి రానేరదు. రోగి మళ్ళీ కళ్ళు తెరచాడు. ఆతడు తన నేత్రాలను తానే నమ్మలేకపోయాడు. ఆతనిహృదయంలో అద్భుతమైన భావాలు జనించాయి. ఆతనినోటినుండి అప్రయత్నంగా "అమ్మా!" అను పవిత్రశబ్దం వెలువడింది.

విద్యుల్లేఖ శరీరం అంతా ఒక్కసారిగా మెరుపు మెరిసినట్లు అయింది. తేజోతరంగం ఒకటి ఆమె శిరస్సునుండి పాదాలవరకూ పరుగెత్తింది. ఉదాసీనంగా అన్నది "నీవు నన్ను 'అమ్మా' అంటున్నావా?"

దుఃఖంలోవున్న ఆ పిల్లవానికళ్ళు కన్నీటితో నిండాయి. అత డామెను తేరిపారచూడసాగాడు. ఏమాటా నోటినుంచి వెలువడలేదు. "ఈ సహృదయస్నేహమూర్తి ఎవరు?" అనుకున్నాడు.

"ఇది త్రాగు" అన్నది విద్యుల్లేఖ మళ్ళా.

రోగి చిన్నపిల్లవానివలె ఆ షర్బతు త్రాగాడు. "ఇప్పుడు నీకు ఏవిధమైన కష్టమూ కలగటంలేదుగదా?" అంది విద్యుల్లేఖ.

"శరీరంఅంతా నొప్పిగా వుంది. చాలా భయంగా వుంది."

"భయపడవద్దు. ఒకటి - రెండురోజుల్లో ఆరోగ్యం చేకూరుతుంది. ఇంకేకష్టమూ లేదుగదా?"

"లేదు."

కొంతసేపటివరకు గది నలువైపులా ఆశ్చర్యంగా చూసి "నేనెక్కడ వున్నాను" అని రోగి అడిగాడు. విద్యుల్లేఖ జవాబివ్వ లేదు. ఏమని చెబుతుంది? ఇన్నాళ్ళవరకు తాను స్వర్గంగా తలచిన ఆనందధామం నే డామెకు నరకంగా తోచసాగింది. ఆమె తనయింటి విషయమై ఆతనితో ఏమని చెప్పుటకూ సాహసించలేకపోయింది.

'మీ రెవరు?' అని అతడు మరల ప్రశ్నించాడు.

"నేనా? నే నొక దురదృష్టశాలనగు ఆడుమ్రస్త్రీని" అన్నది.

"ఇది మీయిల్లేనా?"

"అవును"

"నే నిక్కడకు ఎలా వచ్చాను?"

"ముందు ఆరోగ్యాన్ని చేకూర్చుకో. తరువాత చెబుతాను. నీపే రేమిటి?"

"రమణ్" అని ఆతడు జవా బిచ్చాడు.

# 5

రమణ్ పరిస్థితి నానాటికి బాగుపడుతున్నది. మూడు - నాల్గురోజుల్లోనే అతడు పూర్తిగా ఆరోగ్యవంతు డయాడు. పగలల్లా గదిలో కూర్చొని, ప్రక్కనవున్న గదినుండి వచ్చే అమృత మధురకంఠధ్వనిని విని, ఆతడు ఆశ్చర్యం పొందుతూవుండేవాడు. బయటి కోలాహలమూ, గందరగోళమూ, హాస - పరిహాసాలతో కూడుకున్న మాటలూ విని ఆతడు పొందెడి భ్రమకూ, తన సంరక్షకు రాలిని చూచినప్పుడు ఆతడు పొందెడి విస్మయమునకూ మేర లేదు.

గదిలో పడకకుర్చీ, నిలువుటద్దము, పూలపాత్ర మొదలగు ఆమోద - ప్రమోదవస్తువుల్ని చూచేప్పటికే రమణకు ఎంతో ఆశ్చర్యము కలిగింది. ఆ యింట్లో ఒకదాసీ, ఒకనౌకరూతప్ప మరి యింకె వరిముఖమూ అతడికి నేటివరకు కనిపించలేదు. డాక్టరు ప్రతిరోజూ వస్తున్నాడు. ఇచ్చుకోటం - పుచ్చుకోటానికి సంబంధించిన విషయా లన్నీ విద్యుల్లేఖయే చేసుకుంటోంది.

రోగగ్రస్తుడై మంచంమీద పడుకొనివుండి అత డీసంగతులన్నీ ఆలోచిస్తూవుండేవాడు. ఎంతగా ఆలోచించినప్పటికీ ఏసంగతీ అతడికి బోధపడటంలేదు. నేడు భోజనం, ముగించుకుని, తల ఆరబెట్టుకుం టున్న విద్యుల్లేఖయొక్క ప్రతిబింబం నిలువుటద్దంలో ప్రతిఫలించిం చింది. రమణ యిక్కడకు వచ్చిన తర్వాత మొట్టమొదటిసారిగా యివ్వాళే ఆమె తనముఖాన్ని అద్దంలో చూసుకున్నది. ఇన్నాళ్ళ వరకూ ఆమెకు తన అలంకరణనుగురించిన ధ్యాసయే కలుగలేదు. జీవితం గడిపేందుకు అద్దంలో ముఖం చూసుకుని అలంకరించుకోవాలన్న

సంగతే ఆమెకు పట్టలేదన్నట్టు ఇప్పటివరకు గడిపింది. అద్దంలో తన ముఖం చూసుకోగానే తాను పూర్వంవలె సుందరిగానే వున్నా నని పించింది. తనసౌందర్యం యథాప్రకారంగానే వుంది. తన యీ సౌందర్యం తనమనస్సునూ, హృదయాన్నీ గాయపరచి ఎచ్చటినుంచి ఎచ్చటకు తీసుకువచ్చి పడవేసింది!

ఇదివరకు తా నెక్కడ వున్నది? ఇప్పుడు తా నెచ్చటకు వచ్చింది? ఈ రెండు ప్రదేశములకూ ఎంతదూర మున్నది! ఎంత వ్యత్యాస మున్నది! ఒకచోట త న్నెన్ని సంకెలలు బంధించెడివి! నే డామె యీ రెండుతావులనుగల భేదమును గమనించి కంపించింది. ఆమె నేత్రములు చెమ్మగిలినవి. లోలోపలనే తుపాను ఉత్పన్నమైంది. ఆవలనున్న దృశ్యాలను చూస్తూవుండగా ఆకస్మికంగా వాటిమధ్య ఒక నల్లటితెర పడినట్లనిపించింది. వెంటనే ఆమెదృష్టి రమణవైపు మరలింది. రమణ ఆమెవైపు తదేకధ్యానంతో చూస్తూవున్నాడు. ఇది చూచి ఆమె నేత్రాలని క్రిందికి వాల్చుకుంది. కేశములను కొంగుతో కప్పుకొని సిగ్గుపడింది.

"నేను ఎప్పుడు వెడతాను?" అని రమణ అడిగాడు. "ఎక్కడకు వెడతావు? మీ తల్లి - దండ్రులు ఎక్కడ వుంటున్నారు? వారికి తెలియపరచాలి. ఇన్నాళ్ళవరకు యీసంగతే తోచలేదు. మీ అమ్మ - నాన్న ఎక్కడ వున్నారో చెప్పు. వెంటనే మనిషిని పంపుతాను" అంది విద్యుల్లేఖ.

"నా తల్లి - దండ్రులా! వారు లేరు. చచ్చిపోయారు. నే నొక అనాథబాలుణ్ణి."

"పోనీ, యింకెవ్వరైనా బంధువు లున్నారా?"

"ఇం కెవరూ లేరు. ఈ ప్రపంచంలో నాకు 'నా' అని చెప్పుకోదగ్గవారు ఎవరూ లేరు."

"మరి నువ్వు ఎక్కడ వుంటున్నావు?"

"ఎక్కడని అని చెప్పను? ఈ వూరు వచ్చి మూడురోజులు అయింది. మాయిల్లు ఒక పల్లెటూరులో వుంది."

"ఇక్కడికి ఎలా వచ్చావు? ఆ దుకాణంవద్దకు నీవు ఏ పని మీద వెళ్ళావు?"

రమణ కొంతసేపటివరకు ఏమీ జవాబివ్వలేదు. అతడినోటి నుండి ఏమాటా వెడలలేదు. విద్యుల్లేఖ అతనివైపే చూస్తూవుంది. ఈ అమాయకమగు సుందరముఖంపై భగవానుడెంతటి దురదృష్టరేఖను గీశాడు. కాలచక్రమనెడి కఠోరహస్తాలు మాంసమును ఒలుచుకు తిని యీవిధంగా ఎముకలగూడునుమాత్రం మిగిల్చాయి. రమణ ఆకస్మికంగా తన దురదృష్టగాధను చెప్పసాగాడు. అతని మాటల్ని విని ఆమె ఉలికిపడ్డది.

ఆ పల్లెటూళ్ళో నే నొక బ్రాహ్మణబాలుణ్ణి. తండ్రి నాకు జ్ఞాపకంలేదు. అమ్మ ఒడిలో పెరిగి తాతగారియింట పెద్దవాణ్ణి అయాను. ఆసమయంలో మాతాత (తల్లితండ్రి) గారి పరిస్థితి అంత అన్యాయంగా లేదు. అక్కడక్కడ పురాణం చెప్పి తన పరదృష్ట రితంతుపుత్రిక నిర్మలప్రభనూ, ఆమె ఏకైకపుత్రుణ్ణి నన్నూ పోషిస్తూ వుండేవాడు. భగవదిచ్ఛ! ఒకనాడు మా అమ్మకూడా మరణించింది. అప్పుడు నా వయస్సు ఎనిమిదిసంవత్సరాలు. మా అమ్మమ్మ ఏదో విధంగా అనేకకష్టాలు పడి ఆ దుస్థితిలోకూడా నన్ను పెంచుతూ వుండేది. మా అమ్మకు నేను బాగా చదువుకుని ప్రపంచంలో కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించాలనే కోరిక వుండేది. మా అమ్మమ్మకూడా యీ ప్రయత్నంలోనే వుంది. కాని ఆమె కోరికలన్నీ వ్యర్ధమైపోయాయి. మూడుమాసాల దీర్ఘవ్యాధివల్ల అమ్మమ్మకూడా మరణించింది. మృత్యుశయ్యమీద వున్న సమయంలో - కలకత్తాలో జనార్దనచౌదరికి తానొకప్పుడు సహాయం చేశాననీ, రమణ అచ్చటికి వెళ్ళేయెడల అతడికి అన్న - వస్త్రాలకు ఏ లోటూ వుండదనీ, అతడే చదువు చెప్పిస్తాడనీ, ఏ సందర్భంలోకూడా జనార్దనచౌదరి తప్పక సహాయపడతాడనీ' - చెప్పింది.

ఈ ఆశతో నేను యీ పట్టణానికి వచ్చాను. సియాల్దహా స్టేషనుకు వచ్చి ప్రప్రథమంగా యీ కోలాహలాన్ని చూచేప్పటికే, నేను పొందిన ఆశ్చర్యానికి మేర లేదు. ఆశ్చర్యం కొంచెం తగ్గాక,

జేబులో చెయ్యిపెట్టి చూచుకొనేప్పటికే, జేబులోవున్న రూపాయల సంచీ అదృశ్యం అయింది......ఎంత వెదకినప్పటికీ దొరకలేదు. ఏడ్వసాగాను. వందలకొలది జనం గుమిగూడారు. ప్రశ్నలవర్షం కురిపించసాగారు. నా దుఃఖగాథ విని ఎవరిదారిని వారు వెళ్ళిపోయారు. రోజల్లా ఆకలి - దప్పులతో పట్టణం అంతా గాలించసాగాను. కనిపించిన ప్రతివీథినీ పోయాను. కనిపించిన ప్రతిమనుష్యునీ జనార్దన సౌదరి ఎచ్చట వుంటారని అడిగాను. కొందరు తిట్టారు, మరికొందరు ప్రశ్న విని కొంచెంసేపటివరకు క్రిందు - మీదులు చూసి తమదారిని పోయారు. మరికొందరు జవాబు చెప్పటం తమకు అగౌరవంగా తలచారు. ఎండతీక్ష్ణత, ఆకలితీవ్రత, రాత్రంతా మేల్కొనివుండటం, పట్టణమంతా తిరగటం - యీ కష్టాలన్నిటిమూలానా ఏం చేస్తున్నానో నాకే తెలియకుండాపోయింది. ఒక దుకాణంముందు నుంచున్నానన్నసంగతిమాత్రం జ్ఞాపకం వుంది. ఆ సమయంలో బాగా జ్వరం వచ్చింది. ఒడలంతా వేడితో మండిపోతున్నది. దప్పికవల్ల పెదవులు ఎండిపోతున్నాయి తల తిరుగుతున్నది. బాగా అలసిపోయాను. అడుగులు వేసే శక్తికూడా లేదు. అచ్చటినుంచి కదలటంకూడా కష్టమైపోయింది. అటుసమ్మట......ఒక్క నీటిబిందువు గొంతులోనుంచి లోపలికి దిగగానే - "అబ్బ! ఇంత సంతోషమూ, ఇంతటి శాంతీ ప్రపంచంలో వున్నవా!" అనుకున్నాను.

ఒక్క నీటిబిందువు......కాని, ఆ సమయంలో తల తిరిగింది. కళ్ళముందు చీకట్లు క్రమ్మాయి. ఆపైన, నాల్గువైపులా అంధకారం మాత్రమే కనిపించసాగింది. ఏమీ కనిపించటంలేదు. అంధకారం! నలువైపులనుంచీ అంధకారం వచ్చి శాంతియనెడి ఒడిలో దాచిపెట్టేసింది.

ఆపైన......ఆపైన అతడు కళ్ళు నులుముకొని చూచాడు. పుష్పంలాంటి యీ కోమలశయ్య, యీ కోమల సుకుమారహస్తాలనూ చూచేప్పటికే ఇంద్రుని స్వర్గపురిలో ప్రవేశించి మృత్యురహితమైన శాంతిధామములో శయనించానా - అనిపించింది. ఒకటే ప్రకాశము, కనులను మిరుమిట్లు గొలిపెడి దివ్యప్రకాశము! గదిలో ప్రతిమూల ప్రకాశంతో వెలుగొందుతూవున్నది.

"ఇక్కడినుంచి ఎక్కడకు వెడతావు?" అని విద్యుల్లేఖ అడిగింది.

"తెలియదు. జనార్దనచౌదరియిల్లెక్కడో తెలుసుకుంటాను"

"ఇది కలకత్తానగరం! ఇంత పెద్దపట్టణంలో జనార్దనచౌదరి యిల్లెక్కడో తెలుసుకోటం సామాన్యమా? ఆయన ఏ పేటలో వుంటారో నీకు తెలిస్తే, యిల్లు తెలుసుకోటం కొంచెం తేలిక."

రమణుడి కళ్ళనుండి కన్నీరు బొటబొట కారసాగింది. ఇల్లు తెలుసుకోటం ఎల్లా? ఏ ఉపాయమూ కాన్పించటంలేదు! ఇంతకంటె, మరి రెండుమూడురోజులు రోగగ్రస్తుడుగా వుంటేనే బాగుండేదేమో! వ్యాధివల్ల కలిగేకష్టాన్ని సంతోషంతో ఓర్చుకోగలిగేవాడు!

రోగగ్రస్తునిపట్ల జాలి వహించేవారు, దుఃఖంలో వున్నవారిని చూచి సానుభూతిని ప్రకటించేవారు. దయాళువులు, స్నేహమూర్తులు ఇతరుల దుఃఖమునూ, కష్టమునూ చూచి తాముకూడా దుఃఖించి కన్నీరు గార్చునట్టివారు మాత్రమే విపత్తులోవున్న మానవునకు ఆశ్రియ మివ్వగలుగుతారు. కాని యిప్పు డతడు ఆరోగ్యవంతుడయ్యాడు. ఇట్టిస్థితిలో తాను ఎవరినీ సహాయం చెయ్యమని అడగటం బాగుండదు. ఇక తన భారం యితరులపై మోపటం తగదు. ఈ దేవి తనకు చేసిన మేలు సామాన్యమైనదా? సమయానికి ఈమె చేసిన సహాయాన్ని మించి ఎంత గొప్పవారుకూడా ఎక్కువ చేసినా చెయ్యలేరు. రమణుడు తాను జీవించియున్నంతవరకు యీ దేవికి కృతజ్ఞుడుగా వుంటాడు. ఆమె "అబ్బాయీ! నీ జబ్బు నెమ్మదించింది. ఆరోగ్యవంతుడ వయ్యావు. నీ దారి చూసుకో" అని అనేటట్లయితే ఎవరూ ఆమెను ఏమీ అనేందుకు వీల్లేదు. అయ్యయ్యో! ఇంతకంటె నాకు మరణమే ప్రాప్తించినట్లయితే, ఎంతో బాగుండేది గదా! — అని రమణుడు అనుకోసాగాడు.

"ఒకవేళ, యీశ్వరేచ్ఛవల్ల జనార్దనచౌదరి యిల్లు తెలసేటట్లయితే, ఎక్కడైనా నౌకరీ చేద్దామనియా — నీ ఉద్దేశ్యం?" అన్నది విద్యుల్లేఖ.

"మా అమ్మ నేను బాగా చదువుకోవాలని అనుకుంటూ వుండేది."

"బాగుంది, అలాగా చెయ్యి."

ఆటపోయిన రమణుడి పెదవులపైన కొద్దిసేపటివరకు చిరునవ్వు చిందులాడింది. తాని నోటినుండి ఏ మాటా వెడలిరాలేదు.

"నీకు చదువుకు నేందుకు తగిన ఏర్పాటు చేస్తాను. బాగా చదువుకో. మీ అమ్మగారి కోరిక నెరవేరుతుంది."

కృతజ్ఞతతో కూడియున్న రమణుడి కనులనుండి బాష్పధార కావ్పొంగింది. సందేహస్వరంతో అతడు "అమ్మా!" అన్నాడు.

"ఛీ! 'అమ్మా' అనకు. 'అమ్మ' అనే పవిత్రశబ్దంతో నన్ను పిలిచి ఆ మాటను అపవిత్రం చెయ్యకు."

రమణుడు ఏడుస్తూ 'అమ్మా' అని మళ్ళీ పిలిచాడు.

విద్యుల్లేఖ వ్యధితురాలైంది. ఆమె తేజోవంతములు నేత్రాల నుండి ముత్యాలు రాలసాగాయి. కొద్దిసేపు మౌనం వహించి - "నీవు నన్ను 'అమ్మా' అంటున్నావు. ఛీ! వెలయాలు - వేశ్యనుకూడా 'అమ్మా' అని పిలిచేవాళ్ళు ఎవరైనా వున్నారా ?"

గంభీరసముద్రంలో మునిగివున్న మనుష్యుడు తనశక్తికొలది యీది ఏదోవిధంగా ఒడ్డుకు చేరి, అలసటవల్ల శరీరంఅంతా బాధ పడుడూ వున్నసమయంలో, ఎవరైనా వచ్చి అతనిని ఒక్కసారి నెట్టి సముద్రంలో పడవేస్తే ఆమనుష్యుడు ఏస్థితిని పొందుతాడు, సరిగా అదేస్థితిని రమణుడుకూడా పొందాడు. అతడి గాయపడిన హృదయంమీద ఎవరో వందలకొలది సమ్మెట దెబ్బలు కొట్టినారం భించినటుల అతడు బాధపడసాగాడు.

విద్యుల్లేఖ సంబాళించుకొని యిలాఅంది. "ఈకారణంవల్లమాత్రమే నీవు మరొకచోట వుండవలసివస్తుంది. నావద్ద నిన్ను వుంచుకో గూడదు. ఈ పట్టణంలో నీలాంటి పిల్లలు వుండేందుకు పనికివచ్చే బోర్డింగ్ హౌసులు చాలా వున్నాయి. వీటిలో దేనిలోనైనా వుండాలి. డబ్బువిషయంలో నీ వేమీ బాధపడనక్కరలేదు. దానికి తగిన ఏర్పాట్లు నేను చేస్తాను. అక్కడ నీకు ఏవిధమైన కష్టంయీ

వుండదు. ఒక్కసంగతి. నీవు యిక్కడకు వచ్చేందుకు వీలుండదు. ఇంతేగాదు. నేనుకూడా చూచేందుకు నిన్నెప్పుడూ పిలువనంపను." రమణుడి బాష్పధార కట్టువడ్డది. అతడు ఏడుస్తూ ఆనందభరిత స్వరంతో 'అమ్మా......' అన్నాడు.

## 6

వారం-పదిరోజులు అయిన తరువాత విద్యుల్లేఖ రమణుణ్ణి బోర్డింగ్ హౌసుకు పంపించి, తన జీవితాన్ని వ్యర్థజీవితంగానూ తానొక అనవసురాలననీ తలంచసాగింది. రమణుడి వియోగవ్యసను అనుభవించసాగింది. అతడు వెళ్ళిపోవటంవల్ల తన శరీరంలో ఏదో ఒక అవయవం కోల్పోయినటుల అనుభవం కాసాగింది. పొరుగునవున్న తనవంటి ఒక దురదృష్టవతియగు వెలయాలు హార్మోనియం వాయిస్తూ, పాట పాడుతూంటం వినిపించింది.

విద్యుల్లేఖ ఒక మంచంమీద పడుకొని ఆపాట వినసాగింది. దాగియున్న ఒక ఆలోచన ఆమె హృదయాన్ని కలవరపరిచింది. కిటికీగుండా నీలాకాశం కనిపిస్తూవుంది. ఆమె అటుచూడసాగింది. నిర్మలమైన నీలాకాశం, దానికితోడు వెన్నెలరాత్రి, ఎంత మనోమోహకమూ, హృదయాకర్షకమూనగు దృశ్యము!

తరువాత ఆమె గదిలోగల ప్రతివస్తువుపైనా దృష్టిని ప్రసరింపజేసింది. ఆమోదప్రమోదములకు కావలసిన పరికరాలు అన్నిటితోనూ అలంకరింపబడివున్న గది...... ప్రక్కనవున్న యింటినుండి ఇంకా పాట వినిపిస్తూనేవున్నది.

విద్యుల్లేఖ తన బాల్యావస్థనాటి సంగతులను జ్ఞప్తికి తెచ్చుకోసాగింది. ఎన్నాళ్ళనాటిసంగతి! తన గతించిన జీవితంలో ప్రకాశజ్యోతిని ఆమె ఎన్నడునూ చూడనేలేదా! లేదు. ఒకవేళ ఏదైనా చూసినా అది కేవలం మృగతృష్ణను పోలినది...

బాల్యావస్థలో ఆమెజీవితం నిశ్చింతగా గడిచింది. తాను నెరవేర్చుకోవాలని విచారించిన ఏ కోరికా ఆమె హృదయంలో లేదు. ఆపిమ్మట... ఆపెండ్లినాటిరాత్రి... ఆమె తన వస్త్రాలను చూసు

కని పట్టరానంత ఆనందాన్ని పొందింది. ఆమె హృదయంలో ఎన్నో ఆశలు మేల్కొని స్థానాన్ని సంపాదించుకున్నాయి. నాల్గువైపులా ఎంత ప్రకాశం దృగ్గోచర మయింది! ఆ పిమ్మట ఆ ఆనందదాయక మగు రాత్రి......ప్రేమ, మరియు సౌభాగ్యమనేటి గుప్తజాలముల అనుభవంతో ప్రతిక్షణమూ గడిచింది. కాని ఆ కలలు నిజం కాలేదు. ఆ తరువాత, ఆశలనెడి సుందరమనోహరమైన ధ్యానంకూడా కాలచక్ర మనెడి అగ్నిలో పడి కాలిపోయి బూడిదయైపోయింది. ఒక్క గాలిదెబ్బతో జీవననౌకను నడపునాతడు ఎచ్చటనో తెలియని దూర ప్రదేశాన పడి అదృశ్యుడైనాడు. అంతా మార్పు చెందింది. సమస్తమూ మారిపోయింది.

ఆమె హృదయంలో చెలరేగిన తరంగంవల్ల కలవరం వ్యాపించింది. ఆమె జీవితంలో మార్పు వచ్చింది. ఆ క్షణిక జీవితంలోనూ ప్రారబ్ధం ఆమెతో ఎన్నో ఆటలు ఆడింది, ఎంతో నిర్దయగా వ్యవహరించింది. గతించిన సంఘటనలు అనే సముద్రం నేడు ఏకాంతంలో ఆమె కనులఎదుట రక్తపింతతరంగరూపమున మోతలు పెట్టసాగింది.

తల్లి - దండ్రుల గారాబము, ఆ చిన్నయిల్లు, సహచరత్వము, ఒక్కొక్కటిగా అన్నీ జ్ఞప్తికి వచ్చాయి. ఆ సహచరత్వానికి తాను ప్రతిరోజూ వెడుతూవుండేది. ఎక్కడకు? తన స్నేహితురాలి యింటికి. శీతాకాలం ప్రాతఃకాలసమయంలో దుప్పటి కప్పుకొని స్నేహితురాండ్రిందరూ చిరుతిండి తింటూ వెడుతూవుండేవారు. ఒకనాడు ఎవరో ఒకవృద్ధుడు వచ్చి మధుసూదన శాస్త్రాచార్యులుగారి యిల్లెక్కడని?" అని అడిగాడు.

వెంటనే ఒకఅమ్మాయి "జ్యోతి అక్కా" అని పిలిచింది. ఆ రోజుల్లో విద్యార్థినిని 'జ్యోతిష్మతి' అని పిలుస్తూవుండేవారు. ఆహా! ఎంత చక్కని పేరు! 'జ్యోతిష్మతి' ఎంత అపూర్వ సర్వాంగ సుందరి! ఎంతటి అపూర్వరూపము! కన్య! వెన్నెలతునక! జ్యోతిష్మతిని అందరూ ప్రేమగా చూచేవారు. ఎంత తీక్ష్ణమైన సుందరశరీరం ఆమెది! ఇట్టి సుందరిని ఎవరూ స్వప్నంలోకూడా చూసివుండరు. ఆమె విద్యార్జనలో ఎంతో ప్రతిభ చూపేది. చూచి అందరూ చకితు

లయ్యేవారు. ఆమె ఏమార్గాన వెడితే అటే అందరూ కనుల ప్పగించి చూచేవారు. నవయువకుల సమూహం, జ్యోతికి తమ హృదయమందిరంలో స్థానా న్నిచ్చి, ఆమెను దేవతతో సమానంగా పూజించేందుకూ, ప్రేమించేందుకూ ఆతురత చూపుతూవుండేది.

జ్యోతిష్మతి ఆ వృద్ధుణ్ణి చూసి, అతడిదగ్గరకు వెళ్ళింది. "అమ్మాయీ! నీవు భట్టాచార్యుల పుత్రికవా?" అని అడిగాడు వృద్ధమహాశయుడు.

"అవును! తమరు వారికోరకై వచ్చినట్టున్నారు! నాతో దయ చేయండి."

జ్యోతిష్మతిని శ్రద్ధగా పరికించి చూసి, 'యీ కన్య సాక్షాత్తు లక్ష్మీదేవియే! నా యీరాక వ్యర్థం కాదని నా పూర్తినమ్మిక' అని వృద్ధుడు అనుకున్నాడు.

# 7

చంద్రనగరు జమీందారు చంద్రకాంత చౌదరి తనకుమారుడికి జ్యోతిష్మతిని వధువుగా తెచ్చుకొనే తలంపుతో, తన దివానును అచ్చటికి పంపించా డన్నవార్త గ్రామస్థులు వినగానే, ప్రతివాడూ "ఆరె! ఆరె!!" అనేవాడే! గ్రామస్థులు యీవార్త విని సంతోషించ లేవనేందుకు వీల్లేదు. కొందరు "ఇంతసౌదర్యవతియగుకన్య, రాణి అవుతుంది" అన్నారు. చంద్రకాంతచౌదరి గొప్ప జమీందారు డన్న సంగతి అందరికీ బాగా తెలుసు. చంద్రకాంతుని కొడుకు లక్ష్మీకాంతుడికీ జ్యోతిష్మతికీ వివాహం త్వరలోనే జరుగనున్నదన్న వార్త విని, ఒకరిద్దరు గ్రామస్థులు కించపడ్డారు. తమకొడుక్కు జ్యోతిష్మతిని చేసుకొని తమ గృహాన్ని ప్రకాశవంతంగా చేసుకుందామని వారు అనుకున్నారు. కాని, చంద్రకాంతచౌదరి యీప్రయత్నంలో వున్నాడన్నసంగతి విన్నతరువాత, మధుసూదన భట్టాచార్యునివద్ద యీప్రస్తావన తెచ్చేందుకు వారు సాహసించలేకపోయారు. వారి అభిలాషలు వారిహృదయాల్లోనే అణగిపోయాయి.

చంద్రకాంత చౌదరి తనంతటానే యీప్రస్తావన తేవటం చూచి మధుసూదనభట్టాచార్యులు ఏమాత్రమూ విస్మయం పొంద

లేదు. ఇందులో ఆశ్చర్యపడవలసిన విషయం ఏమున్నది? తనకుమార్తెను గొప్పకుటుంబంలో జన్మించిన ఐశ్వర్యవంతునకు యిచ్చి వివాహం చెయ్యవలెననే భావం అతడి హృదయంలో పొందటినుంచీ వుండనేవున్నది. ఈ కారణంవల్లనే, తన కుమార్తెకు యౌవనం వచ్చిందన్న విషయం తెలిసికూడా నిశ్చింతగా రోజులు గడుపుతున్నాడు. జ్యోతిస్మృతి ఒక అపూర్వసుందరి. ఆమె నివసించేందుకు ఉచ్చైకులస్థుడైన ఏధనికజమీందారు గృహమో కావాలి. ఆడంబరంతో తన జీవితాన్ని గడపదగిన యోగ్యత ఆమెలో వుంది. జ్యోతికి ఆమోద - ప్రమోదముల ననుభవించుటకు కావలసిన సాధనలు ఎందుకు లభించవు? ఆమె సాధారణకన్యయా? ఆమె రూపు_రేఖలు సాధారణమైనవా ?

మాట్లాడిన వెంటనే వివాహసంబంధం స్థిరపడింది. తరువాత, ఒకనాడు అతివైభవోపేతగా వివాహంకూడా జరిగింది. జ్యోతిస్మృతి అత్తవారింటికి వెళ్ళేటప్పుడు గ్రామస్థులు అందరూ ఆమెవియోగ దుఃఖాన్ని అనుభవించారు. హేమంతుడికి జ్యోతి వియోగం అందరికంటె ఎక్కువ దుఃఖాన్ని కలిగించింది. అతడు కలకత్తా కాలేజీలో బి. ఏ. చదువుతున్నాడు. మధుసూదనభట్టాచార్యుల యింటికి దగ్గరలోనే అతడి యిల్లు వుంది. హేమంతుడితండ్రి కలకత్తాలో ఏదో ఆఫీసులో హెడ్‌క్లార్కు. అత డక్కడ అద్దెయింట్లో నివసిస్తున్నాడు. శెలవు రోజుల్లో గ్రామానికి వచ్చి వారం - పదిరోజులు వుండి కలకత్తాకు వెళ్ళిపోతూ వుండేవాడు.

ప్రప్రథమంలో, హేమంతుడు గ్రామానికి రాకుండావుండేదుకు అనేకపన్నాగాలు పన్నుతూవుండేవాడు. పాడుపడ్డ గ్రామాలని, పల్లెటూరి మూర్ఖప్రజ లని, నిరక్షరాస్యు లని, గౌరవించటమే వారికి తెలియ దని, సంభాషించే విధానమే తెలియ దని, ఎప్పుడూ వ్యవసాయానికి సంబంధించిన మాటలే తప్ప వేరే మాట్లాడ నేరని ప్రజలమధ్య నివసించి చదువుకొన్న తనలాంటి వ్యక్తి సుఖంగా జీవితం ఎలా గడుపగలుగుతాడు అని అంటూండేవాడు.

హేమంతుడి తండ్రికి గృహస్థ బాధ్యతలవల్ల, ఆఫీసుపనుల వత్తిడివల్ల గ్రామానికి వెళ్ళేందుకు అవకాశమే వుండేదికాదు. ఆ సంవత్సరం కలకత్తాలో ఒక క్రొత్తవ్యాధి వ్యాపించింది. ప్రజలందరూ పట్టణం విడిచిపెట్టి అటు - యిటు పారిపోసాగారు. హేమంతుడు కూడా తనబంధువుల్ని వెంటబెట్టుకుని స్వగ్రామానికి వెళ్ళాడు.

ఆ గ్రామంలోకూడా అతడికి ఒక హృదయాకర్షకవ్యక్తి గోచరించింది. ఆమె మరెవరూ కాదు! జ్యోతిష్మతి! హేమంతుడికి ఆమెపై ప్రేమ కలిగింది. అందువల్ల అతడికి తీరిక కలిగినప్పుడల్లా గ్రామానికి వస్తూవుండేవాడు. రెండుమూడురోజులు వుండే అవకాశం లభించినాసరే, అతడా అవకాశాన్ని జారవిడిచేవాడు కాదు.

దీనికంతటికీ కారణం జ్యోతియే. ఇప్పుడు జ్యోతికి పదమూడవ సంవత్సరం ప్రవేశించింది. ఈ చిన్నవయస్సులోకూడా ఆమె చతుర్దశినాటి చంద్రుడివలె ప్రజ్వలితంగావుంది. ఆమెకుగల శృంగార సామగ్రిని చూసి యౌవనంకూడా తన హృదయాన్ని తెరచి సరసరంలోనూ నింపుకున్నట్టూ అనిపిస్తోంది. ఆమె చీకటింగా ఎదురుపడ్డప్పటికీ, ఆమె సౌందర్యాన్ని తనివితీరా చూడాలనే కోరిక జనిస్తుంది. జ్యోతియొక్క సౌందర్యసాగరంలో యువకహృదయాలనే తరంగాలు కల్లోలితములై పోతూలండేవి.

హేమంతుడు ఒకనాడు జ్యోతియొక్క సౌందర్యపుఫాంగును చూశాడు. చూచుటతోడనే అతడిహృదయం అతడి వశం తప్పింది. మేస్త్రీలూ, తాపీవాళ్ళూ చేసేపనిలో దోషాలు తీసి, అతడు యింటి మరమ్మతులో చాలా ఆలస్యం అయేట్టు చేశాడు. మరమ్మతుపని పెరిగిపోయింది. అందువల్ల అతడు ప్రతిరోజూ కలకత్తా వెళ్ళటానికి వాయిదా వేస్తూవచ్చాడు.

జ్యోతిని చూచినంతమాత్రాన హేమంతుడి హృదయానికి సంతోషం కలగటంలేదు. జ్యోతితో రెండు - మూడు ప్రియమైన మాటలు మాట్లాడాలని అతడిమనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. కాని, అతడి హృదయగతవాంఛ నెరవేరే అవకాశం ఏది?

చివరకు ఒకరోజు అదృష్టవశమున హేమంతుడికి జ్యోతితో సంభాషించేందుకు ఒక చక్కటి అవకాశం లభించింది. సంధ్యాసమయంలో జ్యోతి తన స్నేహితురాలి యింటినుండి మరలి వస్తోన్నది. సరిగా ఆదేసమయంలో హేమంతుడు చల్లగాలికి వాహ్యాళికి వెడుతున్నాడు. జ్యోతిని దూరంనుండి చూసి హేమంతుడు యిది మంచి అవకాశం అనుకున్నాడు.

అకస్మికంగా జ్యోతి అరిచింది. హేమంతుడు ఆ సమయంలో తనధోరణిలో తల్లీనుడై నడుస్తున్నాడు. జ్యోతి అకస్మికంగా అరవటం వల్ల అతడు ఆగిపోయాడు. ఏదో ఆవు, పలుపు తెంచుకొని జ్యోతి వెనువెనుకనే రావటం చూశి, వెంటనే వెళ్ళి దానిపలుపును పట్టుకున్నాడు. వెంటనే ఆ ఆవును ఒకచెట్టుకు కట్టివేసి, పరుగెత్తుకొని వచ్చి జ్యోతితో "భయపడకు, తిన్నగా యింటికి వెళ్ళు" అన్నాడు.

జ్యోతి రొప్పుసంటూ యింటికి వెళ్ళింది. హేమంతుడు మౌనంగా అక్కడే నుంచునివున్నాడు. అతడకి తన శరీరస్మృతికూడా లేకుండాపోయింది. జ్యోతి వెళ్ళిపోయినతరువాత కొంతసేపటికి అతడికి స్పృహ వచ్చింది. "ఈ పిరికి హృదయాన్ని ముక్కలుముక్కలు చేసినట్లయితే ఎంతో బాగుండేది! వెర్రిపిల్లవాడివలె. చేతికి అందిన సుఖాన్ని జారవిడిచాను! స్వర్ణావకాశాన్ని పోగొట్టుకున్న మూర్ఖుణ్ణి. గజగజవణుకుతున్న జ్యోతి చెయ్యి పట్టుకుని యింటికి చేర్చినట్లయితే ఎంత బాగుండేది! అయ్యో! ఎంత మూర్ఖంగా వ్యవహరించాను" - అనుకున్నాడు.

హేమంతుడు అక్కడ క్షణంసేపుకూడా ఆగలేదు. మధుసూదన భట్టాచార్యుల యింటికి వెళ్ళి 'భట్టాచార్యులుగారూ!' అని పిలిచాడు అసమయంలో భట్టాచార్యులు యింటివద్ద లేరు. ఆయన భార్య లోపలినుంచి "ఎవరు వారు?" అని అడిగింది.

"నేను హేమంతుణ్ణి. మీయింటిప్రక్క యిల్లే."

"సుశీలబాబుగారి కుమారుడవా!"

"అవునండీ!"

"లోపలికి రా అబ్బాయీ! నాపుత్రునివంటివాడవు."

హేమంతుడు కంపిస్తూ గుమ్మంలో అడుగు పెట్టాడు. ఆసమయాన జ్యోతి తనతల్లివద్దనే కూర్చొని వున్నది. ఆమెతల్లి దీపం వెలిగించే ప్రయత్నంలో వుంది.

"జ్యోతిని యివ్వాళ ఒకఆవు వెంబడించింది. ఏమైనప్పటికీ ఏప్రమాదమూ లేకుండానే ఇంటికి వచ్చింది" అన్నాడు హేమంతుడు.

"అందుకనేగాబోలు రొప్పుకుంటూ వచ్చింది."

"నేను ఆదారినే వస్తున్నానప్పుడు"

"దీర్ఘాయుష్మంతుడవౌదువుగాక! ఏమే జ్యోతీ! నా కీసంగతే చెప్పావుకావు!" అని ఆమెకేసి చూచింది.

జ్యోతి ఏమి చెబుతుంది! క్రిందికి చూస్తూ మౌనంగా కూర్చుండిపోయింది. జ్యోతి ఏం మాట్లాడుతుందోనని హేమంతుడు ఆలోచిస్తున్నాడు. కొంచెంసేపు ఆగి "ఆమెను ఒంటరిగా ఎందుకు పోనిస్తారు?" అన్నాడు.

"పల్లెటూళ్ళు అబ్బాయీ! అందరిలాగే జ్యోతికూడా ఒంటరిగానే వెడుతూవుంటుంది."

లజ్జతో తటపటాయిస్తూనే, హేమంతుడు యింకా ఎన్నో సంగతులు మాట్లాడాడు.

జ్యోతి బాగా చదువుకున్నది. చదువుతోపాటు యింటిపనులు చేయటంలోకూడా ఆమె నిపుణురాలే. పెండ్లిసంబంధాలను గురించి రెండు — మూడు చోట్లల్లో సంభాషణలు జరుగుతున్నాయి. అమ్మాయిని చదువురాని ఏమూర్ఖుడి చేతిలోనో పడవెయ్యరాదని అభిప్రాయం. అమ్మాయికి ఎవరైనా బాగా చదువుకున్న వరుడు లభిస్తే చాలు! అని ఆమె మనస్సులోగల ఈ మాటకాస్తాకూడా సంకోచించకుండా చెప్పేసింది.

ఇలా మాట్లాడుతూండగానే ప్రొద్దు కూకింది. "అమ్మాయీ! వెళ్ళి పొయ్యి అంటించు" అన్నది తల్లి. ఆమాట వినగానే జ్యోతి లేచి

వెళ్ళింది. ఆమె వెళ్ళిపోగానే హేమంతుడి హృదయం కుదుటబడ్డది. "నేనుకూడా యిక వెడతాను. ఇంటిగోడవలవల్ల మాకు ఇక్కడకు వచ్చే తీరిక వుండదు. అందువల్లనే మేము గ్రామంలో ఎక్కువ కాలం వుండలేకపోవటం. ఏదైనా అవసరమైన పని వచ్చినప్పుడు మాత్రం యిక్కడకు వస్తూవుంటాము. లేకపోతే, మాకు మీ క్షేమ సమాచారాలుకూడా తెలియకపోయేవే." అన్నాడు హేమంతుడు.

"నువ్వు కలకత్తాకు ఎప్పుడు వెడతావు అబ్బాయీ!" అన్నది ఆమె. హేమంతుడు మరునాడే కలకత్తాకు వెడదామని అనుకున్నాడు. కాని, యీ నూతన పరిచయంవల్ల యింకా రెండు మూడు రోజులు యిక్కడ వుంటే బాగుంటుంది అనుకున్నాడు. అందువల్ల "రెండు - మూడు రోజుల్లో వెళ్ళాలి. కాలేజీ శెలవులుకూడా అయిపోయాయి" అన్నాడు.

"ఇక్కడికి వచ్చినప్పుడల్లా మాయింటికి తప్పక వస్తూవుండు. మీనాన్నగారు వచ్చినప్పుడల్లా వారిని (భట్టాచార్యులు) తప్పక కలుస్తూవుంటారు. జమీందారీ వ్యవహారాల్లోకూడా వారి సలహా తీసుకుంటూ వుంటారు."

అంధకారంతో నిండివున్న హేమంతుడి హృదయంలో ఆశ యనెడి జ్యోతిర్మయ కిరణాలు అకస్మికంగా విద్యుత్తువలె మెరసి అంధకారాన్నంతని తొలగించాయి. "రేపు తప్పక వస్తాను. ఉదయాన వారిని కలుసుకుంటే..." అన్నాడు హేమంతుడు.

"అవును, ఉదయాన వారు యింటివద్దనే వుంటారు."

హేమంతుడు లేచి నుంచున్నాడు. వెడుతూ యిలా అన్నాడు "జ్యోతికి కొన్నిపుస్తకాలు తీసుకువస్తాను. ఆసక్తితో చదువుకుంటుంది."

రెండుమూడు రోజులే కాదు, వారం రోజులు గడిచిపోయాయి. అయినప్పటికీ హేమంతుడు కలకత్తాకు వెళ్ళేప్రయత్నమే చెయ్యలేదు. కలకత్తానుండి ఉత్తరాలమీద ఉత్తరాలు వస్తున్నాయి. కాని గ్రామాన్ని వదలి వెళ్ళనేలేదు. ఎందువల్లనో ఎవరూ తెలుసుకోలేకపోయారు.

చివరకు ఈ ఉత్తరాలు అన్నిటికీ జవాబిస్తూ హేమంతుడు ఒక పెద్దఉత్తరం రాశాడు. అందులో "పట్టణంలోనే నివసించనక్కరలేదు. గ్రామంలో అందరూ నన్ను గౌరవంగానే చూస్తున్నారు. అవసరం వచ్చినప్పుడు సుఖంగా వుండేందుకు వీలుగా యింటిమరమ్మత్తు స్వయంగా చేయించుకోటం అవసరం" అని వ్రాశాడు.

హేమంతుడి ఉత్తరం అందగానే, అతడితల్లి భర్తను సంబోధించి "చూచారా! మనహేముకు యిప్పుడీసంగతులుం బోధపడుతున్నాయి" అన్నది.

జ్యోతికి హేమంతుడితో గాఢమైత్రి ఏర్పడ్డది. తరుచుగా 'విద్య' మొదలైన విషయాలనుగురించి చర్చించుకుంటూ వుండేవారు. ఆంగ్లపద్యాలలోనూ, నాటకాలలోనూ వున్న ఎన్నోకథలను హేమంతుడివల్ల జ్యోతి విన్నది. హేమంతుడి ప్రేమభరితమగు హృదయముద్ర జ్యోతియొక్క నవీన - కోమల హృదయంమీద చక్కగా ముద్రితమయింది. హేమంతుడితో సంభాషించినప్పుడు 'ఏదో ఒక నవీనమనోమోహక స్థానమున షికారు చేయునప్పుడు' పొందే ఆనందాన్ని ఆమె అనుభవిస్తూవుండేది. స్నేహితురాండ్రు చెప్పే సాధారణవిషయాలు ఆమెహృదయాన్ని యిప్పుడు ఆకర్షించటంలేదు. రాత్రులందు శయ్యపై పడుకున్నప్పుడు "ఎప్పుడు తెల్లవారుతుందా?" అని ఆమె యోచిస్తూవుండేది. హేమంతుడు వచ్చి మాట్లాడుతాడు, కథలు విని పిస్తాడు అని ఎదురు చూస్తూవుండేది. హేమంతుడి నగుమోము, అతడి సంభాషణలూ ఆమెహృదయాన్ని ఆక్రమించుకోసాగాయి.

జ్యోతి హేమంతుడివద్ద ఇంగ్లీషు మొదటిపుస్తకం చదువనారంభించింది. భట్టాచార్యులవారు ఏ అడ్డంకూ పెట్టలేదు. యీరోజుల్లో ఆడపిల్ల బాగా చదువుకుంటే నవయువకులు కట్నాలకు ఆశపడరు - అనేసంగతి ఆయనకు బాగా తెలుసు.

హేమంతుడికి జ్యోతితో యింత ఘనిష్ఠత ఎందుకు ఏర్పడ్డదో చెప్పటం చాలా కష్టం. లోభియగు తన తండ్రి జ్యోతికీ తనకూ వివాహం చేసేందుకు ఒప్పకోడని అతడికి బాగా తెలుసు. జ్యోతియొక్క హృదయాకర్షకమగు సుందరప్రకాశము లోకాన్నంతనీ ప్రకాశమ

యంగా చేసిన చేయుగాక. అయినప్పటికీ ఈవివాహం జరగటం అసంభవమే. జ్యోతి బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణురాలు అగుగాక. అయినప్పటికీ ఆమెవివాహం హేమంతుడితో జరగటం అసంభవమే.

అయితే అతను జ్యోతిని ఎందుకు ప్రేమిస్తున్నాడు? కారణమేమిటి? యౌవనంలో ప్రేమపిపాస పురుషులహృదయంలో జనిస్తూ వుంటుంది. దాని ప్రభావంవల్లనే హేమంతుడు జ్యోతిని కనులార చూస్తున్నాడు. జ్యోతిని చూడగానే ఆశతో దప్పికగొన్న అతని కనులు ఆమెపై ప్రసరించేవి. ఆమెను చూచి, ఆమెతో సంభాషించినందువల్ల అతడు పొందే అపారఆనందం, ప్రసన్నత ప్రపంచమందలి మరి యేయితర వస్తువులవల్లనూ లభించనేరవని అతనినమ్మకం. జ్యోతివద్ద వున్నందువల్ల, ఆమెతో సంభాషించినందువల్లనూ, అతడి ఆశావంతమగు హృదయానికి ఒక విచిత్రమగు సుఖానుభూతి కలిగేది. కాని, దానితోపాటుగా నిగూఢమగు నెడి చీకటికెరటం కూడా ప్రవేశించి ఆ సుఖానుభూతికి విఘ్నాన్ని ఆపాదిస్తూవుండేది.

"లభించదు! లభించదు!" అనేమాటలు మళ్ళీ - మళ్ళీ అతని విలక్షణ సంతోషభరిత హృదయమున మొలకెత్తిన ఆశాలతల ఆకర్షణోద్యానవనంలో విషబీజాల్ని నాటుతూవుండేది.

ఇంకొకవారం గడిచింది. కాని, హేమంతుడు కలకత్తాకు వెళ్ళలేదు. అతడి తండ్రివద్దనుంచి ఒక ఉత్తరం వచ్చింది. "కాలేజీకి శెలవు పెట్టి యింటికిమకాము చేయించనక్కరలేదు. ఉత్తరం అందగానే కలకత్తాకు రావలెను" అని అందులో వుంది.

హేమంతుడు తనదురదృష్టానికి లోలోపల విచారపడసాగాడు. రోజల్లా అతడు యింట్లోనుంచి బయటకు రాలేదు. మొదలనుండా ఉదాసమనస్కుడై గదిలో పడుకొనివున్నాడు. సంధ్యాసమయానికి కొంచెం ముందుగా ఉద్యానవనానికి వెళ్ళాడు. చిన్న - చిన్న పొదల్లో చిన్న - చిన్న మొక్కలు రకరకాల పుష్పాలతో నిండి వున్నాయి. ఎక్కడినుంచి వచ్చిందో, జ్యోతి అతడిదగ్గరకు వచ్చి నెమ్మదిగా "యివ్వాళ అక్కడికి రాలేదేమి?" అని అడిగింది.

"రాలేదు" అనిమాత్రం చెప్పి జ్యోతి ముఖంవైపు హేమంతుడు రెప్పవాల్చకుండా చూస్తూవున్నాడు. 'అంపగత్తెయగు జ్యోతి ఏ భాగ్యవంతుడికి లభిస్తుందోగదా!' అని ఆలోచిస్తున్నాడు. జ్యోతిని వివాహం చేసుకొన్నవాడు బిచ్చగాడైనప్పటికీ 'రాజు' అని పిలిపించుకుంటాడు. ఆ పురుషుడికి ప్రపంచంలో ఏ కొరతా వుండదు

"ఎందుకు రాలేదు?" అని అడిగింది జ్యోతి మళ్ళీ. ఆమె మాటలో ఔదార్యం గోచరిస్తోంది.

"రేవు నేను కలకత్తా వెళ్ళాలి. అందువల్ల రాలేకపోయాను."

"మళ్ళా ఎప్పుడు వస్తావు?"

"చెప్పలేను. మరల రాలేనేమోకూడా!"

జ్యోతి ఏమీ అనలేదు. మెదలకుండా నుంచునిఉంది. హేమంతుడు నిట్టూర్చి "జ్యోతీ! కలకత్తాలోకూడా నీవు జ్ఞాపకంవచ్చి నన్ను బాధిస్తూనేవుంటావు. బహుశః అక్కడ నేను సుఖంగా వుండలేనేమో కూడా" అన్నాడు.

జ్యోతి కళ్ళనుండి కన్నీరు వెడలివచ్చింది. నోటినుండి ఏమాటా వెలువడలేదు. హేమంతుడు లేచి నుంచున్నాడు. జ్యోతి రెండు చేతులూ పట్టుకొని "జ్యోతీ!" అన్నాడు.

హేమంతుడి శరీరమంతా ప్రేమావేశంతో కంపిస్తూవుంది. జ్యోతికూడా యీ విషయాన్ని చూసింది. ఆమె తలవంచుకొని "ఏమిటి?" అన్నది. హేమంతుడు మరల "జ్యోతీ!" అన్నాడు.

జ్యోతి హేమంతుణ్ణి కన్నీటితో నిండిన దృష్టితో చూసింది. సరిగా అదేసమయాన చెట్లఆకుల మధ్యనుండి ప్రసరిస్తున్న సూర్యభగవానుని స్వర్ణకిరణాలు ఆమెముఖంమీద పడ్డాయి. కన్నీరు ముత్యాలవలె ప్రకాశించసాగింది. హేమంతుడు యీ దృశ్యాన్ని చూచి శరీరస్మృతిని కోల్పోయాడు. అతడు పిచ్చివానివలె గట్టిగా జ్యోతిని కౌగిలించుకొని ఆమె అరుణ కపోలాలను చుంబించాడు. జ్యోతి మెదలకుండా నుంచున్నది. కదలనైనా కదలలేదు! సుందరమైన రాతిబొమ్మవలె స్పృహలేకుండా నుంచున్నది. ఆమె శిరస్సు లజ్జచే క్రిందికి వాలింది.

హేమంతుడు ఆ వ్యామోహంలోనే ఆమెను యింకొకమారు కౌగలించుకున్నాడు. నెమ్మదిగా "జ్యోతీ! నిన్ను నేను ప్రేమిస్తున్నాను." అన్నాడు. జ్యోతి యిప్పుడుకూడా కొయ్యబొమ్మవలెనే వుంది. హేమంతుడికి క్రమక్రమంగా స్పృహ రాసాగింది. "జ్యోతీ! నీవు నన్ను ప్రేమించటంలేదా? నీకు నాపైన ప్రేమ లేదా?" అని అడిగాడు జ్యోతి జవాబివ్వలేదు. హేమంతుడు మరల "చెప్పు జ్యోతీ, చెప్పవూ!" అన్నాడు.

జ్యోతి తలవంచుకుని "ప్రేమిస్తున్నాను" అన్నది. "అయితే, నన్ను మరిచిపోవుగదా?" అన్నాడు హేమంతుడు.

జ్యోతి యీ ప్రశ్నకు ఏమని జవాబివ్వగలదు? ఆమె యీ సంగతులన్నీ వినేందుకు సంసిద్ధురాలై రాలేదు.

"మన యిద్దరికీ వివాహం అయితేనో!" అన్నాడు.

హేమంతుడి యీ మాటలు జ్యోతి హృదయంపైన బాగా పనిచేశాయి. ఆమె కంపించింది. శరీరంఅంతా చెమటపోసింది. ఒక్క మాటకూడా ఆమెనోటినుండి వెగిలిరాలేదు. లజ్జ ఆమె శరీరాన్ని సంపూర్ణంగా అంధకారంవలె ఆవరించివైచింది. "అబ్బ! వివాహమా! ఎంత లజ్జాకరమైనమాట!" అని ఆమె అనుకుంది.

ఈశ్వరుడు ఆమెకు ముక్తిమార్గాన్ని ప్రసాదించాడు. ఎక్కడి నుంచో 'జ్యోతీ!' అని ఎవరో పిలిచారు.

"అమ్మ పిలుస్తున్నది" అని చెప్పి ఒక్కక్షణంకూడా అక్కడ వుండకుండా తొందరతొందరగా వెళ్ళిపోయింది. హేమంతుడుకొంచెం సేపటివరకు అక్కడ మౌనంగా నుంచున్నాడు. తరువాత వెళ్ళి ఒక చెట్టుక్రింద కూర్చున్నాడు. ఎన్నో ఆలోచనలు అతని హృదయాన్ని కలవరపరిచాయి. అతడు అచ్చటినుంచి బయలుదేరి యింటికి వెళ్ళబోయేసమయానికి రాత్రి అయింది.

## 8

ఆనాత్రి హేమంతుడికి నిద్ర రాలేదు. రాత్రంతా మంచంపైన యిటునటు దొర్లుతూ నక్షత్రాలను లెక్కపెట్టటంతో గడిపాడు.

జ్యోతినిగురించిన ఆలోచనలు అతణ్ణి చిక్కులో పడవేశాయి. కలకత్తాకు వెళ్ళి తనతల్లితో యీ సంగతి అంతా చెప్పి, జ్యోతితో తన వివాహం జర్పే ఏర్పాటు చేయిస్తాను. ఆపైన చాలా కష్టపడి చదివి, బి. ఏ. ప్యాసైన తరువాత, ఉద్యోగం చేసి డబ్బు సంపాదిస్తాను. ఇలా చేస్తే, కట్నం రాలేదనే కొంత తీరిపోతుంది, కాని, తండ్రిసంగతి జ్ఞప్తికిరాగానే - అతని హృదయం నిరాశాపూరితమయింది. తనతండ్రి డబ్బుకోసం ప్రాణాలు అర్పించేవాడని _ అతడికి బాగా తెలుసు. ఆయనకు నచ్చజెప్పటం మానవశక్తికి అతీతమైన విషయం. ఈ ఆలోచనల్తోనే తెల్లవారిపోయింది.

ఉదయాన హృదయభారంతో అతడు యింట్లోనుంచి బయటకు వచ్చాడు. అప్పటికి యింకా భట్టాచార్యులవారి తలుపు వేసేవుంది. నెరియలువిచ్చిన యింటిగోడనుండి పడిపోయిన యిటుకలు అతడు నిన్న చేసినపనిని జ్ఞప్తికి తెచ్చి అతన్ని వెక్కిరిస్తున్నట్లుగా కనుపించాయి.

ఆయిల్లే...... అతని నందనపుబొమ్మ నివసించే యిల్లు. మహైశ్వర్యంతో తులతూగవలసిన తనజ్యోతి ఆషాడుపడ్డ, చిన్నయింట్లో శయ్యపై పడుకుని నిద్రపోతూవున్నది. ఆమె జీవితానికి ఆనందాన్ని భోగాన్ని లభింపజేసే వస్తువు ఎచ్చట వున్నదో? ఎవరి కెరుక! ఈలా అతనిమనస్సు భ్రమిస్తోంది. అతనిచెవిలో ప్రేమభరితమగు ఆమె ముద్దుపలుకులు ప్రతిధ్వనిస్తూన్నాయి. అంతలో అతని ఆశారూపియగు వృక్షముయొక్క ఫలములు తీవ్రమగు తుపానుగాలికి రాలిపోయి యిచ్చటనే నాశమొందుతూన్నట్లనిపించేది.

* * *

కలకత్తాకు వచ్చినతరువాత, తనతండ్రి కోపంతో వున్నాడని తెలుసుకున్నాడు. చదువుపట్ల అతడికి అయిష్టత ఏర్పడింది. అతడి హృదయం వ్యాకులతవల్ల చికాకు పొందింది. విధిలేక కాలేజీకి వెళ్ళక తప్పిందికాదు. ఎప్పటి ఆకాలేజే, అవే ఉపన్యాసాలు. అతని చంచల హృదయం ఎంత ప్రయత్నించినప్పటికీ క్రొత్తగా బండికి కట్టిన గుర్రంవలె పెడత్రోవ పడుతూనేవున్నది. ఉపన్యాసాలు అతనిమనస్సు

కొక్కటంలేదు. జ్యోతి అతన్ని మాటిమాటికీ తన వైపునకు ఆకర్షించు చుంటూవున్నది... "జ్యోతి!... సౌందర్యమూర్తి! ఆమె నిద్రిస్తూ వుండగా వదలివచ్చేశాను. ఆమె ఎలా వున్నదో... ఎవరికి తెలుసు? నావలెనే ఆమెకూడా బాధపడుతూ వుండివుంటుంది... ఆ పూల తోటలోగల పూలగుత్తులనుండి వెదజల్లుతున్న సుగంధాన్ని, ఏడుస్తున్న జ్యోతి వచ్చి తన సుకుమారమైన వ్రేళ్ళతో స్పర్శించి, ఆమొక్కలను సంచలింపజేస్తూ ఉండవచ్చు. ఆమె అక్కడ ఆ పూలమొక్కలనిడమ నుంచొని మంచుబిందువులతో స్నానమాడిన ఎన్నో పుష్పాలను త్రుంచి క్రింద పారవేస్తూ ఉండవచ్చు. ఇప్పుడామె ఏమి చేస్తున్నదో గదా! ఉదాసీనత, నిరాశతోనూ నిండియున్న హృదయభారంతో ఆమె తనస్నేహితురాండ్రతో తిరుగుతూవుండి యుంటుందా? లేక సరోవరతీరాన ఏ చెట్టుకొమ్మనో పట్టుకొని, ఆశాదేవివలె నుంచుని చిరునవ్వు నవ్వుతూ వుండివుంటుందా?

బహుశః జ్యోతి ఆదూరంగావున్న గ్రామములో ఉద్యానవనం లోనో, ఇంటివద్దనో, సరోవరతీరాన్నో తిరిగితిరిగి అలసటవల్ల శ్రమ పొంది వుండివుంటుంది. జ్యోతియొక్క పవిత్రస్మృతిచిహ్నాలు హేమంతుణ్ణి ముఖర్జీబాబుయొక్క ఉపన్యాసాలనుండి చాలా దూరంగా తీసుకుపోయి ఏదో అజ్ఞాతస్థానమున నిలుపుతూవుండేవి.

ఎంత వ్యాకులత! ఈ విధంగా వుంటే ఎవరైనా ఎక్కువ కాలం జీవించగలుగుతారా? కాని, దీన్నుండి తప్పించుకొనే ఉపాయం ఏదీ లేదు.

ఒకనా డతడు జ్యోతికి ప్రేమలేఖ వ్రాశాడు. అది అతని హృదయలాలసలు, ఆకాంక్షలు, భావములు మరియు వాసనలయొక్క ప్రతిమ. దానిని ఆతడు పంపేధైర్యంలేక జేబులో దాచివుంచుకు న్నాడు. ఈవిధమైన లేఖను జ్యోతికి పంపేమెడల ప్రళయం సంభవిస్తుందని అనుకున్నాడు.

గ్రామాలదుస్థితి, మూర్ఖప్రజలు, తుచ్ఛస్వభావంగల మనుష్యులనుగురించి చెప్పే దేముంది? ఇటువంటిస్థితిలో యీవిధమగు లజ్జావిహీన విషయము! ఛీ! ఛీ!! అనుకున్నా డతడు.

నాన్నగారికి యీసంగతి తెలియటంలో ఆలస్యం వుండదు. అతడికి భయం వేసింది. ఆయుధ సహాయం లేని మానవుడు అడాట్టుగా అడివిమృగాన్ని చూచి భయపడేదిఎంగా తనతండ్రిని చూచి అంతగా భయపడతాడు. ఆయనకు తన హృదయంలోగల సంగతి ఏం తెలుస్తుంది? తనమనస్సులోని వ్యథ ఆయనకు ఎలాబోధపడుతుంది? ఆయనలోభమోహాలకు చిక్కుకొని ప్రతివస్తువునూ డబ్బుతో విలువ కడతాడు. ఆయనకు ప్రేమయొక్క మూల్యము, దాని ఆదరము తెలియదు! ఏమాత్రమూ లాభంలేకపోగా, నష్టమే కలిగెడి వ్యాపారాన్ని గురించి ఆయనతో చర్చించటం వ్యర్థం ఇలా ఆలోచించి అతేడా ప్రేమలేఖను జేబులోనే వుంచుకన్నాడు. దానిని జ్యోతికి పంపించేందుకు సాహసించలేకపోయాడు.

కాని ప్రారబ్ధం మళ్ళీ తనప్రభావాన్ని చూపించింది. రెండు మూడు రోజులపాటు అతడి తండ్రి ఏదో ఆఫీసు.పనిమీద కలకత్తా విడిచి బయటకు వెళ్ళవలసివచ్చింది. హేమంతుడికి యింపుపల్లి గ్రామానికి వెళ్ళేందుకు చక్కని అవకాశం లభించింది. అతడు గ్రామానికి వెళ్ళేటప్పుడు తనతల్లితో ఒకస్నేహితుడి బలవంతంమీద తప్పనిసరిగా ఒక ఉత్సవంలో పాల్గొనేందుకు బయట వూరికి వెళ్ళుతున్నాను. ఒకటిరెండు రోజుల్లో తిరిగి వస్తాను అనిచెప్పి వెళ్ళాడు.

గ్రామానికి వచ్చి అతడు తిన్నగా మధుసూదనభట్టాచార్యుల యింటికి వెళ్ళాడు. తటపటాయిస్తూ "జ్యోతీ!" అని పిలిచాడు.

భట్టాచార్యుల భార్య గుమ్మంవద్దకు వచ్చి "అబ్బాయీ హేమంత్!" అన్నది.

"నేనేనండీ పిన్నిగారూ! యింట్లో అంతా క్షేమమా!" ఒకే గ్రామంలో యిరుగు - పొరుగుయిళ్ళల్లో వున్నందువల్ల భట్టాచార్యులను బాబు అనీ, ఆయన భార్యను పిన్ని అని హేమంతుడు పిలుస్తూవుండేవాడు.

"అంతా క్షేమమే అబ్బాయీ!"

"జ్యోతికి మంచిమంచి పుస్తకాలు తెచ్చాను. ఆమె ఏమైనా శ్రద్ధగా చదువుకొంటున్నదా?"

"తీరిక ఎక్కడ ? అయినప్పటికీ ఏదో కొద్దిగా చదువుకుంటూనేవున్నది"

"జ్యోతి యిప్పుడు ఎక్కడ వున్నది?"

"అదుగో, ఎదుటవున్న చటర్జీగారియింటికి వెళ్ళింది. ఆయన కూతురు నిరుపమ నిన్ననే అత్తవారింటినుంచి వచ్చింది. ఆమెను చూచేందుకు వెళ్ళింది. నీవు యివ్వాళ యిక్కడే వుంటావా?

"ఆ, రేపటివరకు యిక్కడే వుంటాను"

"నీవు ఒంటరిగానే వచ్చావు. ఒకిమాటు మీఅమ్మగారినికూడా తీసుకురారాదూ?"

"అమ్మగారికి యిల్లు కదిలేందుకే వీలుండదండీ!"

ఆసమయాన భట్టాచార్యుల ధర్మపత్ని తనహృదయగతభావాలను వెల్లడిచేయ నారంభించింది. "అబ్బాయీ! నీవు కలకత్తాలో వుంటున్నావు, జ్యోతి యీడువచ్చిన పిల్ల. దానికి కలకత్తాలో గౌరవ కుటుంబానికి చెందిన చదువుకున్నవాళ్ళ సంబంధం ఏదైనా ఒకటి చూసి పెడితే ఎంతైనా బాగుంటుంది. మాఆర్థికపరిస్థితి సామాన్యమైన దన్నసంగతి నీకు తెలుసు. నీ దృష్టిలో జ్యోతికి తగిన సంబంధం ఏదైనా వున్నదా?"

హేమంతుడి హృదయం కొట్టుకో సాగింది తాను మనస్ఫూర్తిగా ప్రేమించిన జ్యోతికి ఏదైనా మంచి సంబంధం చూసిపెట్టు మని తన్నే కోరటంవల్ల హేమంతుడి హృదయంమీద గాయపరచినట్లయింది. ఎవరైనా తనచేత్తో బుద్ధిపూర్వకంగా విషపాత్రను పుచ్చుకు సంతోషంతో త్రాగుతారా ? ఆమె తన్ను సంబంధంగురించి హెచ్చరించటం, ఆపైన తన్నేదాన్నిగురించి ప్రయత్నించమనటం గాయపడ్డ అతని హృదయంమీద మరొకదెబ్బ తగిలినట్లయింది. అతడు లోలోపలనే యీసంగతులను గురించి ఆలోచించసాగాడు చివరకు తనను తానే సంబాళించుకున్నాడు. చాలా సేపటివరకు మెదలకుండా వూరుకోవటం బాగుండదని అనుకున్నాడు. తాను యీవిధంగా వూరుకున్నందువల్ల తనపై ఆమెకు సంశయం కలుగుతుందేమో అనుకొని "అలాగే! నేను జ్యోతికి గౌరవకుటుంబానికి చెందిన చదువుకున్న కుర్రవాని

సాంబంధం కుదిర్చేందుకు ప్రయత్నిస్తాను. ఈరోజుల్లో మంచి సంబంధాలు ఎక్కడ వున్నాయి? అయినా ఏదో గొరికిసిగదా అని ఎవరికో ఒకరికి జ్యోతిని యివ్వటంకూడా మంచిది కాదు" అన్నాడు.

హేమంతుడి నోట యీమాటలు విని భట్టాచార్యులి భార్య చాలా సంతోషం పొంది "అబ్బాయీ! ఇవాళ నీవు మాయింట్లో భోజనం చెయ్యి" అని కోరింది. హేమంతుడు లోలోపల "ఓహో! జ్యోతికి దగ్గరగా కుర్చుని చూడవచ్చు" ననుకుని "సరేలెండి, యింటికి వెళ్ళి కొద్దిసేపటిలో వస్తాను" అన్నాడు.

అతడు యింటికి వెళ్ళాడు. ఇంటివద్ద అవసరమైన పని ఏదీ లేదు. ఇంటికి వచ్చినతరువాత, తాను జ్యోతికి వ్రాసిన ప్రేమలేఖను చదువనారంభించాడు. మాటిమాటికీ తెరవటమూ — మడిచి పెట్టట మూవల్ల ఆకాగితం బాగా నలిగిపోయింది. కొన్ని చోట్ల చిరిగిపోయింది కూడాను.

ఒకటి — రెండు — మూడు పర్యాయాలు అత డాప్రేమలేఖను చదివాడు. ఈవుత్తరాన్ని తాను ఇవాళ జ్యోతికి చదువుకునేందుకు యిస్తాడు. జ్యోతిపట్ల తనకు ఎంత అనురాగం వున్నదో — దీనిని చూచి నందువల్ల ఆమెకు తెలుస్తుంది. తన హృదయంమీద ఆమె ఎన్నో లోతైనగాయాలు ఏర్పరిచింది. జ్యోతి తనకు లేకున్నచో తన జీవితం ఎంతో అంధకారమయమయి వ్యర్థమైపోతుంది. తాను తనతండ్రికి యింతగా భయపడ్డందువల్ల లాభ మేమిటి? ఎందుకు యింతగా భయపడాలి? కాకపోతే యింట్లోనుంచి వెళ్ళగొడతాడు. తన ఆస్తిలో ఒక్క దమ్మిడీకూడా యివ్వడు. పోనీ! తాను ఏదూరదేశానికో వెళ్ళి బడపంతులు చేసేఅయినా నాలుగు డబ్బులు సంపాదించుకోలేడూ? తన లోతైన హృదయంలోగల యీ నిష్కల్మషమైన ప్రేమను ఆశగా గొని తనకుగల కొరతల నన్నింటినీ తీర్చుకుంటాడు. ఈ కాపనిలో సఫలత లభించదా? హేమంతుడు యీ విధంగా యోచించి, 'నేడు భట్టాచార్యుని పాదములపై పడి జ్యోతిని తనదానిగా ... లసినదిగా వేడుకుందా'మని నిశ్చయించుకొన్నాడు. అతను తన కాభిక్ష పెట్టడా? ఏమైనాకానీ ముందు జ్యోతియొక్క మనోభావాన్ని తెలుసుకోవటం అవసరం అనుకున్నాడు.

"మెరుగా తను అదిగాగానే ప్రేమగృష్టిలో చూస్తున్నదా?
"జ్యోతీ! జ్యోతీ!! నీవు నాదానవని హృదయం చెప్పుతోన్నది!
అవును, నీవు నాదానివే!"

# 9

హేమంతుడు తను జ్యోతితల్లికి ఇచ్చినమాటప్రకారం మధుసూదనభట్టాచార్యుల యింటికి భోజనానికి వచ్చినప్పుడు, జ్యోతియొక్క జ్యోతిర్మయసౌందర్యకిరణాలు గదినంతనూ ప్రకాశవంత మొనరుస్తూ వుండటాన్ని చూశాడు.

"నేను నిన్ను పిలిచేందుకు వద్దామనుకుంటున్నాను" అన్నది జ్యోతి.

జ్యోతివంక ఆశాభావంతో చూచాడు. ఈ రెండు-మూడు మాసాల్లోనూ ఆమె ముఖమండలంలో ఒక నూతనజ్యోతి ప్రవేశించినట్లనిపించింది. అతనికి సౌందర్యం బయటకు వెల్లివిరుస్తూన్నదా అనిపించింది.

హేమంతుడి నోటినుండి ఏమాటా వెడలలేదు. అతడు తనలో తానే -, "నే నిప్పుడు యిక్కడకు రాకుండా వున్నట్లయితే ఎంతో బాగుండేది. జ్యోతి నన్ను పిలుచుకువెళ్ళేందుకు మాయింటికి వచ్చి వుండేది. అచ్చట ఏకాంతంలో ఆమెతో... మూర్ఖ హేమంతా! నీ వేమి చేయతలపెట్టావు? పడిన శ్రమనంతనూ వ్యర్థం చేసేవాడివి. ఎంత మూర్ఖుడవు!' _ అనుకున్నాడు తనలో తాను మళ్ళా. హేమంతుడు భోజనానికి కూర్చున్నాడు. జ్యోతి అతనికి వినయక్రంతో వినుస్తూవుంది. ఆసమయంలో హేమంతుడు అప్పటిదృశ్యాన్ని తనలో రానున్న సుఖపరంగా చిత్రించుకుంటూ పరధ్యానంగా భోంచేస్తున్నాడు. ఈ విధంగా ఆరంభమైన భావిజీవితంగల మానవుని అదృష్టం వర్ణించ నలవియగునా? జ్యోతి నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ "మీరు మమ్మల్ని మరచిపోయారు" అంది.

నేడు జ్యోతియొక్క సంభాషణావిధానంలో సంకోచంగాని, లజ్జగాని పేరుకైనా లేదని హేమంతుడు లోలోపల అనుకున్నాడు.

"మిమ్మల్ని ఎలా మరచిపోగలను? నీచదువు ఎలా సాగుతుంది?" అన్నాడు.

"చదువుకోసేందుకు వీలయితేగదా?"

జ్యోతికి ఇతరులతో సంభాషించే విధానం బాగా అలవడింది. ఆమె ప్రియమైన హృదయాకర్షకమగు మాటలయందలి మధురత, కోమలమగువాణి, చిరునగవు, మృదుభాషణము – యివన్నీ కలసి బంగారానికి తావి యిచ్చినట్లుగా ఆమెకు వన్నె తెచ్చాయి.

"సరే, ఇవ్వాళ నిన్ను పరీక్ష చేస్తాను. పరీక్షలో ప్యాసైతే నీకు బహుమతి లభిస్తుంది. నీకోసం చాలా పుస్తకాలు తెచ్చాను" అన్నాడు హేమంతుడు.

"పుస్తకాలు ఎక్కడ వున్నాయి. ఒకసారి చూస్తాను."

"ఇంటివద్ద వున్నాయి."

"నేను వెళ్ళి తీసుకురానా?"

"అలా వీలుకాదు ముందు పరీక్ష చేసి, ఆ తరువాత యిస్తా."

"పోనీలెండి, పరీక్షే యివ్వను."

"ఏం?"

"మీరు నాకు పుస్తకాలు యిప్పటివరకు చూపించనే లేదాయె!"

"నేను వచ్చినప్పుడు యింటివద్ద ఎందుకు లేవు?"

"మీరు వస్తారని నాకు తెలిస్తేగదా! నిరుపమ యింటికి వెళ్ళాను. అక్కడినుంచి మొట్టమొదటిసారిగా వచ్చింది. మా అమ్మ మీరు వచ్చారని చెప్పగానే, నేను వచ్చేశాను. వంట ఎవరు చేశారనుకున్నారు? నేనే చేశాను. ఇవ్వాళ నేను వంట చేస్తానని అమ్మతో చెప్పాను. సరే, హేమంతబాబు కోసం నీవే వంట చెయ్యమని అన్నది."

"హేమంతుబాబు!" ఈమాట హేమంతుడి హృదయానికి సూటిగా తగిలింది. ఆ సమయంలో జ్యోతి మందహాసం చేస్తోంది.

పుస్తకాలు షెల్ఫింగుమీద చెల్లాచెదురుగా పడివున్నాయి. బంగారు అక్షరాలతో బైండు చక్కగా చేసినది. ముచ్చట గొలుపుతున్నాయి. జ్యోతి ఒక్కొక్కటే తీసి పేజీలు తిరగవెయ్యనారంభించింది. హేమంతుడు అర్ధనిమీలితదృష్టితో ఆమెవైపు చూడనారంభించాడు. ఆ చంద్రబింబంలాంటి ముఖమూ, నల్లటి ముంగురులూ, భృంగాలవలె మెలికలు తిరిగిన జుట్టు, ఆమె సుందరమైన ముఖముపైన గాలితాకుడుకు గంతులువేస్తూ ఆటలాడుతుంది. ఆమె గులాబి వన్నె చెక్కిళ్ళనుంచీ, సుందరసుకుమార హస్తాలనుంచీ యౌవనం తొణికిసలాడుతూవున్నది. జ్యోతి చూచుటకు సౌందర్యదేవియా యున్నటుల వుంది. హేమంతుడి శరీరమందలి ప్రతి రక్తబిందువూ ఉప్పొంగుతూ ఉబికిసలాడింది. అతడు ఉద్రేకంగా "జ్యోతీ!" అని పిలిచాడు.

"ఏమిటి హేము బాబూ!" అంది జ్యోతి. జ్యోతి మరల "హేము బాబూ?" అని పిలిచింది.

హేమంతుడు కొంచెంసేపటివరకు ఏమీ మాట్లాడలేదు. తరువాత అతడు జ్యోతిచేతిని తనచేతితో పట్టుకుని నొక్కాడు. జ్యోతి చేతిని విడిపించుకుంది. ఆమె హేమంతుడివైపు సరిగా చూడలేకపోయింది. స్త్రీలకు స్వాభావికభూషణముగు లజ్జ ఆమెను ఆ సమయాన ఆవరించింది. హేమంతుడు "ఏం జ్యోతీ! నీవు నన్ను మరిచిపోయినట్లున్నావు. నిన్ను నేను ఒక్కక్షణంకూడా మరిచిపోలేదు. నిన్ను నేను ప్రతిక్షణమూ జ్ఞప్తికి తెచ్చుకుంటూవుండేవాణ్ణి. ఇదుగో, నీకు ఒక ఉత్తరంకూడా వ్రాశాను. చూడు. నీకు కష్టం కలుగుతుందేమోనని పంపలేకపోయాను. రాత్రింబవళ్ళు నే నీపుత్తరాన్ని ప్రేమపూరితమైన నా హృదయానికి హత్తుకుంటూవుండేవాణ్ణి" అన్నాడు.

ఇలా చెప్పి హేమంతుడు తన హృదయభారాన్ని తగ్గించుకునేందుకు ప్రయత్నించాడు. అతడు తన హృదయమందలి భావాలనూ, లాలసలనూ ప్రతిభావంతమగు శబ్దాలతో అతియోగ్యుడగు రచయితకంటె ఉత్తమకీర్తిని ఆకర్షవంతముగు మాటలతో వర్ణించాడు. అతడా ప్రేమలేఖను తెరచి జ్యోతిచేతికి యిచ్చాడు. జ్యోతి శరీరం

గుర్తొచ్చింది. ఆమె చూపుకు నల్లని అక్షరాలు మసకగా కనిపించ సాగాయి. కాలిమ ఆమె చేతులపైకి పరుగిడసాగిన ట్లనిపించింది.

"ఇది చదువు" అన్నాడు. జ్యోతి నిశ్శబ్దంగానూ, అచేతనం గానూ నిలబడింది. "పోనీ యిలా యివ్వు. నేనే చదివి వినిపిస్తాను." అన్నాడు. జ్యోతి 'అవును - కాదు' అని ఏ జవాబూ యివ్వలేదు. తల వంచుకొని ఏమైనా చెప్పేందుకూడా ఆమె సాహసించలేక పోయింది. విద్యుద్యంత్రం తాకినందువల్ల శరీరంఅంతా రాతివలె అయిపోయిన మనుష్యునిమాదిరిగా ఆమె అచేతనంగా నిలబడివున్నది.

హేమంతుడు భావస్ఫూరితంగా ఉత్తరం చదువసాగాడు. జ్యోతి కొయ్యబొమ్మవలె నిలబడిపోయింది. తన చెవులవద్ద ఎవరో సమ్మెటదెబ్బలు కొడుతున్నారా - అన్నట్లు ఆమెకు వినిపించింది. ఈ ప్రేమాఘాతములు వుండివుండి ఆమె హృదయపుతెరలకు కొట్టు కుంటూవున్నాయి. ఆమెకు తల తిరుగుతు న్నట్లయింది.

ఉత్తరం అంతా చదివి, దీర్ఘంగా శ్వాసించి "జ్యోతీ! నా ఆశలూ, హృదయవాంఛలూ వ్యర్థమైపోవలిసిందేనా!" అన్నాడు.

జ్యోతి మాట్లాడకుండా విస్మయంతో రాతివిగ్రహంవలె నుంచునిపోయింది. నోటినుండి ఒక్కమాటైనా రాలేదు. మాట్లాడేం దుకూ - వినేందుకూకూడా ఆమెలో శక్తి లేకుండాపోయింది. పంజ రంలో బంధింపబడిన పక్షివలె నుంచునిపోయింది. శ్వాస నిరోధింప బడుతూ వుంది. శరీరం అంతా వుండి - వుండి కంపిస్తూవున్నది.

"జ్యోతీ! నీ ప్రియమైన పెదవులతో నిన్ను నేను ప్రేమిస్తు న్నాను .. అని ఒక్కమారు చెప్పు. నన్ను ప్రేమతో చూడు. ఒక్క మాటు...... కేవలం ఒక్కమాటు. తరువాత నిన్ను నా కిస్మని మీ తల్లిదండ్రులను బిచ్చగానివలె వేడుకుంటాను. నేను నిన్నే కోరుతు న్నాను. డబ్బు నా కక్కరలేదు. ఈ అసారసంసారంలో నేను నిన్ను మాత్రమే కోరుతున్నాను" అన్నాడు హేమంతుడు.

జ్యోతి తనలో తాను "ఇదేమిటి? హేమబాబు యివాళ యిలా అంటా డేమిటి? ఆయనకు పిచ్చి యెత్తలేదుగదా! అతడొక

నాడు...పుష్పవాటికలో చెప్పిన మాటలు ఆమెకు జ్ఞాపకానికివచ్చాయి. మరల నేడు అదేవిధంగా జ్యోతిశరీరం అంతా నీరసమైపోయింది.

హేమంతుడు మళ్ళీ "జ్యోతీ! నీనోటితో ఒక్క మాటైనా పలుకవా? అవునో_ కాదో_ ఈ రెంటిలో ఏదోఒకటి చెప్పు. నేను యీ ఒక్కమాటనూ నీనోటినుండి వినేందుకు ఆశించాను." అన్నాడు.

జ్యోతి ఆకస్మికంగా లేచినుంచుని, "హేముబాబూ! నేను యింటికి వెళ్ళనా?" అంది.

"జ్యోతీ! ఏజవాబూ చెప్పవేమి? జవాబు చెప్పు."

"ఏమని చెప్పను?"

"ఒక్క మాట, నీవు నన్ను ప్రేమిస్తున్నావో లేదో చెప్పు జ్యోతీ! చెప్పవూ?"

హేమంతుడు నేడు తనతో ఏజవాబు చెప్పించాలని అనుకుంటున్నాడో జ్యోతికి బాగా అర్థం అయింది. ఈ ప్రశ్నను గురించి ఆనాటి సంధ్యాసమయంలోతప్ప మరెన్నడూ ఆమె యోచించలేదు. హేమంతుడి నేటిప్రవర్తన... ఈకంపితస్వరము, ఈచంచలత్వము - యివన్నీ ఆమెకు లజ్జను కలిగించాయి. హేమంతుని ఎడబాటు ఆమెకు కష్టదాయకమే. ఎందుకని? _ ఆమె యీబాధను అనుభవిస్తున్నదా? ఆనందాన్ని వాంఛించనివా రెవరు? బుద్ధిపూర్వకంగా ఎవరూ దుఃఖాల్లో చిక్కుబడరు. కాని యీమాటల్లో ఆనందం ఎక్కడ? అంతే గాదు, యీమాటలుతప్ప ఆమె ఏరోజూనా ఏమీ ఆలోచించలేదు. కాని, నేడు హేమంతుని మాటలధోరణి పూర్తిగా ఆమెకు అసహ్యంగా తోచింది.

ఈసమయంలో జ్యోతిస్థితి శోచనీయంగా వుంది. ఆమె ప్రతి అవయవమూ అంతరంగంగా దెబ్బ తింటూవున్నదా అన్నట్లు కనిపిస్తూ వుంది. హేమంతుడు యిలా మాట్లాడాడేమి? ఆనాటి సంధ్యాసమయంలో హేమంతుడు వెళ్ళినవెంటనే ఆమెహృదయం అగి అగి కొట్టుకొనసాగింది. హేమంతుని యీ ప్రవర్తనను గురించి ఆమె ఆలోచించినప్పుడు అనేకవిధాలైన రహస్యమయయోచనల్లో చిక్కుబడేది. చివరకు ఆమె కొద్దిప్రయత్నంతో తన మనస్సును వశపరుచు

కుంది. రెండురోజులపాటు అతిథిగావున్న హేమంతుడు నామార్గంలో అడ్డుబడ్డాడు. కాని, యిప్పు డతడు వెళ్ళిపోయాడు. ఇప్పు డిక చింతించవలసిన అవసరం ఏ ముంది?.

ఈ సంసారం క్షణభంగురం. ఒకడు వస్తాడు, మరొకడు వెళ్ళి పోతాడు. ప్రతివాడూ యీప్రపంచంలో రెణ్ణాళ్ళ అతిథిమాత్రమే ఈ రెణ్ణాళ్ళ అతిథికోసం యింట్లో ఏమూలో కూచుని ఎవరు కన్నీరు కారుస్తారు. పోయినవారు తిరిగి రాజాలరు. జ్యోతికి యీ సంగతి బాగా తెలుసు. హేమంతుడికీ తనకీ సంబంధ మేమిటి? అత డొక అతిథి. రెండురోజులపాటు తనను కలుసుకునేందుకు వచ్చాడు. తరువాత తన వూరికి వెళ్ళిపోతాడు. అతనికోసం తానిప్పుడు ఎందుకు దుఃఖించాలి! ఇందువల్ల కలిగే లాభ మేమిటి? ఈ యోచన లామె మనస్సును కష్టపెట్టుకోనీయకుండా కాపాడాయి. ఆమె హేమంతుని ఎడబాటువల్ల కలిగిన దుఃఖాన్ని మరిచిపోయింది. కాని, హేమంతుడి లేఖయందలి "జ్యోతీ! నీవు నన్ను ప్రేమిస్తున్నావా?" అన్నమాటలు ఆమెయందలి శాంతించిన అగ్నిని మరల ప్రజ్వలింపజేశాయి. హేమంతుడిపట్ల ఆమెహృదయంలో ప్రేమ మరల జనించింది

"పెండ్లిమాట"......ఈ మాటనుగురించి హిందూకన్య తన నోటితో చెప్పించే ఆచారం లేదని ఆమెకు బాగా తెలుసు. అంతే గాదు. ఆమె యీ విషయంలో ప్రస్తావించరాదుకూడాను. ఈ విధంగా చేయటం హిందూకన్యకు తగదుకూడాను. ఇందువల్లనే ఆమె యీ విషయంలో దూరంగా వుండేందుకు ప్రయత్నిస్తూవుండేది.

హేమంతుడు అన్న మాటలనుగురించి జ్యోతి లోలోపల ఆలోచించసాగింది. హేమంతుడు యీ సంగతులన్నీ నాతో ఎందుకు చెప్పాడు? ఈ మాటలు చెప్పినందువల్ల తన కేం లాభం వుంది? హేమంతుడి యీమాటలప్రభావం తనహృదయంలో మార్పు తేలేదా? లేదు! అలా కాదు! ఇందువల్ల లాభ మేమిటి? ఆమె తనమనస్సును చెదరనివ్వలేదు ఏ మాటా నిశ్చయించుకోకుండా ఆమె గుమ్మం వద్దకు వెళ్ళింది. హేమంతుడు ఏదో తనమండి ఆశించినవాడివలె తన వైపే సూటిగా చూస్తున్నాడు. అతడు ఒక్క అంగలో గంతువేసి జ్యోతిని పట్టుకొని తనవైపుకు దగ్గరగా లాగుకొని హృదయానికి

హత్తుకొని ప్రేమావేశంతో ఆమె చెక్కిళ్ళను ముద్దుపెట్టుకున్నాడు. జ్యోతి అతనినుండి విడిపించుకొని ఏడుస్తూ నేలమీద పడిపోయింది.

హేమంతుడు ఉలికిపడ్డాడు. తా నేమి చేయుచున్నాడు? ఇంతసేపటివరకు తాను ఏ ఆలోచనలో నిమగ్నుడై వున్నాడు? "జ్యోతీ! నన్ను క్షమించు. నేను పాషాణమూర్తిని. నన్ను క్షమించు" అంటూ అతడు జ్యోతి పాదాలను పట్టుకున్నాడు.

"వదిలిపెట్టు హేము బాబూ!"

హేమంతుడు పాదాలను వదిలి - ఉన్మత్తుని వలె భూమిమీద కూర్చున్నాడు. ఆ సమయంలో అతనిదృష్టిముందు చీకటితెర ఏర్ప డ్డది. అతనికి ప్రపంచమంతా అంధకారమయంగా కనిపించసాగింది. ఆ తెర తొలగిపోయేటప్పటికి జ్యోతి అచ్చటినుంచి వెళ్ళిపోయింది.

హేమంతుడు లేచి నుంచున్నాడు. అతనిదృష్టి శయ్యమీద పడినది. పుస్తకాలన్నీ అక్కడే పడివున్నాయి. జ్యోతి ఒక్క పుస్తక మైనా తీసుకువెళ్ళలేదేమి? హేమంతుడు శయ్యపైన పడివున్న పుస్త కాల ప్రక్కగా పడుకొని తాను చేసినపనిని తలంచుకొని బాలకుని వలె వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

ఆనాటి సాయంత్రం గ్రామం అంతా అంధకారమయంగా వున్నసమయంలో హేమంతుడు దొంగవలె నిశ్శబ్దంగా యిల్లు విడిచి కలకత్తాకు బయలుదేరాడు. గ్రామంనుండి వెళ్ళిపోయేటప్పుడు అతడు జ్యోతి యింటివైపుచూసి ఒక్కమారు నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పు ఎవరికీ వినబడకుండా వాయుమండలంలో కలిసిపోయింది. ఈ నిట్టూ ర్పుతోపాటు హేమంతుడి భగ్నహృదయం ఎంత దుఃఖంతో వేదనా భరితమైన భావాలను వెలిబుచ్చిందో - ఎవరికీ తెలియదు.

# 10

హేమంతుడియింటినుంచి బయలుదేరిన జ్యోతి తిన్నగా తన యింటికి వెళ్లలేదు. నారాయణఘోషాల్ యింటికి వెళ్ళింది. నారా యణఘోషాల్ యిల్లు పాతదీ, మరమ్మతుకోసం ఎదురుచూస్తున్నదీ అయినప్పటికీ చాలా విశాలమైన యిల్లు. ఆ యింట్లో యిద్దరు

స్త్రీలుమాత్రమే వున్నారు. ఆ యిద్దరూ నారాయణుడి విధవ భార్యలు. వార్ధక్యంలో వున్నా వారిద్దరికీ ఎవరినీ యాచించవలసిన పనిలేకుండా, జీవయాత్ర గడపటానికి కావలసిన ఐశ్వర్యం వుంది. ఇది వారిపట్ల గర్వించదగ్గ విషయం.

జ్యోతి హృదయంలో అగ్ని రగుల్కొల్పబడింది. బుగ్గలపైనా పెదవులపైనా హేమంతుడు చిత్రించిన ప్రేమచిహ్నాలు నిప్పులు కక్కుతూవున్నాయి. జ్యోతికి ఎన్నడూ తాను ఆశించని చెట్టువద్దకు వెళ్ళి దానిఫలాలను చవిచూడవలసిన పరిస్థితి సంభవించింది. ఎవరో తన శరీరంమీద సలసలకాగుతువ్న సీసం పోసినట్లుగా అనుభవించ సాగింది. తన పెదవులు రెండూ విషలిప్తము లయిపోయినట్లుగా భావించి, చెప్పతరంగాని బాధ అనుభవింపసాగింది.

ఘోషాల్ గారి భవనం మూడవఅంతస్తు పైకప్పుమీద కూర్చుని వున్న పావురాలు జ్యోతిని చూసి పైకి ఎగిరిపోయాయి. అలసి - డస్సిపోయిన బాటసారివలె జ్యోతికూడా అక్కడేకూర్చుంది. గ్రామస్థుల సంచారంవల్ల వారి మాటలవల్ల కలిగిన సందడిని వింటూ కూర్చుని కొంతసేపటికి తనలో ఇలా అనుకోసాగింది.

హేమంతుడు యివ్వాళ చాలా కృతఘ్నుడుగా ప్రవర్తించాడు. అతడి అసభ్యప్రవర్తన, అనుచితకార్యాలవల్లా తన ఆశలన్నీ అడియాస లయాయి పూలతోటలో హేమంతుడు తనను ప్రేమతో ఆలింగన మొనర్చుకున్న సంగతికూడా ఆమెకు జ్ఞప్తికి వచ్చింది. ఆ నాటి అతడి ప్రవర్తన సోదరీభావంతో జరుపబడిందని ఆమె భావించింది. నాటి ఆ ప్రవర్తనలో అపవిత్రప్రేమ దాగివున్నదని ఆమె కలలోకూడా అనుకోలేదు. కాని నేడు......ఈ సంగతులన్నీ - ప్రేమలేఖ, కంపిస్తూన్న వ్యథాభరితమైన గొంతు - యివన్నీ ఒక్కొక్కటిగా జ్ఞాపకంవచ్చినకొద్దీ ఆమె హృదయంలో హేమంతుడిపట్లా అతడు చేసిన పనులపట్లా ఏవగింపు ఏర్పడింది. కోపంవల్ల కళ్ళు ఎర్రబడ్డాయి.

'ఛీ! ఛీ! ఇందుకోసమేనా హేమంతుడు తనకు చదువుచెప్పేందుకు రావటం? పుస్తకాలు తనకు యివ్వటం యిందుకేనా? తనను

బుజ్జగించి, లాలించి తన్ను నాశనం చెయ్యాలని సంకల్పించాడు. కానీ, నేను అతణ్ణి యింతగా ఎందుకు ప్రేమించాను?' జ్యోతి ఏడ్వ సాగినది. 'అమ్మ వద్దకు వెళ్ళి నుంచుంటే అమ్మ ఏమంటుంది? వాళ్ళ యింటికి వెళ్ళేటప్పుడు, "అతడియింట్లో ఎవ రున్నారు? వాళ్ళ యింటికి ఒంటరిగా - యీడేరినపిల్లవు వెళ్ళవచ్చా? నీవు వాళ్ళయిం టికి వెళ్ళటం ఎవరైనా చూస్తే ఏ మనుకుంటారు?" అన్నది. ఆ సమ యంలో మా అమ్మమాటను నేను లక్ష్యపెట్టలేదు. ఇప్పుడు నే నామె వద్దకు ఏ ముఖం పెట్టుకుపోను?' హేమంతుడు నేడు తనకు ఘోర మైన అన్యాయం చేశాడు.

శాంతిసౌందర్యాలు మూర్తీభవించిన స్త్రీని పొందాలని ఆశిం చనివా డెవ డుంటాడు? అని తాను ఏదో నవలలో చదివింది. తనపట్ల జరిగిన విషయంకూడా అలాంటిదేనా? ఈ విధంగా తలుచుకున్నకొద్దీ జ్యోతికళ్ళనుండి బొటబొట కన్నీరు కారసాగింది. ఆమె శరీరంలో ప్రతి అవయవమూ భగభగ మండసాగింది. ఈ అగ్ని చల్లారుతుందా?

ఎండతో తపింపబడ్డ ఆకాశం తీవ్రంగా నెత్తిని మాడ్చి వేస్తోంది. అప్పుడప్పుడు పక్షులయొక్క రూక్ష ధ్వనులు వినిపిస్తున్నాయి. పీడకలవలె మరిచిపోదామని ప్రయత్నించినకొద్దీ యీ సంగతులు ఆమె హృదయంమీద గంభీరంగా నాట్యంచేస్తున్నాయి. ఆమెకు బాహ్యప్రపంచం స్పృహకు వచ్చేటప్పటికి ఎండ తగ్గిపోయింది. సంధ్యాసమయం ప్రపంచాన్నంతనీ తన పైటకొంగుతో కప్పివేసింది. సాయంసమయపు అంధకారం ఆమె గాయా లన్నిటిపైన ముసుగు వేసింది. ఆ చీకటిని అండగాగొని ఆమె క్రిందికి దిగివచ్చింది ఆమెను చూచి నారాయణఘోషాల్ చిన్నభార్య "ఏం జ్యోతీ! మేడమీద ఒంటరిగా వున్నావేం?" అంది.

"అబ్బే! ఏమీలేదు" అని జ్యోతి ఉలికిపడి నుంచుంది. హేమంతుడు వేసిన ప్రేమచిహ్నాలు ఆమె చెక్కిళ్ళపైన అగ్నివలె ప్రకాశిస్తున్నట్లూ, ఆ అగ్ని ఆమెకళ్ళల్లో మెరుస్తూవున్నట్లూ – ఆ సమయంలో ఆమెమనస్సుకు అనిపించింది. ఏదోవిధంగా అక్కడి నుంచి తప్పించుకుపోవాలని ప్రయత్నం చేస్తోంది. ఇంతలో నే నారా యణఘోషాల్ పెద్దభార్య వచ్చి "మేడమీద కూచుని, యింకా

పెళ్ళిగాలేదుగదా - అని ఆలోచిస్తూ కూడిపుంటుంది పాపం! ఎంత విచారకరం!" అంది.

ఆ సమయంలో జ్యోతిహృదయం హాస్యాన్నీ, మనోవినోదాన్నీ కూడా సహించలేనంత భయవిహ్వలంగా వుంది. అందువల్ల ఆమె వ్యాకులపడసాగింది. ఆమె ఏ జవాబూ యివ్వకుండానే మెట్లు దిగి బయటకు వెళ్ళిపోయింది.

"ఎక్కడికి వెళ్ళావు? హేమయింటికి నీకోసం వెళ్ళాను. అక్కడకూడా లేవు" అంది తల్లి.

తల్లి అన్న యీమాట దుఃఖంతో వున్న ఆమె హృదయానికి బాణంవలె తాకింది. "ఆఁ" అంది.

"వెళ్ళి చూశాను. హేము ప్రక్కమీద పడుకొని నిద్రపోతు న్నాడు. నువు లేవు. నీవు అక్కడకు వెళ్ళలేదనుకుంటాను."

"లేదు"

"అయితే యిప్పటివరకు ఎక్కడ వున్నావు?"

"నారాయణఘోషాల్ గారి యింట్లో"

జ్యోతి తల్లి సంబాళించుకుని "వెళ్ళకపోవటమే మంచి దయింది. ఆగిరతం వచ్చినదానివి ఎక్కడికిపడితే అక్కడికి వెళ్ళటం నీకు తగదు. లోకాలు కాకాలు. హేము పుస్తకాలు యిస్తానన్నా డుగా, తెచ్చుకోలేదేం? ఏమన్నా అనుకుంటాడేమో?" అన్నది.

"పుస్తకాలు తెచ్చుకోలేదేం?" అని తల్లినోటినుండి విన్న ప్పుడు జ్యోతికి వందలకొలది శూలాలు హృదయంలో గ్రుచ్చుకు న్నట్లు అనిపించింది. ఆరిపోయిన నిప్పును వూది మళ్ళీ రగుల్కొల్పి నట్టుగా అయింది జ్యోతిస్థితి. ఆమె తల్లికి ఏ జవాబూ యివ్వలేదు.

"స్నేహంతో అతడు యిస్తానన్నప్పుడు తెచ్చుకోకపో యావా?" అని తల్లి మళ్ళీ అడిగింది.

"లేదమ్మా, పరాయివాళ్ళదగ్గరనుంచి పుస్తకాలు తెచ్చు కోటం మంచిది కాదు" అంది జ్యోతి. ఆమెకళ్ళు కన్నీటితో నిండి

పోయాయి. ఆమె గజగజ వణుకుతూ "అతనికీ మనకూ సంబంధమేమి టమ్మా?" అంది. "అవును, నిజమే. అతడు మనవూరువాడు — బంధువు కాకపోతేనేం?" జ్యోతి ఏ జవాబూ యివ్వలేదు.

జ్యోతితల్లి 'తనలోతాను అనుకున్నట్లు ఈలత పందిరిఎక్కేట్టు కనిపించటంలేదు. తల్లి — దండ్రులకు ఏకపుత్రుడు. అతడి ఆస్తిఅంతా యిక్కడే వుంది. కట్నం పుచ్చుకోకుండా వివాహం చేసుకుంటానికి ఎందుకు సిద్ధపడ్డాడు? హేమంతుడు చాలా మంచివాడు, అందగాడూ, సహృదయుడూ, చదువులోకూడా ఘట్టివాడే. ఆతడు ఎంత సరళస్వభావుడు!' అనుకుంది.

జ్యోతిహృదయం దెబ్బతిన్న ఆడత్రాచువలె లోలోపల బుసకొడుతోంది. హేమంతుడు సరళస్వభావుడని ఎవ రంటారు? ఆతని సరళస్వభావానికి తా నెంత విలువ చెల్లించుకోవలసివచ్చిందో తనతల్లికేం తెలుసు? జ్యోతిముఖం గ్లానివల్ల కందిపోయింది. ఇవ్వాళ నేను భోజనం చెయ్యను. ఒంట్లో బాగుండలే దనే నెపంతో తన గదిలోకి వెళ్ళింది. దీపం వెలిగించుకు రామాయణం చదువుతోంది.

ఇంతలోనే తల్లి వచ్చి "రామాయణం చదువుతున్నావా? అయితే చదువు, నేనుకూడా వింటాను. మీ నాన్నగారు వూరికి వెళ్లారు. ఈ రాత్రికి రారు" అంది.



## 11

మర్నాడు పొద్దున్నే జ్యోతిహృదయంలో హేమంతుడి అనుచితప్రవర్తనవల్ల నిన్నటిరోజున కలిగిన ఆలోచనలన్నీ అస్థిరాక్షరాల వలె నశించిపోయాయి. జ్యోతి, నేడు ఆ జ్యోతి కాదు. ఆమెకు నూతనజీవితం లభించిందని — ఆమె ముఖకవళికనుబట్టి ప్రత్యక్షంగా కనిపిస్తోంది. ఆమె హృదయంలోగల మబ్బుల్ని అన్నిటినీ సూర్యభగవానుడి స్వర్ణకిరణాలు కడిగివేసి, శుభ్రపరిచాయి. ఆమె నిట్టూర్చి, స్నానం చేసేందుకు నదివైపుకు వెళ్ళింది. హేమంతుడు తాకినందువల్ల ఆమె హృదయంలో ప్రజ్వరిల్లిన అగ్ని నదీజలాలవల్ల చల్లార్చుకుంది. ఇంటికి వచ్చి తడిబట్టల్ని ఆరవేసింది. తరువాత తల్లితో చెప్పి నిరుపమ యింటికి వెళ్ళింది.

జ్యోతిని చూచి నిరుపమ "జ్యోతీ! హేమంతుడు ని న్నే మన్నాడు?" అని అడిగింది.

నిరుపమకు జ్యోతి ఏ జవాబూ యివ్వలేకపోయింది. అందు వల్ల ఆమె మెదలకుండా కూర్చుంది. ఆ సమయంలో ఆమె శరీరం అంతా ఒకసారి జలదరించింది. జ్యోతి హృదయాన్ని యీ మాటలు మరల గాయపర్చాయి.

నిరుపమ జవాబును ఎదురుచూడకుండానే "నాకు హేమం తుడితో వివాహం అయినట్లయితే ఎంత బాగుండేది!" అంది. ఈ మాటను జ్యోతి సహించలేకపోయింది. బాధతోవున్న ఆమె హృద యము లోలోపల దుఃఖపడసాగింది. రెండు కళ్లనుండీ బొటబొట కన్నీరు కారసాగాయి.

జ్యోతి పరిస్థితిని చూసి నిరుపమ శాంతంగా కూచోలేక పోయింది. ఆమె జ్యోతిని కౌగిలించుకుని "ఏం జ్యోతీ! ఏడుస్తా వెందుకు? యీమాత్రానికే యింత కష్టమా! నేను అత్తవారింటినుంచి వచ్చినప్పటినించీ, హేమంతుడు ప్రతిరోజూ కొత్తపుస్తకాలు తెచ్చి యిస్తూవుంటాడని విన్నాను" అంది.

జ్యోతి ఎన్నడూ పొందని వ్యథను పొందింది. ఇప్పటివరకూ ఆమె హేమంతుణ్ణి నిర్భయంగా కలుస్తూవుండేది. ఈ విషయంలో తాను రహస్యంగా దాచివుంచాల్సిన సంగతుల్నిగురించి ఆమె ఎన్నడూ ఆలోచించనేలేదు. నిన్న జరిగిన సంఘటనతర్వాత పొరుగునవున్న వారంతా చెప్పుకొనేసంగతులు విన్నతర్వాత ఆమె హృదయం లజ్జా భయాలతో నిండిపోయింది. "వూరివారికి నే నెలా ముఖం చూపిం చను?" అని తనలోతాను అనుకుంది.

"జ్యోతీ! నీతో హేమంతుడు పెండ్లిప్రస్తావన తెచ్చాడా, లేదా? చెప్పవూ?" అంది నిరుపమ.

జ్యోతి యీ ప్రశ్నకు ఏమని జవాబిస్తుంది? మెదలకుండా ఊరుకుంది. నిన్న జరిగిన సంఘటనలు ఆమె హృదయంలో చెరిగిపో కుండా యింకా కలకలేస్తూన్నాయి.

నిరుపమ అంతటితో ఆగలేదు. ఆమె మళ్ళీ "అతణ్ణి పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నావా? అతణ్ణి నీవు ప్రేమిస్తున్నావో లేదో చెప్పు" అంది.

జ్యోతి తల వూపుతూ "లేదు" అంది నిర్లక్ష్యంగా.

జ్యోతియొక్క యీనిర్భయత, నిర్లక్ష్యత చూసి నిరుపమకూడా మెదలకుండా వూరుకుంది. జ్యోతి యిక అక్కడ ఒక్క క్షణంకూడా ఆగలేకపోయింది. ఎచ్చటనైన ఒక ఏకాంతప్రదేశంలో కూర్చుని ఏడ్వాలని ఆమె సంకల్పించింది. ఏదోవిధంగా అచ్చటినుంచి తప్పించుకుపోతే, ఆమెప్రాణాలు కుదుటబడతాయి. కాని ఆకస్మికంగా తప్పించుకుపోవటం ఎలా? ఈ ఆలోచనతో ఆమె గదిలో ఒక మూల కూర్చుండిపోయింది. నిరుపమ ఏదో అవసరమైన పనిమీద అవతలికి వెడుతూ "ఇప్పుడే వస్తాను వెళ్ళబోకు. నీతో చాలా మాట్లాడాలి" అని చెప్పి గది విడిచి బయటకు వెళ్ళిపోయింది.

జ్యోతికి అచ్చటినుంచి తప్పించుకుపోయేందుకు మంచి అవకాశం లభించింది. నిరుపమ వెళ్ళిపోయినతర్వాత జ్యోతి తన దృష్టిని ఆకాశంవేపు ప్రసరింపజేసింది. ఆ సమయంలో ఆమెకు ప్రజ్వలితాగ్నివలె ఆకాశం గోచరించింది. అక్కడినుండి మండుతున్న నిప్పురవ్వ యొకటి ఆమె హృదయంలో ప్రవేశించి తనను బూడిదగా చేస్తున్నట్లుకూడా భావింపసాగింది. ఆమె ఒకమారు గది గోడల్ని శ్రద్ధగా పరికించిచూచింది. గుమ్మంవైపు చూసింది. ఎవరూ గుమ్మంవద్ద లేకుండుట చూచి ఆమె మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ, దొంగవలె నిరుపమయింటినుండి తన యింటివైపుగా వెళ్ళసాగింది దారిలో ఆమెకు నదిలో స్నానంచేసేందుకు వెడుతున్న యిద్దరు పురుషులు కనిపించారు. ఆమె ఎవరివంకా చూడకుండా తిన్నగా తనయింటికే వచ్చేసింది తనగదిలో పక్కపై పడుకొని ఏడవటం ప్రారంభించింది ఏడ్చి - ఏడ్చి అలసిపోయింది. అప్పటికి చాలా పొద్దెక్కింది. హృదయభారం తన కన్నీటివారాశిలో మునిగిపోయి చాలాభాగం తగ్గిపోయింది. ఆమె తనలోతాను "నేను హేమంతుణ్ణి వాస్తవంగా ప్రేమించానా? నవలల్లో ప్రేయసీప్రియులు ఒకరినొకరు ప్రేమించుకొనురీతిని ప్రేమించానా? ఒకరినొకరు ఎడ

బాసినందువల్ల విరహాగ్నిచే దగ్ధమై మరల వారిద్దరూ కలిసినప్పుడు అమితానందమువల్ల వారి వాడిపోయిన హృదయపుకళిక వికసించి పుష్పించురీతిని మేము ప్రేమించుకొన్నామా? ఎన్నడైన ఆ విధంగా జరుగుతుందా?" అని తలపోయసాగింది.

గతించిన సంఘటనల నన్నింటిని జోడించి ఆమె యీ ప్రశ్నకు ప్రత్యుత్తరాన్ని అన్వేషించసాగింది. కాని, ఆమె కృతకృత్యురాలు కాలేకపోయింది.

ఇదివరలో హేమంతుడు కలకత్తాకు వెళ్ళిపోవునప్పుడు సంజ చీకటిలో ఆతడి తీక్ష్ణదృష్టి జ్యోతియింటిమీద మాటిమాటికి పడుతూ వుండేది. ఆ సమయంలో జ్యోతి కొంతదూరంలో దాగివుండి చీకటి తెరలో అలాంటి కరుణాజనకదృశ్యాలను చూసింది. ఆ దృశ్యమును చూచి ఆనందంవల్లనో లేక మరేకారణంవల్లనో ఆమె హృదయం వ్యథాపూరితం కాసాగింది. కారణమేమో తెలియదు. మర్నాడు ఉదయం ఆమెకు శయ్యమీదినుంచి లేచేందుకు మనస్కరించేది కాదు. చెలికత్తెలమాటలు, హాస - పరిహాసాలు ఆమెకు బాగుండేవికావు. తన జీవితప్రకాశం క్షీణించినటుల ఆమె భావించసాగింది. ఆమె యొక్క భోగవిలాసాలనూ ఆమోదవస్తువులనూ హేమంతుడు తనవెంట తీసుకుపోయాడని అనిపించింది. ఈ సంగతులన్నీ ఆలోచిస్తూ ఆమె ఆకస్మికంగా ఉలికిపడింది. "దీనిపేరేనా ప్రేమ! నవలా రచయితలూ కవులూ దీనినేనా యింతగా ఉపాసించేది? ఛీ! ఛీ." అనుకుంది.

జ్యోతిస్థితి మారిపోయింది. భవిష్యత్తునందిక ఎన్నడూ గతించిన సంగతులనుగురించి ఏకాంతంగా కూర్చుని ఆలోచించను అని ఆమె దృఢంగా సంకల్పించుకుంది. హేమంతుడి విషయాన్ని ఎన్నడూ తలచను. అతన్నిగురించిన ఆలోచనకు హృదయంలో ఎన్నడూ తా వివ్వను. అతడిసంగతి ఎన్నడూ మనస్సులో ప్రవేశించేందుకు వీల్లేకుండా చేయాలని నిశ్చయించుకుంది. తనకూ అతడికీ సంబంధమేమిటి? తన కతడు ఏమీ కాడు. అలాంటిసందర్భంలో అతణ్ణిగురించి ఆలో చించటంలో అర్థమేమైనా వున్నదా? అయినప్పుడు, అతడి వియోగం వల్ల తనకు యింతదుఃఖం ఎందుకు కలగాలి? ఎన్నడైనా అతన్ని గురించిన తలంపు హృదయంలో చెలరేగేటట్లయితే తాను క్రోధో

వ్మత్తురాత్రి తనమనస్సును తానుగా కష్టపెట్టుకుంటుంది. తల్లితోపాటు యింటి పనులన్నింటను నిమగ్నురాలై వుంటూ ఈవిషంగా హేమం తుణ్ణిగురించిన తలంపులను హృదయంలోకి రానివ్వకుండా చేసుకునేం దుకు నిశ్చయించుకుంది.

ఈ అభిప్రాయా లన్నిటినీ మనసునం దుంచుకొని, జ్యోతి మంచంమీదనుంచి లేచింది. హేమంతుడు యిచ్చిన పుస్తకాలన్నిటినీ చించివైచి నిప్పు ముట్టించింది. అవి మండుతూవున్నంతవరకు వింతగా వాటివైపు చూస్తూవుంది. ఆ పుస్తకాలు అన్నీ తగులబడి బూడిదగా అయినపిదప, ఆబూడిదరాశినుంచి కాలిన కాగితపుముక్క ఒకటి ఎగిరి ఆమెకంట్లో పడ్డది. నల్లటిబూడిదలో, హేమంతుడు తనచేతితో వ్రాశిన తన నల్లనిపేరు, యీసమయంలోకూడా — ఘోరాంధ కారంలో నల్లని భూతంయొక్క భయంకరమందహాసంవలె ధిక్కరిస్తూ తన్ను వెక్కిరిస్తూన్నట్లు అనిపించింది. ఆమె తనపాదాలతో ఆబూడిద రాశిని తన్ని చెదరగొట్టింది. తరువాత ఇమె నిట్టూర్చి యింట్లోకి వచ్చి అమ్మా అని పిలిచింది.

తల్లి పొయ్యిమీద బియ్యంపెడుతూ "ఎందుకు" అంది.

"బాగా ఆకలిగా వుంది అమ్మా! తింటానికి నా కేమన్నా పెట్టు" అంది.

# 12

ఆతరువాత హేమంతుణ్ణి జ్యోతి చూడనేలేదా? హేమంతుడు ఆమెకు జ్ఞాపకంవచ్చినప్పుల్లా యింటిపనులలో నిమగ్నురాలుఅయ్యో, లేదా అడివాళ్ళతో ఏదో మాట్లాడుతూ వుండియో ఆమె హేమం తుణ్ణి మరిచిపోయేందుకు ప్రయత్నిస్తూవుంటోంది. లేదా ఒక్కొక్క ప్పుడు ఏకాంతప్రదేశంలో కూర్చుని గతించిన విషయాలనన్నింటినీ జ్ఞాపకం చేసుకొని మనస్సునుండి విసుగుదలను పారదోలేందుకు ప్రయ త్నిస్తూవుండేది. హేమంతుడు ఆమెహృదయగృహంలో బాగా స్థానం సంపాయించుకొన్నాడు. అతణ్ణిగురించిన తలంపు ఏదైనా హృదయంలో జనించినప్పుడు ఆమె ఆ ఆలోచనలో లీనమైపోయేది. ఒక్కొక్క ప్పుడు ఆమెకు హేమంతుడు జ్ఞాపకంవచ్చినప్పుడు, నేను హేమంతు

డితో యిలా ఎందుకు ప్రవర్తించానా? – అనుకున్నాను. ఒక స్వల్ప విషయాన్ని గురించి ఆమె యింతగా ఎందుకు బాధపడుతోందని? తనకు ఏం నొప్పి వచ్చింది? ఆస్తి దేమీ కాలేదే.

ఇట్టిస్థితిలో ఆమె జీవితనౌక ప్రవాహానుకూలంగా సాగిపోతూ వుంది. రెండు – మూడు తావులనుంచి పెండ్లిప్రస్తావనలుకూడా వచ్చాయి. కాని అందులో ఏసంబంధమూకూడా భట్టాచార్యులకు నచ్చలేదు. అవన్నీ పల్లెటూరిసంబంధాలే. ఒకడు ఏదో ఆఫీసులో ఉద్యోగస్థుడు. మరియొకడు పురోహితుడికొడుకు, యింకొకఅతడు 'శాస్త్రి' పరీక్షకు చదువుతున్నాడు. ఈసంబంధాలు యేవీకూడా భట్టాచార్యులను తృప్తిపరచలేకపోయాయి. జ్యోతి బాగా చదువుకున్న పిల్ల. అప్సరసవలె వుంటుంది. ఈడువచ్చిన పిల్లకూడాను. అలాంటి ఉత్తమంకురాలైన పిల్లకు తగినవరుణ్ణి చూడాలి. పల్లెటూరిసంబంధాలు ఏవీకూడా ఆయనకు నచ్చనికారణం యిదే. జ్యోతి పల్లెటూరివాడితోను, లేదా గంటవాయించే పండితునితో, పురాణం చెప్పే శాస్త్రులు, గ్రామపురోహితుడు, లేదా ఏ హరికథలో చెప్పుకు బ్రతికేవాడినో వివాహంచేసుకుని సుఖంగా జీవించలేదు.

గౌరవకుటుంబానికి చెంది బాగా చదువుకున్నవాడున్నూ, సంఘంలోవున్న దురాచారాలను, మూఢవిశ్వాసాలను తుదముట్టించే యోగ్యతగలవాడున్నూ అయిన యువకుడికిచ్చి జ్యోతివివాహం చెయ్యాలని ఆయన ఆశయం. ఆయన యీ ఆశయాన్ని విని గ్రామంలో వున్న చదువుకున్నపెద్దలు యిద్దరు ముగ్గురు చెడుగా భావించారు కూడా. భట్టాచార్యులతో వారెప్పుడైనా జ్యోతివివాహాన్నిగురించిన ప్రస్తావన తెస్తే, ఆయన "నేను బాల్యవివాహాన్ని అంగీకరించను. తగినవరుడు లభించేటంతవరకు ఆమెకు నేను వివాహం చెయ్యను" అనేవాడు.

భట్టాచార్యులకు హేమంతుడితో జ్యోతివివాహం చేస్తే బాగుండునని వుంది. కాని హేమంతుడితండ్రి సుశీలకుమారబాబుకు దురాశ మెండు. ఎక్కువ కట్నం యిచ్చేసంబంధం తనకొడుక్కి చేయాలని ముందటినుంచీ ఆయన సంకల్పం. సుశీలకుమారబాబుకుగల యీ సంకల్పాన్ని భట్టాచార్యులు ఒకరిద్దరినోట విన్నాడు. అందువల్ల

తనసంబంధాన్ని గురించి సుశీలకుమారుడితో ప్రస్తావించేందుకు ఆయన సాహసించలేదు. ఈ సంబంధంవిషయంలో ఆయన పూర్తిగా నిరాశ చేసుకున్నాడు. కాని, భార్యవత్తిడిమూలంగా, సుశీలకుమారబాబు అభిప్రాయం తెలిసికొనేందుకుగాను, కాళికాదర్శనం అనే నెపంమీద కలకత్తా వెళ్ళేందుకు నిశ్చయించాడు.

ఒకరోజున అతడు కలకత్తా వెళ్ళే ప్రయత్నంలో వుండగా, జ్యోతి వచ్చి "ఎక్కడికి వెడుతున్నారు నాన్నగారూ?" అని అడిగింది.

"కాళీదేవిదర్శనం చేసుకువద్దామని వుంది. ఆమె అనుగ్రహిస్తే........." అన్నాడు భట్టాచార్యులు.

భట్టాచార్యులు యిలా చెప్పి బయలుదేరాడు. కాని, జ్యోతికి తల్లిద్వారా అసలుసంగతి తెలిసింది. ఈసంగతి తెలియగానే జ్యోతి హృదయంలో హేమంతుడి కాల్పనికమూర్తి వచ్చి గాయపరిచింది. జ్యోతి తనలోతాను – "హేమంత్......అయ్యో! అదృష్టవశాత్తు యిలా జరిగేటట్టయితే గ్రామస్థులనోళ్ళు మూయించేందుకు మంచి అవకాశం లభిస్తుంది" అనుకుంది. అంతేగాక, తాను హేమంతుణ్ణి ప్రేమిస్తుంది. హేమంతుడు తనను హృదయపూర్వకంగా ప్రేమిస్తాడు. ఈశ్వరికృపవల్ల హేమంతుడికీ తనకీ వివాహం జరిగితే ఎంత ఆనందంగా వుంటుంది? నవలలో వర్ణించినట్టుగా మమ్మల్నిద్దర్నీ ప్రేయసీ ప్రియులుగా భావిస్తారు. ఆవివాహం శుభవివాహం అవుతుంది. జీవితం ఆనందంగా గడుస్తుంది. జ్యోతి అనాటిరాత్రి యీ ఆలోచనల్లోనే గడిపింది.

భట్టాచార్యులు వచ్చాడు యింటికి తిరిగివచ్చాడు ఆయన యింట్లోకి రావటం చూసి, జ్వరంవచ్చిందనే నెపంతో జ్యోతి ప్రక్కమీద పడుకుంది. కాని, తండ్రి ఏం చెబుతాడో వినాలని ఆమె సంకల్పం. భట్టాచార్యులు ప్రయాణం ఎంతవరకు సఫలమయిందో వినాలని ఆమె ఆతురపడుతూవుంది. కాని, ఆయన తనంతట యీ ప్రస్తావం తేలేదు. భట్టాచార్యులు కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరువాత, ఆయనభార్య "వెళ్ళినపని ఏమయిందండీ?" అంది.

"రాను రాను! ఆయనతో ఆ ప్రస్తావన తెచ్చేందుకే వీలు కలుగలేదు. సుశీలబాబుకు చెప్పేందుకూడా తీరికలేదు. రెండు మూడు సంబంధాలవాళ్ళు వచ్చారు. కలకత్తానుండి బాగా ధనవంతులయినవాళ్ళు పది – పన్నెండు వేలు కట్నం యిస్తామంటూ వచ్చారు. నాముందరే వాళ్ళతో 'నేనిప్పుడు పెళ్ళి చెయ్యననీ, పరీక్ష ప్యాసయ్యాక, పదిహేను వేలకు తక్కువలేకుండా కట్నం తీసుకుని మరీ కొడుక్కి పెళ్ళి చేస్తాననీ' చెప్పాడు. ఈసంగతులన్నీ విని జ్యోతినిగురించి మాట్లాడదలంచడం వెర్రితనం గాదా? ఇదంతా చూశాక మనసంగతి చెప్పేందుకు సాహసించలేకపోయాము. "కలకత్తా ఎందుకు వచ్చా"రని అడిగాడు. "కాళీమాత దర్శనం చేసేందుకు వచ్చాను. ఇంతదూరం రానేవచ్చాంగదా, మిమ్మల్నికూడా చూసిపోవాలనిపించింది. ఇలా వచ్చాను" అని చెప్పాను.

"భోజనం ఎక్కడ చేశారు?"

"ఒక్కపూటకోసం నన్ను హోటలుకి పోనిస్తారనుకున్నావా?"

"హేమును కలుసుకున్నారా?"

"లేదు, ఎంతప్రయత్నించినప్పటికీ దొరకలేదు. ఎవరో స్నేహితుడి యింటికి చదువుకునేందుకు వెళ్ళాడట!"

"అతణ్ణి ఎందుక్కలుసుకోలేదు. అతడు జ్యోతిని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నాడుగదా!"

"నీకు ఎలా తెలుసు?"

"జ్యోతికోసం పుస్తకాలు తెచ్చిపెడుతూ వుండేవాడు. దానికి చదువు చెప్పేందుకున్నూ చాలా శ్రమపడేవాడు. ఈలాంటి సందర్భాలన్నిటినీబట్టి, జ్యోతిని పెళ్ళి చేసుకోవాలని అనుకుంటున్నాడని ఊహించేసుకున్నాను. ఆ కారణంవల్లనే నేను ఏమీ అనకుండా వూరుకున్నాను. లేకపోయినట్లయితే జ్యోతిని అతడితో చనువుగా తిరగనిచ్చేదాన్నా! లోకులు ఎన్నెన్ని ఆడిపోసుకున్నారు? కాని నేను వాటిని లక్ష్యపెట్టలేదు. వాళ్ళమాటల్ని పట్టించుకోవటం అనవసరమనుకున్నాను. పిల్లకి ఇష్టంగా వున్నప్పుడు మనకెందుకు అనుకున్నాను."

ఈమాటలవల్ల జ్యోతికి తల్లిపట్ల ఏవగింపుకలిగింది. ఆమె తనలోతాను — "మాఅమ్మ ఇంతుకోసమేనా హేమంతుడితో చనువుగా తిరగనిచ్చింది! ఆడదాన్ని ఆ ఋణం తమాత్రాన యీదురాగతాన్ని సహించితీరవలసిందేనా? అయ్యో! అతడి మెడకు ఏదో విధంగా ఉచ్చు వేశినట్టయితే ఎంతో బాగుండేసిగదా!" అనుకుంది. లజ్జవల్ల ఆమె తల క్రిందికి వాల్చుకుంది. దీనిపేరేనా పెళ్ళి? — ఛీ! తల్లిమీద ఆమెకు చాలాకోపం వచ్చింది. పెళ్ళిబజారులో ఎక్కడినుంచో పిల్లవాణ్ణి తీసుకువచ్చి, అతడిచేతిలో పిల్లను పెట్టేటప్పుడు కలిగే లాభనష్టమంతా డబ్బుమీదే ఆధారపడివుంటుంది. పిల్లనూ పిల్లవాణ్ణి వాళ్లమనస్సు ఎలావుందో ఎవరూ అడగరు. అబ్బ...ఎంతటి మూర్ఖత్వం! ఎంత దురాచారం!...మళ్ళీ ఆమె తనసంగతి ఆలోచించసాగింది. జ్యోతితో తనకు వివాహం జరగటం అసంభవమని తెలిసినప్పుడు, హేమంతుడు తండ్రివద్దకు వెళ్ళి 'నాకు డబ్బు వద్దు. జ్యోతియే కావాలి' అంటాడు. కాని యీ నిర్ణయం అతడిచేతులో లేనప్పుడు యితరుల్ని చెడగొట్టినందువల్ల లాభం ఏముంది ?

వెండిబంగారు ఆభరణాలు ధరించి — కోడలు తనయింటికి వస్తూంది. ఆమెను ఆలింగనం చేసుకుని హేమంతుడు ఎంతో ప్రేమతో మాట్లాడతాడు. కాని ఒకనాడు......ఒకనాడు యీ ప్రేమసాగరంలో మునిగిపోయి స్వప్నంవలె మరచిపోవచ్చుకూడా. ఒకానొక్కప్పుడు నా ప్రేమచే ముగ్ధుడై ఒక పల్లెటూరి బీదపిల్లను తనదానినిగా చేసుకోనేందుకు ఎంతగా ప్రయత్నించలేదు! కాని, ఆమె తనను పెళ్ళిచేసుకోనేందుకు యిష్టపడకపోయేప్పటికే ఆమెను పరిహాసం చేస్తాడు. ఎంత సిగ్గుచేటు!

హేమంతుడి కల్పితమూర్తి ఆమె కళ్లయెదుట కన్పించినప్పుడు, లేదా హేమంతుడు ఆమెకు జ్ఞాపకం వచ్చినప్పుడు అతణ్ణి బలాత్కారంగా తన హృదయగృహంనుంచి బయటకు నెట్టివెయ్యాలని జ్యోతి అనుకుంటూవుండేది. కాని, అలా చెయ్యలేకపోయేది.

# 13

జ్యోతి చింతాసాగరంలో మునిగి అనేకవిధాలుగా ఆలోచిస్తూ వున్న సమయంలోనే చంద్రనగరు జమీందారుగారి పెండ్లి సంభాషణలు ప్రారంభంఅయాయి. పెళ్ళిసంబంధం స్థిరపడింతర్వాత జ్యోతి తలఎత్తుకు తిరుగసాగింది. అంతే గాదు _ "నేను ఎంత అదృష్టవంతురాలినో చూసుకోండి!" అనసాగింది.

వివాహం అయినతరువాత ఆమె అత్తవారింటికి వెళ్ళింది. చాలా మాసాలు గడిచిపోయాయి. తనకు రాణీత్వాన్ని ప్రసాదించిన తన సౌందర్యాన్నిగురించి తలచేవారు ఎవరూ లేని ఆమెకు బోధపడింది. మరికొన్నిరోజులకు తన సౌందర్యమే తనకు పతన హేతువయింది.

చంద్రకాంత చౌదరిగారు సంఘసేవకులు, ఆరోగ్యసంపాదకులు, సాధారణ నవలారచయితలాగా పేరుకోసం ప్రాణాలర్పించేవాళ్ళలో ఒకడు. తనకోడలినిగురించి చెప్పను విని అపారంగా ఆనందిస్తూవుండేవాడు. తనకోడలంతో సమానమైన అందగత్తె చుట్టుపక్కలవున్న పది _ పన్నెండుగ్రామాల్లో వెదకిచ్చినా దొరకదు. కట్నంలేకుండా బీదపిల్లను తనకొడుక్కు చేసుకున్నాడు అనే సంగతి లోకానికి తెలియజెయ్యాలని అతడెప్పుడూ ఆతురతపడుతూవుండేవాడు. ధనంకంటె తనకు వస్తువు ప్రధానమని _ అందరితోనూ చెబుతూవుండేవాడు.

చంద్రకాంత చౌదరి తన సుపుత్రుడు లక్ష్మీకాంతుడికి కట్నం లేకుండా జ్యోతితో ఎందుకు వివాహం చేశాడో మనకు తెలియదు. కాని, బయటకుమాత్రం యీ వివాహాన్నిగురించి గొప్పగా మాట్లాడుతూవుండేవాడు. అంతేగాదు, గర్వంతో ఉప్పొంగిపోయేవాడు. కట్నం లేకుండా తనకొడుక్కి పెళ్ళి చేసి తను ఘనకార్యం చేశానని అనుకుంటూ వుండేవాడు.

పెళ్ళి అయినతరువాత పొరపాటుగానూడా అతడు తనకోడలు ఎలా వుంటూన్నదో_ చూడనైనా చూడలేదు. ఇదంతా చూడటం తనపని కాదు. కొడుక్కి పెళ్ళి చేసి, కోడల్ని తీసుకురావటంతో

తనబాధ్యత తీరిపోయింది. ఇక ఆమె కష్టసుఖాలు కనుక్కోవలసిన బాధ్యత అంతా లక్ష్మీకాంతుడిదే.

జ్యోతి అత్తవారింటికి వెళ్ళిన తరువాత జరిగిన సంగతులు తెలుసుకోవటం మనకు అవసరం. అత్తగాని, ఆడుబిడ్డలుగాని లేరు. చంద్రకాంతరావుకి దూరపుబంధువైన ఒక స్త్రీ గృహకార్యకలాపాలన్నీ నిర్వహిస్తూవుండేది. ఆమె చేసే పనులు, ఆమె తీసుకునే జాగ్రత్త — యివన్నీ జ్యోతిని చింతాసముద్రంలో ముంచివేస్తూవుండేవి. జ్యోతి కష్టసుఖాల్నిగురించి కనుక్కునే వాళ్ళెవరూ లేరు. తనకు తలదువ్వి రాత్రిపూట శృంగారించేసి ప్రేమతో భర్తగదివద్దకు తీసుకపోయే స్త్రీలెవరూ లేరు. ఆమె భోజనంచేసిందో లేదో కూడా అడిగేవారు ఎవరూలేరు. ఆమె స్వయంగా భోజనం చేస్తే చేసినట్టు లేదా లేనట్టు. అదేవిధంగా తనంతట తాను భర్తగదిలోకి వెళ్లాల్సిందే గాని, వెళ్ళిందా లేదా — అనికూడా అడిగేవారు లేరు.

వివాహం అయిన ప్రారంభంలో కొద్దిరోజులవరకు యిద్దరు — ముగ్గురు పరిచారికలు యీసంగతులన్నీ కనుక్కుంటూ వుండేవారు. తరువాత ఎవరిపనుల్లో వారు మునిగివుండేవారు. అందువల్ల యీ సంగతులు కనుక్కునేవారే కారు.

జ్యోతి ఒక్కొక్కప్పుడు వంటయింట్లోనూ, మరొకప్పుడు ముంగిలియందూ రాత్రులు గడుపుతూవుండేది. ఆమె ఎలా గడుపుతున్నది రాత్రి ఎక్కడ పడుకున్నది — అని తెలుసుకొనే ప్రయత్నం ఎవరూ చెయ్యలేదు. ప్రొద్దున్నే పరిచారికలు వచ్చినప్పుడు జ్యోతి వంటింట్లో నిద్రపోవటం చూసి పరిహాసం చేస్తూవుండేవారు. అంతే గాదు, ఆమెఎదుటనే నిర్భయంగా పల్లెటూళ్ళోవుండే పేదపిల్లకు రాచకేళి ఎలా తెలుస్తుంది? — అనేవారు.

ఇక్కడి సంగతులన్నీ విచిత్రంగావున్నట్టు — జ్యోతికి బోధపడింది. తను రెండుమూడు ఘడియలసేపు మాట్లాడి కాలక్షేపం చేసేందుకు పనికివచ్చేవారెవరూ యీయింట్లో లేరు. అందరూ కీలుబొమ్మల్లాగా ఆడుతూవుంటారు. ఎవరితోనైనా ఏదైనా పని చెయ్యమని చెబితే చేస్తారు, లేకపోతే లేదు! వేళకు వచ్చి అడిగితే భోజనం పెడతారు. అలా చెయ్యకపోతే ఆపూట భోజనం పూడనేవుండదు!

ఈసంగతులన్నీ ఆలోచిస్తూవుండగా, ఆమెకు హేమంతుడు జ్ఞాపకం వచ్చాడు. సుఖంగా జీవించాలనే కోరిక ఎవరికి వుండదు? హేమంతుడు తన జ్యోతిర్మయమైన హృదయాకర్షకరూపానికి ముగ్ధుడయాడు. అతడు తనను ప్రేమిస్తూవుండేవాడు. కాని, యిప్పటి పరిస్థితి దానికి పూర్తిగా విరుద్ధం. హేమంత... ఛీ! ఛీ!! తప్పు! తప్పు! ఇలా తలచరాదు. అతణ్ణి జ్ఞాపకం చేసుకోవడం వ్యర్థం. డబ్బుతోను, తినుబండారాలతోను తనవివాహం కాలేదు. అలాంటప్పుడు యీ ఆలోచనలన్నీ ఎందుకు? తనభర్త తనదృష్టిలో దేవతలకంటె శ్రేష్ఠమైనవాడు.

'క్రొత్త ఒకవింత పాత ఒకరోత' అన్నట్టు జ్యోతిభర్త లక్ష్మీకాంతుడు ప్రారంభంలో రెండుమూడు మాసాలవరకు ఆమెను ఆదరణతో చూస్తూవున్నాడు. అంతే గాదు, ఆమెశుభగుణాన్ని పొగడుతూ వుండేవాడుకూడా. ఆతరువాత, జ్యోతి ఒకమారు పుట్టింటికి వెళ్ళివచ్చింది. వచ్చినప్పటినుంచీ పరిస్థితులన్నీ విచిత్రంగా మారిపోయాయి. లక్ష్మీకాంతు డిప్పుడు యిదివరకటి లక్ష్మీకాంతుడు కాడు. ఇప్పు డతడు జ్యోతిని వెనుకటివలె ఆదరించటంలేదు. ఇదివరకటికివలె జ్యోతిపట్ల అతడికి ప్రేమ, స్నేహము, గౌరవభావాలూ లేవు.

మేడగోడలందలి యిటుకలుకూడా ఒరిగిపోయి భయంకరరూపాన్ని తాల్చి, అప్పటిపరిస్థితులన్నీ మారిపోయాయా – అనిపిస్తున్నాయి. ఆపరిస్థితుల్ని చూసి ప్రథమంలో జ్యోతి కొంచెం చకితురాలయింది. కాని, ఏం చెయ్యగలదు? లక్ష్మీకాంతుడి ప్రవర్తన ఆమె హృదయాన్ని గాయపరిచింది. తాను పుట్టింటికి వెళ్ళినప్పుడు భర్త వియోగాన్ని భరించలేక, ప్రతిరోజూ భర్తయొక్క ప్రేమలేఖకోసం ఎదురుచూస్తు వుండేది. పొరుగునవున్న యువతులు వచ్చి 'ఏమైనా వుత్తరం వచ్చిందా?' అని ప్రతిరోజూ అడుగుతూవుండేవారు. కాని రావలశిన అవసరం లేదుగాన వుత్తరాలు రాలేదు. పొరుగుయువతులకు యీసంగతి తెలియగానే ఒకరితో మరొకరు చెప్పుకోసాగారు. ఒకతె ఒకవిధంగానూ, మరియొకతె మరొకవిధంగానూ చెప్పసాగింది. జ్యోతికీ లక్ష్మీకాంతుడికీ వివాహం అయిందని విన్నప్పటినుంచీ శారద మండిపడుతోంది. "పేదపిల్లకు యింత అదృష్టమా?" అంటూ

వుండేది. అలాటప్పుడు జ్యోతి సుఖంగా జీవించటాన్ని ఆమె చూడ గలదా? ఒకరోజున ఆమె జ్యోతి వినేటట్లుగా ఒక స్నేహితురాలితో “మొదట్లో లక్ష్మీకాంతుడికి మాచెల్లెల్ని యివ్వమని అడిగారు. కాని మా అమ్మ అందుకు ససేమిరా వొప్పుకోనన్నది. ధనవంతులికి పిల్లని యిస్తే నగలకూ, బట్టలకూ ఏలోటూ వుండదు. కాని, బీదయింటి పిల్లవాడికి యిచ్చినంత అన్యోన్యంగా దాంపత్యం వుండదు — అంటూ వుండేది. ఇందువల్లనే మాచెల్లెల్ని లక్ష్మీకాంతుడికి యివ్వలేదు” అన్నది.

శారద చెప్పిన యీమాటలు జ్యోతిని బాగా గాయపరిచాయి. ఆమె యిలా చెప్పటంలోవున్న ఉద్దేశ్యం ధనవంతుణ్ణి బీద పిల్ల పెళ్ళి చేసుకుంటే, కడుపునిండా తిండీ, బట్టా, సుఖంగా కాలక్షేపం చేయటానికి మించి మరేమీ వుండదనీ, యింతకంటె ఎక్కువ ఆశించటం వ్యర్థమనీ సూచించటమే. కాని ఆమె లక్ష్మీకాంతుడిలో ఏసుగుణమూ చూడలేదు — భోగవిలాసాలు, ఆమోద — ప్రమోదాలు, మాటిమాటికీ పార్టీయాలు — అల్పాహారాలూ, సంగీత — నృత్యాలూ — యివంటే ఆమెకు గిట్టవు. డబ్బు జమాఖర్చులు వ్రాసి గృహస్థులదృష్టిలో తమకి తాము గొప్పదనాన్ని తెచ్చుకోవటం అవసరం. ఇది తన ప్రథమకర్తవ్యం.

నిర్మలప్రభ జ్యోతికి దూరపుబంధువు. ఆడుబిడ్డవరుస. ఆమె ఏదో మాటలసందర్భంలో “ఈయింటిపరిస్థితి యింతే. ఎవరూకూడా భార్యతో పగలు రెండుఘడియలసేపైనా మాట్లాడినవాళ్ళు లేరు. ఇదేం కొత్తగాదు. నీవు అనవసరంగా విచారపడవద్దు. కాని, మా అత్తవారింట యిలా కాదు” అని చెప్పింది.

జ్యోతి ఆమెకు జవాబు చెబుతూ “నీమాటలవల్ల యీయింటి కోడళ్ళు భర్తల్ని బాధిస్తూవుండేవారని బోధపడుతోంది. అంతేనా?” అంది.

“నీలాంటి అందగత్తెను యింట్లో వుంచుకుని బాబుగారు బయట ఎలా గడుపుతున్నారో అర్థంకావటంలేదు. ఒకరోజు చాటుగా ఉండి బయట వీళ్ళు ఏం చేస్తుంటారో చూడాలి వదినా!”

"వదినా, నే నెలా చూడగలను? ఇలాంటిపని చేసి వనవాస కష్టాలు ఎవరు భరించగలరు? ఒక రోజున, బయట ఏవో నృత్య-గీతాలు జరుగుతూవుంటే, ఎదుటవున్న కిటికీలోంచి బయటకు చూస్తూన్నాను. ఇంతలోకే, మీపెద్దబాబుగారు వచ్చి చివాట్లు పెట్టారు. ఇక మళ్ళీ యిలాంటి పని చేసి ప్రాణం మీదకు తెచ్చుకోవటం నాకు యిష్టం లేదు."

నిర్మలప్రభ జ్యోతి చెప్పిన యీమాటల్ని లక్ష్యపెట్టలేదు. "క్రిందవున్న సరుకులగది చీకటిగా వుంటుంది. సరిగా దానికి ఎదురుగా పెద్దబాబుగారు కూర్చునే హాలు వుంటుంది. మధ్య ఒకచిన్న కిటికీ వుంది. అగదిలో కొద్దిసేపు నుంచుని, చెవియొగ్గి వింటే, రహస్యం అంతా బయటపడుతుంది. పద వదినా వెళ్ళి చూద్దాం" అంది నిర్మలప్రభ.

## 14

నిర్మలప్రభ బలవంతం చెయ్యటంవల్ల జ్యోతి ఒకరోజున రహస్యం తెలుసుకుందామనే తలంపుతో, సరుకులగదిలోకి వెళ్ళింది.

పెద్దబాబుగారితో సమానమైన అందగాడు, ఆయనతో సాటి వచ్చే విద్వాంసుడూ మరెవరూ లేరు. ఈరోజుల్లో ఎక్కడపబడితే అక్కడ ఆయన్ని పొగడేవారే. ప్రతిచోటా ఆయన్ని ప్రశంసించేవారే - అని చెప్పుకుంటున్నారు. ఇంతకుమించి, మరేసంభాషణా లేదు.

పరపురుషులనోట తనభర్తను పొగుడుతున్న యీమాటల్ని విని జ్యోతి ఆశ్చర్యపడింది. ఆమెకు యీమాటలు నచ్చలేదు. ఆమె నిర్మలప్రభతో "మీఅన్నగారు నీకు మంచివారైతే కావచ్చు. యితరులు ఆయన్ని పొగుడుతూవుంటే, వినేందుకు మీకు యిష్టం కూడా వుండవచ్చు. కాని, నా కీమాటలు వినటం యిష్టంలేదు నేను వెళ్ళిపోతున్నాను" అని చెప్పి వెళ్ళిపోయింది.

అక్కడినుంచి వచ్చాక, మిగతాసమయాన్ని ఎలా గడపటమా? అని జ్యోతి ఆలోచించసాగింది. మధ్యాహ్నం అయినతరువాత

యింట్లోవున్న బాల - బాలికలందరూ నిద్రలో తమసమయాన్ని గడుపుతూవున్నారు. కాని, ఎవరికెగ్గరైనా కూర్చొని రెండు ఘడియలసేపు కష్ట - సుఖాలు మాట్లాడుకునేందుకుగాని, లేదా తను కూడా వాళ్ళతోపాటు సుఖనిద్రలో కాలాన్ని గడిపే అదృష్టంగాని తననుదుట వ్రాయబడిలేదు. రోజులు ఎలా గడపటమా? అనేసమస్య ఆమెను రానురాను అధైర్యవ్యథగాలినిగా చేస్తోంది.

నిర్మలప్రభతో కాలక్షేపం చేద్దామని ఆమె నిశ్చయించుకుంది. కాని నిర్మలప్రభ ఎక్కడెక్కడికో పోతూవుంటుంది. ఆమెను పట్టుకోటం సామాన్యవిషయం కాదు. ఇంట్లోవున్న పరిచారికలు కూడా తనకు ఏపనిలోనూ తోడ్పడరు. పోనీ, చదువుకునేందుకు పుస్తకాలేవైనా దొరికితే, అవి చదువుకుంటూ కాలక్షేపం చెయ్యొచ్చు. కాని, యీయింట్లో పుస్తకాలు దొరకటం చాలా కష్టమైనపని.

ఆమెకు మరల హేమంతుడు జ్ఞప్తికి వచ్చాడు. ఛీ! ఛీ!

మామగారికి పరిచర్యలు చేద్దామనుకుని ఒకరోజున జ్యోతి మామగారిగదివైపుకు వెళ్ళింది. అక్కడకు వెడుతూ ఆమె దూరం నుంచి గదిలోని ఒకదృశ్యాన్ని చూసి, ముందడుగు వెయ్యలేకపోయింది. ఆమెమామగారు మంచంమీద కూర్చొని మద్యం త్రాగుతున్నారు. ఇంటికూతుళ్ళు - కోడళ్ళేగాక దూరపుబంధుత్వంగల స్త్రీలుకూడా కొందరు తాంబూలసేవనం చేస్తూ ఆయనవద్ద కూర్చుని పరిహాసాలాడుతున్నారు.

ఈదృశ్యాన్ని చూసి జ్యోతి నిశ్చేష్టురాలయింది. స్తంభించి నిలబడిపోయింది. కొంచెంసేపుఅయ్యాక త్వరత్వరగా నడుస్తూ తనగదిలోకి మరలిపోయింది. తనమామగారు దూరపుబంధుత్వంగల స్త్రీలతో యీమాదిరిగా పరిహాసాలాడటం చూసినప్పటినుంచీ, జ్యోతి హృదయంలో ఆయింట్లోవున్న ప్రతిమనిషిపైనా అసహ్యభావం జనించింది. ఇంటిఆడుబడుచులు, బాలకులు. కోడండ్రందరిముందూ పరస్త్రీలతో యిలా పరిహాసాలాడటానికి వీరికి సిగ్గయినా లేదేమో? అనుకుంది జ్యోతి తనలోతాను.

ఈ విషయాలు జ్యోతిహృదయంలో గాఢంగా నాటుకున్నాయి. ఇకముందు తానుకూడా తక్కినవాళ్ళవలె మధ్యాహ్న

సమయంలో నిద్రబోయి కాలం గడుపుతారని నిశ్చయించుకుంది. ఎప్పుడైనా నిర్మలప్రభ వచ్చి "అక్కడకు వెళ్ళి ఏం చెప్పుకుంటున్నారో విందాం. రా, వదినా" అంటూవుండేది. కాని జ్యోతి అందుకు యిష్టపడేదికాదు. పైగా నిర్మలప్రభను అమాయకురాలుగా తలుస్తూవుండేది. ఈసంగతులన్నీ విని తాను ఏం చేస్తుంది? ఇంతకు ముందే జ్యోతికి తనమామగారు తదితరులప్రవర్తనపట్ల అసహ్యాభావం జనించివుంది. ఏదైనా కొద్దో - గొప్పో లోటు వుంటే, ఆలోటుకాస్తా యీదృశ్యాన్ని చూట్టంతో పూర్తిఅయింది.

ఒకనాటిరాత్రి ఉష్ణతీవ్రతవల్ల నిద్ర రాలేదు. లక్ష్మీకాంతుడు పక్కగదికి రాలేకపోయాడు. రాత్రి పన్నెండుగంటలయింది. జ్యోతి ప్రక్కమీదనించి లేచి, నెమ్మదిగా గదిబయటకు వచ్చింది. ముంగిలిని ఆనుకొని ఉత్తరదిశగా చిన్న (మేడ) వరండా వుంది. అక్కడ ఒకవస్త్రాన్ని పరుచుకొని, దానిమీద పడుకుంది. వెన్నెలరాత్రి. అనేకవిధాల ఆలోచనల్లో నిమగ్నురాలై ఆకాశం వేపు చూస్తూవుంది. నేను యింతగొప్ప జమీందారుకు కోడల్ని. ఇతరులు నాఅదృష్టాన్ని చూసి అసూయపడతారు. నాపెట్టెనిండా అమూల్యమైన ఆభరణాలు నిండివున్నాయి. వాటిపేర్లుకూడా వాళ్ళెవరూ వినివుండరు. స్వప్నంలోకూడా వాళ్ళెవరూ యిలాటివగలను చూసివుండరు. ఇవన్నీ వుండీకూడా...... నేను ఏమైనా సుఖపడుతున్నానో - లేనో - యితరులకేం తెలుసు? మా అమ్మా నాన్నా కూడా తమకూతురుకు కలిగిన ఐశ్వర్యానికి ఆనందిస్తూ సుఖస్వప్నాలు కంటూవుంటారు కాని, తమ గారాబుపట్టి జీవితాన్ని ఎలా గడుపుతోన్నదో వారికేం తెలుసు? ఆమె పడుతున్న కష్టాల్ని వారెలా ఊహించగలరు?

ఆకాశంలో చంద్రుడు మబ్బుతునకలతో ఆటలాడుకున్నాడు మేఘాలు, చంద్రుడు, వెన్నెల - యివన్నీ చిరునవ్వు నవ్వుతున్నాయా - అన్నట్లుగా వుంది. అవన్నీ తన ప్రస్తుతస్థితిని చూసి పరిహాసం చేస్తున్నాయని జ్యోతి భావించింది. ఆమెభావం కొంతవరకు వాస్తవంకూడాను. ఇలా ఆలోచిస్తూ లోలో విలపిస్తూవున్న సమయంలో, అకస్మికంగా ఎవరో పరుగెడుతున్న శబ్దం ఆమెకు విని

సించింది. అది మనుష్యుల అడుగులసవ్వడియే. జ్యోతి ఉలికిపడ్డది. ఆమెకు కొంచెం భయం వేసిందికూడా. ఎవరో చూద్దామని అనిపించింది. కాని, అలా చేసే సాహసం ఆమెకు లేకపోయింది. అలా పడుకొనే యిద్దరువ్యక్తులు ముంగిలిలో యీవైపునుంచి ఆవైపుకు పరుగెత్తుకుపోవటాన్ని చూసింది. పరుగెత్తేది ఎవరా? — అని పరికించి చూసింది లక్ష్మీకాంతుడు నిర్మలప్రభతోంగూడ పట్టుకొని వున్నాడు. ఈదృశ్యాన్ని చూచి జ్యోతి నిశ్చేష్టురాలయింది. "నేనేమైనా స్వప్నం చూస్తున్నానా?" అనుకుంది. సందేహాన్ని నివారించుకొనేందుకై, కళ్ళు బాగా విప్పి తేరపారచూసింది. 'స్వప్నం కాదు, వాస్తవమే. స్పష్టంగా కనిపిస్తోంది. దీన్ని స్వప్నం అనటం ఎలా?' అనుకుంది.

ఆ సమయాన లక్ష్మీకాంతుడు నిర్మలప్రభ చెయ్యి పుచ్చుకుని నిర్మలప్రభ కపోలాన్ని మాటిమాటికి ముద్దుపెట్టుకుంటున్నాడు. ఇది చూచి జ్యోతి ధైర్యం వహించలేకపోయింది. రోషంవల్ల కళ్ళు నిప్పులు కక్కసాగాయి. అక్కడినుంచి లేచేందుకు ఎంతో ప్రయత్నించింది కాని లేవలేకపోయింది. తన స్థితినిగురించి ఆలోచించుకుంది. ఏవో శక్తివంతమైన హస్తాలు తనను బంధించివైచినట్టున్నా, తాను కదలకుండా అచ్చటనే పడుకొనివుండేటట్టుగా తనను వివశురాలినిగా చేస్తూవున్నట్టున్నా ఆమెకు జ్ఞాతమయింది. దీర్ఘంగా నిట్టూర్చి ఆమె కళ్ళు మూసుకుంది. మళ్ళా ఏదో సవ్వడి అయింది. కళ్ళు తమంత తామె తెరువబడి ఆవైపు చూడసాగాయి. నిర్మలప్రభ తలవంచుక పారిపోవాలనే ప్రయత్నంలో వుండటమూ, లక్ష్మీకాంతుడు ఆమెను కౌగిలించుకొని వుండటమూ ఆమె చూసింది జ్యోతినేత్రాలు యీ దృశ్యాన్ని చూచేందుకు అసహ్యించుకున్నాయి. ఆమె తనను సంబాళించుకుని, తన గదిలోకి వెళ్ళటంతోటే శయ్యపైన పడుకుని, దిండుతో తనముఖాన్ని కప్పుకొన్నది. ఆమె ఏడ్వదలిచింది. కాని కళ్ళనుండి కన్నీరు రావటంలేదు. ఈ అసహ్యవేదనవల్ల ఆమె శరీరం అంతా అగ్నివలె దహించుకుపోతోంది. ఆమె హృదయానికి ఎవరో నిప్పంటించారు.

అలా పడుకునే ఆమె ఆలోచించసాగింది. ఇదేమిటి? ఈ జగన్నాటకంయొక్క అర్థమేమిటి? నలువైపులా పాపం, మోసం,

పటూ, అసత్యం, దొంగతనాలు నిండివుండటానికి గల కారణ మేమిటి? నిర్మలప్రభకు చాలా మాసాల క్రితమే వివాహం అయింది. ఆమె భర్త జీవించివున్నాడు. దూరాన పరదేశంలో వుండి ఆమెను స్మరిస్తూ వుండివుంటాడు. ఇక యీమెయో, అతని వియోగసమ యంలో పరపురుషునితో భోగవిలాసాలు అనుభవిస్తూవుంది. సరస సల్లాపా లాడుతుంది. ఇక తన భర్త లక్ష్మీకాంతుడు — అతణ్ణి తాను దేవునివలె పవిత్రంగా భావించి, దేవతగా పూజిస్తూవుంది. అత డింత నీచుడా! అధముడా! పాపియా! పోనీ, లక్ష్మీకాంతుడు నిర్మల ప్రభలో ఏ ఉత్కృష్టగుణాన్ని చూసి, యిలా ముగ్ధుడయ్యాడు? సౌందర్యంలో గాని, రూపలావణ్యాలలో గాని నిర్మలప్రభ జ్యోతి పాదధూళిక్కూడా సరిపోలదు. పోనీ, ఆమె యౌవనాన్ని చూశా? జ్యోతిముందు ఆమె ఒట్టి ఎముకలపోగు. నిర్మలప్రభలో ఏ గొప్ప గుణాన్ని చూశి, చంద్రబింబంలాంటి భార్యను వదలి, లక్ష్మీకాం తుడు ఆమెకోసం యిలా పరితపిస్తూన్నాడు? వాళ్ళ ప్రవర్తన చూసిం తర్వాత, ఆమెకు తన యౌవనాన్ని పదునైన కత్తితో తునాతునకలు చేసుకోవాలని అనిపించింది. కాని ఎందువల్లనో, ఆమె అలా చెయ్య లేకపోయింది. రేపు నిర్మలప్రభ ఏముఖం పెట్టుకు నాయెదుట నుంచుంటుంది? తన యీకళంకాన్ని తుడిచివేసుకొని ఆమె ఎలా 'వదినా!' అని వచ్చి పిలుస్తుంది? లక్ష్మీకాంతుణ్ణి తాను పూర్తిగా సరళస్వభావుడని, నిష్కల్మషుడనీ తెలుస్తూవుండేది. ఇందువల్లనే జ్యోతికి అతడిమీద గౌరవం కలుగుతూవుండేది. కాని అత డింత పాపయా! ఆమె సహించలేకపోయింది. ఆయిల్లు వదలి ఎక్కడి కైనా పారిపోవా లనిపించింది. ఆలక్ష్మీకాంతుడే వచ్చి తనకరస్పర్శ చేస్తాడు. తనతో ప్రేమపూర్వకంగా సంభాషిస్తాడు. ఈముఖంతోనే తనచెల్లెలు నిర్మలప్రభతో యిలా అనుచితంగా దుష్ప్రవర్తన కొన సాగిస్తాడు ఛీ! ఛీ! — అనుకొంది జ్యోతి.

ఆసమయాన ఆమెకు ఏదో గతించినవిషయం జ్ఞాపకం వచ్చింది అది హేమంతుడు తనతో జరిపిన అసహ్యాకరమైన ప్రవర్తన! పురు షులు స్త్రీలను ఎంతగా నాశనంచేస్తారు! స్త్రీలను చెరగొట్టేందుకు వా శ్లెప్పుడూ ఏదో ఒకఅవకాశాన్ని వెతుకుతూనే వుంటారు. భగ

వంతుడా! స్త్రీలను అబలలుగా ఎందుకు పుట్టించావయ్యా? ఇలాటి నిష్ఠురహృదయంగల క్రూరపురుషులతో స్త్రీలయొక్క కోమలమూ, పవిత్రమూ దయాపూరితమూ అయిన హృదయాన్ని ఎందుకు బంధించావయ్యా? ఆమె యిలా ఆలోచిస్తూవుండగా, దగ్గరలో ఎదో అడుగులసవ్వడి వినిపించింది. నిర్మలప్రభ సిగ్గుతో తనముందు తల వంచుకొని నుంచోటం చూసింది. చంద్రునివెన్నెలలో ఆమెముఖం స్పష్టంగా కనిపిస్తువుంది. జ్యోతి ఆమెవైపు అసహ్యదృష్టితో చూసింది. వెంటనే తనముఖాన్ని దిండుతో మరుగుపరుచుకున్నది.

'వదినా!' అని పిలిచింది నిర్మలప్రభ. ఈసిగ్గులేని కళంకిణి నిర్మలప్రభను చెంపదెబ్బ కొడదా మనిపించింది జ్యోతికి. కాని అలా చెయ్యలేకపోయింది. 'వదినా! వదినా!' అని నిర్మలప్రభ బిగ్గరగా పిలిచింది. ఆమె యిలా పిలవటం చూసి జ్యోతి ఆశ్చర్య పడింది. ఇలాటి సిగ్గుమాలినపని చేసి ఏఆడదైనా యిలా మాట్లాడ గలుగుతుందా? అని మనస్సులో అనుకుంది. పైగా ఎవరితో? తాను చేసిన పాపకృత్యంవల్ల అవమానం పొందినవాళ్ళతోనా! ఇంతకంటే ఆశ్చర్యపడవలసింది మరేదీ లేదు.

'వదినా!' అని నిర్మలప్రభ మళ్ళీ పిలిచింది.

నిద్రపోతున్నట్టుగా నటిస్తూ జ్యోతి యీప్రక్కనుంచి ఆ ప్రక్కకు ఒత్తిగిలింది. కళ్ళుమాత్రం తెరవలేదు.

"వదినా! ఇవ్వాళ బాగా నిద్రవచ్చిందాఏం?" అంది నిర్మల ప్రభ. అనూయాక్రోధాలతో జ్యోతిహృదయం లోలోపలనే కుమిలి పోతోంది. దీర్ఘంగా నిట్టూర్చింది. కళ్ళు తెరవలేదు.

"అబ్బ! బాగా నిద్రవచ్చినట్టుంది" అని నిర్మలప్రభ అక్కడి నుంచి ఎక్కడికో వెళ్ళిపోయింది.

# 15

నిర్మలప్రభ వెళ్ళిపోయింతరవాత, తాను చేసినపనికి జ్యోతి చాలా పస్తాయించింది. "నిర్మలప్రభతో మాట్లాడనైనాలేదు. పాపం! ఆమె తన దుఃఖగాథను వినిపించేందుకు వచ్చిందేమో? జరిగిన సంగతులన్నీ ఆమెకు యిష్టంలేకుండానే, బలవంతంగా జరిగాయేమో? ఇందులో ఆమెతప్పేమీ కనిపించటంలేదు. ఆక్రూరుడి నిర్దయతవల్ల బాధపడలేక యిదంతా సహించవలసివచ్చిందేమో! ఆమె తనపతీత్వాన్ని కాపాడుకునేందుకు తనదగ్గరికి పరిగెత్తుకువచ్చిందేమో? నాసహాయంకోసం వచ్చివుండవచ్చు" అని జ్యోతి అనుకుంది, ఈ ఆలోచనలవల్ల ఆమె పడుకోనివుండలేకపోయింది. వెంటనే లేచి, నిర్మలప్రభను వెదకనారంభించింది.

నిర్మలప్రభ ఎక్కడికి వెళ్ళిందో తెలియదు. చాలాసేపు వెదికిన తరువాత ఆమె కనిపించింది. అప్పటి దృశ్యాన్ని చూసి జ్యోతి నేత్రాలు దుఃఖక్రోధాలతో మండిపడ్డాయి. లక్ష్మీకాంతుడి తొడ మీద తలపెట్టుకుని నిర్మలప్రభ నిద్రపోతోంది. ఆమె యీదృశ్యాన్ని సహించలేకపోయింది. తననుతాను సంబాళించుకోజాలకపోయింది కూడా. ముంగిలిలో గోడను ఆనుకొని కూలబడింది. ఆమెనేత్రాలు అంధకారబంధురాలయాయి. కొద్దిసేపటికి ఆమెకు కొంచెం స్పృహ వచ్చింది. మందమారుతం వీస్తూవుంది. ఆమె యిప్పటికీ అలాగే కూలబడివుంది. జ్యోతి ప్రతిఅవయవంనుండీ చెమటబిందువులు చిందుకు వొస్తున్నాయి. చల్లగాలి శరీరానికి సోకటంతో, ఆమెకు ఎవరో అదృశ్యదేవతలు తనశరీరంమీద ఈర్ష్యయనెడి నలుగుపిండిని రాచారా – అనిపించింది. పైటచెంగుతో ముఖంమీదపోసిన చెమటనుతుడుచుకుని ప్రయత్నంచేసి లేచికూర్చుంది. ఆమెకళ్ళలోయింతకు పూర్వం చూసిన భయంకరదృశ్యం తిరగసాగింది. భూతభయంవల్ల చిన్నపిల్లవాడు చీకటివైపు చూడనివిధంగా, జ్యోతికూడా కోరిక వున్నప్పటికీ అదృశ్యంవైపు మళ్ళీ చూడలేకపోయింది. ఆమెకు ఆప్రదేశం భయంకరమైందిగా తోచింది. నెమ్మదిగా తనగదిలోకి వచ్చి నేలమీద కూర్చుంది. పక్కమీద పడుకోనేందుకు బుద్ధిపుట్టలేదు. ఆప్రక్కమీద తాను సుఖంగా నిద్రపోయేందుకు వీల్లేకుండా

ముళ్ళు పోయబడినటుగా ఆమె అనుభవించసాగింది. ఈశయ్యమీద నే ఒకనాడు తన్మయత్వంలో తాను నిర్భయంగానూ, నిశ్చింతగానూ నిద్రించింది. కపటంతో నిండివున్న మాటల్ని నమ్మి తనజీవితాన్ని ధన్యంగా తలిచింది. తనసౌభాగ్యానికి గర్వించసాగింది.

ఆమెకు మళ్ళీ నిర్మలప్రభ తలంపుకు వచ్చింది. ఇంత సిగ్గు లేకుండా పరపురుషుడితో, తాను జ్ఞానవంతురాలూ వయోవతీ అయినప్పటికీ, ఎలా పడుకోగలిగిందో! ఈపని చేయటానికి ఆమెకు సిగ్గయినా లేకపోయింది. హేమంతుడు మాపొరుగుయింటివాడు. అతడికీ నాకూ పరిచయం వుంది. అయినప్పటికీ, అతడితో కలుపుగోలుతనంగా వున్నందుకే సాటివాళ్ళంతా చెడుగా తలంచారు! ఆనాడు తనతల్లికూడా యీమాటే అంది. నిరుపమకూడా యీప్రసంగం తీసుకువచ్చి నన్ను వేళాకోళం చేసింది. కాని లక్ష్మీకాంతుడితో నేను నిర్భయంగా కలసి మెలసి వున్నందుకు సాటివాళ్ళు తప్పుగా ఏందుకు తలంచటంలేదు? దీనికిగల కారణ మేమిటి? నాతల్లి - దండ్రులుకూడా వెనుకా - ముందూ ఆలోచించకుండా ఎవరో అపరిచితవ్యక్తి వెంట సంతోషంతో తమయింటినుంచి యింతదూరం పంపించేశారు. ఎందుకని? ఈసిగ్గులేనితనానికేనా వివాహ మని పేరు పెట్టింది?

ఈసంగతులనుగురించి ఆలోచించినకొద్దీ! అత్తవారింటిపట్ల అసహ్యం పెరగసాగింది. ఆమెకు ఆమేడ నరకంలాగా కనిపించింది. ఈగోలతో అడ్డగింపబడివున్న మేడను వొదలిపెట్టి! ప్రశాంతమైన గాలి వచ్చే ఆరుబయటకు వెళ్ళి, హృదయం విప్పి సుఖపూర్వకంగా శ్వాసించగలనా? ఆమె యీపాపంతో నిండివున్న యింట్లోగల దుర్గంధవాయువుని పీల్చి తనమనోబుద్ధుల్ని భ్రష్టం చేసుకోదలచలేదు. కాని, తా నిప్పు డేమి చేయగలదు? ఈపాపిష్టియింట్లోనుంచి బయట పడటం ఎలా సాధ్య మౌతుంది? ఇలా ఆలోచిస్తు ఆలోచిస్తూ వుండగా ఆమెకు నిద్రవచ్చింది. అక్కడే నేలమీద పమిట పరుచుకు పడుకుంది. గదినుంచి బయటకు పోయేందుకూ, యితరులకు తన ముఖం చూపించేందుకూ ఆమెకు సాహసం కలగలేదు. అందరిదృష్టిలోనూఅధమురాలిగానూ, దయనీయురాలినిగానూ తనను తాను తలంచసాగింది. "ఈసౌభాగ్యమూ, యింతపెద్దమేడ ఎందుకు, తగులబెట్టనా?

దీనికంటె మానాన్నగారి పూరిగుడిసె నాకు స్వర్గంలా వుంటుంది”
అని జ్యోతి తనలోతాను అనుకుంది.

ఆమె పడుకొనియేవుంది. ఇంతలోనే నిర్మలప్రభ వచ్చి “వదినా! వదినా! నిద్రపోతున్నావా?” అంది.

ఆమె గొంతు కంపిస్తూవుంది. జ్యోతి నిద్రపోతున్నట్టుగా నటించలేదు. లేచి కూర్చుంది.

“వేడినూలాన నేలమీద పడుకున్నావా?” అంది నిర్మల ప్రభ.

జ్యోతికి నవ్వువచ్చింది. ‘అవును’ అంది.

నిర్మలప్రభ జవాబుకు ఎదురుచూడకుండానే “నాకూ్కడా సరిగా నిద్రపట్టలేదు. పెద్దబాబు లేచి వెళ్ళిపోయారా? వదినా!” అని అడిగింది.

జ్యోతికి యీ మాట వినగానే అమితంగా కోపం వచ్చింది. కాని కోపాగ్ని లోపలనే అణుచుకుని “నిర్మలప్రభకు యీ బాధ అంతా ఎందుకు?” అని మనస్సులో అనుకున్నది.

‘నీముఖం వాడిపోయివుంది. పెద్దబాబుకు నీమీద కోపం రాలేదుగద!’ అంది నిర్మలప్రభ.

ఈ మాటను జ్యోతి సహించలేకపోయింది. “సిగ్గుచేటు! ఏ మాత్రంకూడా సిగ్గు లేదు. ఉరుము ఉరిమినట్లుగా గర్జించి యీమె రహస్యాన్ని బట్టబయలు చెయ్యవచ్చు. కాని, యిలా చేస్తే నాకే అగౌరవకరం. అసలు రహస్యం తెలియనింతవరకు వూరుకోవటమే మంచిది” అని మనస్సులో అనుకుని, నాలుకచివరకు వచ్చినమాటను కూడా ఆపుజేసి “అవును” అంది.

“ఎందుకని వదినా?”

“తెలుసుకుని నీవేం చేస్తావు?”

“అబ్బే చేసే దేమీ లేదు. వూరకనే అడుగుతున్నాను.”

నిర్మలప్రభయొక్క యీ సంభాషణ, ఆవిడ ముఖలక్షణాలూ చూసేప్పటికే జ్యోతికి తనపైన తనకే అనుమానం కలిగింది. గతరాత్రి

తాను కనులార చూశింది అబద్ధమా? అది స్వప్నమా? కాదు! కాదు! కల కాదు. కళ్ళారా చూసినసంగతి! అబద్ధం కాదు. వాస్తవ విషయమే. కోపంతో ఆమెకళ్ళు ఎర్రబడ్డాయి. తల తిరుగసాగింది. నిర్మలపద్రిభవైపు తీవ్రంగా చూసి, నిప్పురవ్వలాగ జ్యోతి గదిబయటకు వెళ్ళిపోయింది.

# 16

మధ్యాహ్నసమయం. జ్యోతి తనగదిలో కూచుని యీ సంఘటననుగురించి ఆలోచించుకుంటూవుంది. అప్పుడుకూడా ఆమె హృదయం క్రోధం మరియు దుఃఖాగ్నివల్ల భగభగ మండుతూవుంది. 'ఈ ప్రచండాగ్నిజ్వాలలలో నేనుకూడా ఒకరోజు దగ్ధం కావలశినదేనా?' అనుకుంది. సరిగా అదేసమయానికి బయట అడుగులసవ్వడి వినిపించింది. తల ఎత్తి చూసింది. ఇలాటి దుస్సమయంలో లక్ష్మీకాంతుడు రావటం చూసి లేచినుంచుని! మంచంమీద కూర్చోవలశిందిగా సంజ్ఞ చేసింది.

లక్ష్మీకాంతుడు మంచంమీద కూర్చుంటూ, 'జ్యోతీ!' అని పిలిచాడు.

జ్యోతి కొంతసేపటివరకు రెప్పవాల్చకుండా లక్ష్మీకాంతుడివైపు చూసింది. జవాబేమీ చెప్పకుండా అచేతనంగా నుంచునివుంది.

"ఇలా రా!"

"ఎందుకని?"

"ఏం, రాకూడదా?"

"ఆకస్మికంగా యింత అనుగ్రహం కలిగిందేమా? అని ఆలోచిస్తున్నాను!"

"ఆకస్మిక మేముంది? భర్త భార్యదగ్గరకు రాకూడదా?"

"కాదు, పగలు - మిట్టమధ్యాహ్నం వస్తే లోకులు ఏమనుకుంటారు?"

"లోకులకు ఝడిసి నా సుఖాన్నీ ఆనందాన్నీ ఎందుకు వొదులుకోవాలి! రా! యిలా గా!" అని లక్ష్మీకాంతుడు లేచి నుంచున్నాడు.

అప్పటికీ జ్యోతి రాలేదు. లక్ష్మీకాంతుడే జ్యోతివద్దకు వచ్చి ఆమె రెండుచేతులూ పట్టుకొని "యౌవనం తొణికిసలాడుతూ ఎంత అందంగా వున్నావో తెలుసా?" అన్నాడు.

"ఆగండి, మీ రంత శ్రమపడనక్కర్లేదు."

"అచ్చే, అలా కాదు. నిజమే చెబుతున్నాను."

జ్యోతి ఏమీ మాట్లాడలేదు.

"నీకు అసంతుష్టి కలిగిందికాదూ?"

"ఎందుకని?"

"నిన్నరాత్రి నీవద్దకు రాలేదని. ఏం చెయ్యమంటావు. విందుకు వెళ్ళవలసివచ్చింది. ఇప్పుడే యింటికి వచ్చాను."

"దొంగలు, అబద్ధాల ఖోర్లు! పాపులు! పాపం చేసి, పైగా సిగ్గులేకుండా అబద్ధాలు చెప్పి నిజాన్ని కప్పిపుచ్చాలని చూస్తున్నారు. మీరు నా కేమీ చెప్పనక్కర్లేదు."

జ్యోతి స్తంభంలాగ నిలబడివుంది. ఆమె తన రక్తభరితతీవ్ర దృష్టితో లక్ష్మీకాంతుడి హృదయాన్ని పరిశోధిస్తోంది. లక్ష్మీకాంతుడు జ్యోతిచేతిని మళ్ళీ పట్టుకున్నాడు. జ్యోతి తనశక్తికొద్దీ చేతిని విడిపించుకునేందుకు ప్రయత్నించింది. కాని విడిపించుకోలేకపోయింది చివరికు కటువుగా 'విడవండి' అంది.

జ్యోతియొక్క జ్యోతిర్మయముఖమండలాన్నీ, నిప్పులుకక్కుతున్న అరుణనేత్రాల్నీ చూసి లక్ష్మీకాంతుడు 'జ్యోతీ!' అని పిలిచాడు.

తరువాత అతడు జ్యోతిని బలవంతంగా తనహృదయానికి హత్తుకొని ఆమె కపోలాలను చుంబించాడు. దుఃఖం, క్రోధం, మరియు గర్వంవల్ల జ్యోతి భగ్గున మండిపడింది. ఒక్క విదిలింపుతో ఆతనినుంచి విడిపించుకుని, దూరంగా వెళ్ళి నుంచుని "వెళ్ళిపొండి! మీచర్య నా కేం నచ్చలేదు" అంది.

లక్ష్మీకాంతుడు ధ్యానంతో జ్యోతివైపు చూస్తూ, మృదువుగా 'జ్యోతీ!' అన్నాడు.

లక్ష్మీకాంతుడి చూపుల్లో కామవాసన గోచరిస్తోంది. ఆసమయాన, జ్యోతి వాస్తవంగానే జ్యోతిర్మయసౌందర్యంతో తళతళలాడుతూవుంది. ఆమెయీరూపంలో ఒకవిశిష్టమైన ఆకర్షణశక్తి వుంది. ఇవ్వాళ ఆమె స్నానం చెయ్యలేదు. గతరాత్రి మేల్కొని వుండటా! చింతా, యీర్ష్యా, దుఃఖకష్టాలూ, హృదయవ్యథ — యివన్నీ పరస్పరం కలిసిపోయి ఆమెముఖానికి ఒకవిలక్షణమైన నూతనరూపాన్ని ప్రసాదించాయి. మెలికలుతిరిగిన ముంగురులు ముఖంమీద దెబ్బతిన్న కాలసర్పంవలె వూగులాడుతూవున్నాయి. ఇలాంటిసమయంలో, యిలాటివేషంలో, యిలాటిరూపంలో లక్ష్మీకాంతుడు జ్యోతిని యిదివరకు ఎన్నడూ చూడలేదు. కందిపోయిన జ్యోతిముఖం అతడి నర — నరంలోనూ చంచలత్వాన్ని జనింపజేస్తోంది. అతడు మళ్ళీ 'జ్యోతీ!' అని పిలిచాడు.

"వెంటనే యీగదిలోనుంచి వెళ్ళిపొండి."

"ఎందుకని? ఇవ్వాళ నన్ను యిలా అసహ్యించుకుంటున్నావెందుకని?"

"చెప్పటానికి ఏమీ లేదు" అంది జ్యోతి కఠోరంగా.

"నీభర్తను, తెలుసా?"

"అవును. తెలుసు. లోకమంతటికీ తెలుసు. నాకూ తెలుసు. మీ రిప్పుడు గదిలోనుంచి వెళ్ళిపోవటం మంచిది; లేకపోతే నేనే వెళ్ళిపోవలసివస్తుంది."

జ్యోతికి లక్ష్మీకాంతుడి యీప్రవర్తన చాల అసహ్యంగా తోచింది. "ఇంతవంచనా, ఇంతమోసమూనా! ఇలాటి నాటకాలు ఆడుతారని నే ననుకోలేదు. నిజం చెప్పినట్టయితే ఎలాటి కష్టాన్నైనా సహించేదాన్నే. కాని యిలాటి కల్లబొల్లికబుర్లు చెబితే ఎలా?" అనుకుంది లోలోపల. భవిష్యత్తులో దెబ్బతిన్న నాగుపాములాగ పడగఎత్తి నిలుచుంటామని అనుకున్నది. తాను బీదబ్రాహ్మణపిల్లనైనప్పటికీ, తనకుకూడా హృదయం వున్నదని లక్ష్మీకాంతుడితో చెబుదామనుకొంది. అంతేగాదు, తనహృదయంయొక్క విలువ

యింతపెద్ద జమీందారీకంటే ఎక్కువయేననికూడా చెబుదా మను కొంది. ఇలాటి అమూల్యహృదయాన్ని యిలా పదదళితం చెయ్యటాన్ని తా సేవిధంగానూ అంగీకరించదు. ఈమహలులో రాత్రింబవళ్ళు జరుగుతూవుండే భయంకరనాటకాలను అరికట్టేశక్తి జ్యోతిలో వుంది.

లక్ష్మీకాంతుడి ఇంద్రియావాసనాపూర్ణ పాపభరిత నేత్రాలు రెండూ వూడబెరికి అతణ్ణి శాశ్వతంగా అంధుణి చేద్దా మనిపించింది జ్యోతికి. కాని ఎందువల్లనో అలా చెయ్యలేకపోయింది.

ఈ సమయంలో లక్ష్మీకాంతుణ్ణి ఇంద్రియవాసనలు దగ్ధీభూతుణ్ణి చేస్తున్నాయి. అందువల్ల అతడు తడబడుతూ జ్యోతిమీద పడ్డాడు.

జ్యోతిలో నిద్రితంగావున్న కోపం యీ దెబ్బతో జాగరిత మయింది. ఆమె లక్ష్మీకాంతుణ్ణి ఒక్కనెట్టునెట్టి "జాగ్రత్త! ఏం చేస్తున్నావో తెలుసుకొని ప్రవర్తించు! నన్ను తాకబోకు" అంది.

లక్ష్మీకాంతుడు గాబరాపడి నుంచునివున్నాడు. జ్యోతిశరీరం అంతా కంపిస్తూవుంది. లక్ష్మీకాంతుణ్ణి సంబోధిస్తూ "నిన్నరాత్రి రాలేకపోయారు. అందుకని నావద్దకు వచ్చి లేనిపోని కల్లబొల్లి కబుర్లు చెప్పనక్కర్లేదు. ఇవన్నీ అడిగేందుకు నేనేం వేశ్యను కాదు. నిన్న రాత్రి జరిగినసంగతిని నేను స్వయంగా కళ్ళారా చూశాను. మీ దర్పాన్ని చూసి భయపడతానని అనుకోబోకండి, నేనుకూడ మనిషినే, పశువును కాదు. తెలుసుకొనేశక్తి నాక్కూడా వుంది. నేనేం అంత తెలివిలేనిదాన్ని కాదు" అంది జ్యోతి.

ఈ మాటలు విని లక్ష్మీకాంతుడు ఆశ్చర్యపడ్డాడు. ఇంతకు ముందెప్పుడూ జ్యోతిని యింత భయంకరరూపంలో అతడు చూడ లేదు.

జ్యోతి మళ్లా యిలా అంది. "ఇంట్లో యిలాటి నీచకార్యం చేసేందుకు మీకు సిగ్గనిపించలేదా? ఏముఖం పెట్టుకొని ప్రేమరాగాన్ని ఆలాపించేందుకు నాదగ్గిరికి వచ్చారు? ఇప్పటికీ పాపకళంకం అలాగే వుంది! అప్పటికీ మీకు సిగ్గు లేదు. మీ నీచకృత్యాన్ని చూసి నా హృదయం సిగ్గుతో ద్రవించిపోయింది. అంతే గాదు, విషజంతువు

కాటువేసినంత భయంకరంగా నా తల బాధపడుతూవుంది. నిర్మల ప్రభ మీకు చెల్లెలు. పరాయివాడి భార్య. అబ్బ! ఎంత పాడు పని. ఛీ! ఛీ!"

లక్ష్మీకాంతుడు జ్యోతిమాటలు విని ఉరుములాగ గర్జిస్తూ, "ఆఁ, నామీద అధికారం చెలాయించేందుకే సాహసించావుగా! పో, ఇంట్లోనుంచి వెళ్ళిపో" అన్నాడు.

జ్యోతి అచేతనంగా నుంచునివుంది. ఆకలితోవున్న సింహంలాగ లక్ష్మీకాంతుడు జ్యోతిమీద విరుచుకపడ్డాడు. "పో, వెంటనే వెళ్ళిపో? నాకు అడ్డం చెప్పేందుకు నువ్వెవతెవే? తెలిసిందా! పో, పాడునుండా!" అన్నాడు లక్ష్మీకాంతుడు.

"అలాగే వెడతాలెండి. ఒకప్రార్థన. గోలచేయకు చెయ్యవద్దు. నాకు అవమానం కలుగుతుందనే భయమేం లేదు, కాని యీసంగతి వల్ల మీకు కళంకం వస్తుంది."

"నాకేం భయం లేదులే. ప్రతిదానికీ నన్ను నిందించేటంత వెర్రివాడెవడూ లేడు. పైగా, యిది నాయింటివ్యవహారం. ఎవడి అబ్బగాడి వ్యవహారమూ కాదు జోక్యం కలిగించుకోనేందుకు. పో, వెళ్ళిపో."

తరువాత లక్ష్మీకాంతుడు జ్యోతికేశాలను గట్టిగా పట్టుకున్నాడు. జ్యోతి తనను సంబాళించుకోలేకపోయింది. నేలమీద స్పృహతప్పి పడిపోయిన జ్యోతిని లక్ష్మీకాంతుడు యిష్టం వచ్చినట్టుగా తన్నాడు. ఈగల్లంతు విని బయటినుంచి ఒకరిద్దరు పరిచారికలు పరుగెత్తుకు వచ్చారు వాళ్ళు అడ్డంవచ్చి తన్నకుండా ఆపారు.

అప్పటికూడా "నెట్టెయ్యండి, వెంటనే యింట్లోనుంచి దీన్ని వెళ్ళగొట్టండి" అన్నాడు లక్ష్మీకాంతుడు.

ఇంతలో నిర్మలప్రభ అక్కడకు వచ్చి లక్ష్మీకాంతుడితో "మీరు బయటకు వెళ్ళండి, ఇలా చేస్తారా? తప్పు గాదూ!" అంది.

"లక్ష్మీకాంతుడు వెళ్ళిపోయాడు. నిర్మలప్రభ జ్యోతిదగ్గరకు వచ్చి "వదినా!" అంది.

జ్యోతి ఏజవాబూ చెప్పలేదు. ఆమె అలాగే స్పృహతప్పి పడివుంది. నిర్మలప్రభ ఒక పరిచారికను నీళ్ళు తెమ్మని చెప్పి, జ్యోతి తలను తనతొడపైన పెట్టుకుకూర్చుంది. ఇంకొకతె పంఖా వేస్తోంది, నీళ్ళు రాగానే నిర్మలప్రభ జ్యోతిముఖంమీద నీళ్ళను చిలకరించింది. చాలాసేపటికి జ్యోతి కళ్ళు తెరవటం చూసి, 'వదినా!' అని పిలిచింది నిర్మలప్రభ.

జ్యోతి తన ఎర్రబారిననేత్రాలతో, తాను నిర్మలప్రభ తొడపై తలఆనించి పడుకొనివున్నట్లు చూచింది. నిర్మలప్రభ మళ్ళీ 'వదినా!' అని పిలిచింది. జ్యోతి మళ్ళీ కళ్ళు తెరిచి, నెమ్మదిగా 'ఊఁ' అంది.

# 17

నిర్మలప్రభ జ్యోతివద్ద ఏ సంగతీ దాచలేదు. అన్ని సంగతులూ చెప్పింది. కామవాసనలో చిక్కబడి ఆమె అంధురాలయింది. ఇంద్రియ వాసనలకు తాను బలిఅయింది. ఆమె బుద్ధిచలించింది. ఏం చెయ్యగలదు? ఈవిషయంలో ఆమె పూర్తిగా వివశురాలు! ఇక ఆమె భర్తయో!!—ఆయన తనపట్ల చూపే స్నేహమూ, ప్రేమా జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా, నిర్మలప్రభ హృదయము దుఃఖ – పశ్చాత్తాపాలతో దడదడ కొట్టుకుంటుంది. కాని ఆమె ఏం చెయ్యగలదు? ఆమెవశంలోలేని విషయం ఆమె శక్తికిమించిన సంగతిన్నీ. ఈమాటు తాను బుద్ధిపూర్వకంగా యిక్కడకు రాలేదు. ఆమెకు యిక్కడకురావటము యిష్టములేదు. ఈ యిల్లు అంటే చెప్పరానంత అసహ్యం. ఆమెభర్త చాలాసార్లు "నీవు యిక్కడకు వచ్చి చాలారోజులయింది. నేను ఒకటిరెండు మాసాలపాటు పొరుగూళ్ళల్లో వుండాల్సివుంది. ఆసమయంలో మీబాబాయిగారి యింటివద్దవుంటే బాగుంటుంది. పైగా నిన్నిక్కడ ఒంటరిగావుంచడం నాకు యిష్టంలేదు. రోజులుచాలక, నేను లేనప్పుడు ఏజబ్బుపడ్డా, నీసంగతి కనుక్కునేవాళ్ళుకూడా యిక్కడ ఎవరూలేరు. పైగా చిన్నవయస్సులో వున్నదానివి. పరాయిదేశంలో ఒంటరిగా వుండలేవు. కాబట్టి

నీవు మీబాబాయిగారియింటికి వెళ్ళటం మంచిది. నేను పని పూర్తి చేసుకు యింటికిరాగానే నిన్ను పిలిపించుకుంటాను" అని చెప్పాడు.

కాని, నిర్మలప్రభను తన భర్తనోట యీమాటలు వినేటప్పటికి హృదయం చిల్లులుపడ్డది. ఆమె ధైర్యంతోనూ శాంతంగానూ యీమాటలు వినలేదు. కాని, పాపం ఆ అభాగ్యురాలు తనభర్తతో "నేనక్కడకు వెళ్ళను. అక్కడికి వెళ్ళటంకంటె సింహపుబోనులో పెట్టటం నాకిష్టం" అని చెప్పలేకపోయింది. తన పాపకథనుచెప్పి భర్తను దుఃఖపెట్టటం ఆమెకు యిష్టంకాలేదు. ఆయన హృదయగత భావాల్ని పదదళితంచేసేందుకు ఆమెకు బుద్ధిపుట్టలేదు. ఆమె యింతటి అత్యాచారాల్ని సహించవలశివస్తుందనీ, తన సతీత్వం కోల్పోవలసివస్తుందనీ — ఆమెకు తెలియదు. ఇక్కడిసంగతులు ఆమెశరీరానికి ముళ్ళుకుల్లాగా గ్రుచ్చుకోసాగాయి.

కాని ఆమె తనభర్త పరువుప్రతిష్ఠలకు లోపంరానివ్వదు. ఆమె ఏవిషయాన్నైనా సంతోషంగా సహిస్తుంది. కాని భర్తపేరును కళంకమాత్రం రానివ్వదు. అబ్బ! తనంటే ఎంతగౌరవంగా చూసేవాడు! ఎంతనమ్మకంగా వుండేవాడు! తనను ఎంతసుఖపెట్టేవాడు! ఈసంగతులు ఆమెను రాత్రింబవళ్ళు వేధిస్తూవుండేవి. అయినప్పటికీ ఆమె ఏదోవిధంగా యీవ్యథను హృదయంలో దాచిపెట్టుకొవుండేది. తనభర్త తనకు విరహాగ్నిలో ముంచినప్పుడుకూడా, ఆమె ఆబాధతో లోలోపలనే కుమిలిపోతూవుండేది. అంతేగాదు, తానుపొందే విరహాగ్ని వ్యథలో ఒక్క రవ్వనుకూడా భర్తవద్దకు చేరనివ్వలేదు. ఆ చీకటిరాత్రిలో జరిగినసంగతి జ్ఞప్తికిరాగానే ఆమె శరీరమంతా కంపించిపోయేది.

వివాహమైన రెండు — మూడు మాసాలతరువాత, అత్తవారింటివద్దనుంచి యిక్కడకు వచ్చినప్పుడు, ఆమెహృదయం నిరాశాపూర్ణంగావుంది. ఆమెకు ఏమీతోచేదికాదు. 'మొదటిభార్య పోయిన తర్వాత,తనభర్త తనను రెండవపెండ్లి చేసుకుని గృహస్థాశ్రమంలో మళ్ళీ ప్రవేశించాడు. ఇలాటి భర్తప్రేమకు మేరవుంటుందా?' — ఈమాటలు జ్ఞప్తికిరాగానే ఆమె వియోగాన్ని సహించలేకపోయేది. గతించిన

దినాలలో తాను అనుభవించిన సుఖాలను స్మరించుకు ఏదోవిధంగా కాలక్షేపం చేస్తూవుండేది.

ఒకరాత్రి ఆమెకు విచిత్రమైన స్వప్నంవచ్చింది. పూజారి తన యిష్టదేవతకు పుష్పాలను అర్పించేవిధంగా తాను తన భర్తఒడిలో తన ఆశలు, ఆకాంక్షలు, అభిలాషలు, లాలసలు అన్నీ అర్పించింది. ఆమె వెంటనే మెలకువతెచ్చుకొని కళ్ళువలుపుకు చూచేటప్పటికి, తాను ఎవరిచేతులలోనో బంధింపబడివుండటాన్ని చూసింది. ఉలికి పడి 'ఎవరా'అని చూసింది. ఆయన తన భర్తకాదు, లక్ష్మీకాంతుడు.

ఈఘట్టాన్ని వర్ణిస్తోన్న సమయమప్పటికి లక్ష్మీకాంతు డింకా అవివాహితుడే. భయంవేసి ఆమె అరిచింది. వెంటనే లక్ష్మీకాంతుడు ఆమెనోటిని చేతులతోమూసి 'మాట్లాడకు' అన్నాడు.

తరువాత, యీసంగతి ఎవరిచెవినైనా పడుతుందేమో అనే భయంతో, అతడు తన్నువదిలిపెట్టాడు. ఈచింతా-దుఃఖాలతో ఆమె తనశరీరాన్నంతనీ దహించుకు బూదిపాలుచేసికొవ్వనది. ఆమె ఎన్ని కష్టాలు సహించిందో, ఆమెకేఎరుక. ఇతరులకు ఏంతెలుస్తుంది? ఎన్నో పర్యాయాలు ఉరితీసుకు చచ్చిపోదామనుకొంది. పాపభయంవల్లా, తనిభర్తయొక్క కాల్పనికమూర్తి తన కళ్ళయెదుట గోచరించటంవల్లా ఆమె అలా చెయ్యలేకపోయింది. ఆసమయంలో తనభర్త నగు మోముతో తనతో "అలాచెయ్యకు. ఆగు! నీకేం కష్టంవచ్చిందని అలా చేస్తున్నావు? అలా దుఃఖించకు" అని చెప్పినట్లు అనిపించేది. ఈసంగతి ఎవరికి తెలుస్తుంది. లోకనింద ఆమెను నోరు మెదల్పనివ్వలేదు. పైగా, తనదుఃఖగాథను ఏమని చెప్పకోగలదు? ఎవరికి చెప్పకోగలదు! వినేవారేలేరు.

ఇంత సిగ్గుమాలినపనియా! ఛీ! ఛీ! లోకులకు చెప్పకుని ఎలా బ్రతికివుండగలదు? తనజీవితాన్ని ఎలా సుఖంగా గడుపుకోగలదు. గ్రుడ్డిసంఘం! ఈపాడుసంఘం క్రుళ్ళిపోయిన మాంసాన్ని కోసి పారేసినట్టుగా! తనను కూడా దూరంగా ఏరిపారేస్తుంది. లోకులు తనను అపరాధినిగా పరిగణిస్తారు. తనభర్తకూడా సింహంలాగా గర్జించి యింట్లోనుంచి వెళ్ళగొడతాడు. అలాటిస్థితిలో తన శేషజీవితాన్ని ఎలాగడపగలదు? ఆ సర్వనాశకరమూ, భయంకరమూ అయిన

దృశ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకోగానే ప్రాణాలు తల్లడిల్లేవి; ఇంతటి భయంకరాగ్నిని హృదయంలో దాచివుంచుకొని, ఘోరకష్టాలను ఎదుర్కొంటూకూడా ఆమె జీవించివుంది. ఎంత ప్రయత్నించినప్పటికీ చావు రాలేదు. బ్రతికివుండటమే కాదు, నలుగురితో నవ్వుతూ ఆనందంగా గడుపుతోంది. ఈ విధంగా జీవిస్తూ మృత్యువునుండి తప్పింపబడి బాహ్యశరీరాన్ని పవిత్రంగా వుంచేందుకు ఆమె లోలోపల కుమిలిపోతూ, చూచేందుకు జీవించివున్నవాళ్ళలో లెక్కింపబడుతూ వున్నప్పటికీ, వాస్తవానికి శవతుల్యంగానే వుంది.

ఆమె హృదయంలో ఎంత దుఃఖమూ, ఎంత వ్యథా వున్నదో ఎవరికి తెలుసు? తాను బుద్ధిపూర్వకంగా యిక్కడకు రానేలేదు. భర్త బలవంతం చేయటంవల్లా వదిన వున్నది కాబట్టి యిలాంటి బాధ పడవలసిన అవుసరంవుండదనే నమ్మకంవల్లా వచ్చింది. కాని, తన అదృష్టం యిలా చెడుగా పరిణమించినప్పుడు దుఃఖాన్నంతనీ హృదయంలో అణచివుంచుకొని రహస్యం బయటపడకుండా వుండేట్టుగా నలుగురితోపాటు నవ్వుతూ తిరగక యింకేం చెయ్యగలదు? నిర్మలప్రభ వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

దుఃఖంతో వున్న జ్యోతిహృదయం ఆమె బాధాభరితమైన గాధనువిని ద్రవించింది. జ్యోతి కన్నీరుకారుస్తూ, నిర్మలప్రభను కౌగిలించుకుంది.

చాలసేపటివరకు జ్యోతి యిలా కన్నీరు కారుస్తూనే వుంది. కొంతసేపటికి ఆమె హృదయభారంతగ్గింది. 'నిర్మలా, నేనిక యిక్కడ వుండను' అంది.

"ఎందుకని వదినా?"

"ఇలాటిపని జరిగాకకూడా నన్నిక్కడ వుండమంటావా!"

"వదినా!"

"ఏం నిర్మలా!"

నిన్నరాత్రి ఆయన నన్ను బాధించేందుకు వచ్చాడు. ఉష్ణతీవ్రతవల్ల ముంగిలికి అవతల నిద్రిస్తూవున్నాను. పెద్దబాబుగారువచ్చి నన్నుపిలిచారు. భయంవల్ల నాప్రాణాలు తల్లడిల్లాయి. మూడవ

అంతఃపురంలోకి పారిపోయాను. పెద్దబాబుగారు నన్ను వెంటాడారు. ఆయన పాదాలమీదపడి ప్రార్థించాను. 'చంద్రబింబంలాటి భార్య వుండగా నన్నెందుకు బాధిస్తా'రని బ్రతిమాలుకున్నాను. 'నాకా సంగతి తెలుసు' నన్నారు. ఆ మాటవినగానే, క్రిందికి పారిపోయి వచ్చాను. అక్కడకూడా వెంటబడివచ్చాడు. ఎక్కడికి వెడితే అక్కడికే రావటం మొదలుపెట్టాడు. ఎటు తప్పుకునేందుకూ వీల్లేక చిక్కుబడిపోయాను. చాలా నిర్దయగా ప్రవర్తించాడు. బెదిరించాడు. గద్దించాడు, ప్రాతసంగతులన్నీ బయటపెడతానన్నాడు. వదినా! ఏంచెయ్యను! ఆఖరుదాన్నిగదా? తప్పించుకునేందుకు ఏమార్గమూ దొరక్కపోయేప్పటికి, నీగదిలోకి పరుగెత్తుకువచ్చాను. నీవు నేలమీద పడుకొని నిద్రపోతున్నావు. నిన్ను మేల్కొలిపేందుకు ప్రయత్నించాను, కాని వుపయోగం లేకపోయింది. చివరకు తప్పించుకునేమార్గం ఏమీ లేకపోయేప్పటికే, నా అంతట నేనే లొంగిపోయాను. అగ్నిలో దుమికి ప్రాణహత్య చేసుకుందామని అనిపించింది. కాని, నాభర్తను జ్ఞాపకం తెచ్చుకొని, యీసంగతి తెలిస్తే ఆయనకూడా జీవించడనీ — భయంవేసి అలా చెయ్యలేకపోయాను. అగ్నిలో పడటంకంటే, విషపానంచేసి మృత్యుశయ్యపైవుండి యీసంగతి అంతా ఆయనకు చెబితే బాగుండునని అనిపిస్తోంది. కాని వదినా! ఇక కష్టాలను సహించేశక్తి నాలో లేదు. ఇంకొక వారం పదిరోజులపాటు ఏదోవిధంగా నాకోసం ఒప్పుకునివుండు. నేను యీపదిరోజులూ విడిచిపెట్టకుండా నీవెంట వుంటాను. ఏమీభయపడవద్దు. ఎవడూ నిన్నేమీ చెయ్యలేడు. మనం యిద్దరు కలిసివున్నట్టయితే ఒకరిని మరొకరం కాపాడుకో గలుగుతాము.

నిర్మలప్రభపట్ల జ్యోతికివున్న అసహ్యభావం అంతా, ఆమె కష్టగాథను విని, ఆమె దుఃఖావస్థను చూసేప్పటికే, కన్నీటిబిందువులతో కడిగివేయబడింది. నిద్రితమైవున్న సానుభూతి ఆమె దుఃఖగాథను విని పునఃజాగరితమైంది. 'నిర్మలా! ఎంతటి కష్టాలైనాకానీ, నిన్ను ఒంటరిగా విడిచిపెట్టి, కష్టాలకు గురికానివ్వను' అంది జ్యోతి.

# 18

తరువాత కాలచక్రం జ్యోతిని మరొక నూతనమార్గాన్ని పట్టించింది. ఆమెకు కష్టాలు ప్రారంభమయాయి. తన అత్తవారింటి గృహవ్యవహారాలన్నీ బామాకాళి అనే ఆవిడ చూస్తూవుండేది. బామాకాళీయొక్క మరిదికొడుకు కలకత్తాలో ఏదో కాలేజీలో చదువుకుంటున్నాడు. అతడికి జమీందార్లు స్కాలర్‌షిప్ యిచ్చారు. కాలేజీకి ఎండాకాలపు శెలవులు యిచ్చినందువల్ల యిక్కడికి వచ్చాడు అతడిపేరు అవనాశచంద్రుడు.

తీరిక దొరికినప్పుడల్లా, ఏదైనా కావలసినప్పుడల్లా అతడు జ్యోతివద్దకు వచ్చి 'వదినా! తమలపాకులు వుంటేయియ్యి, వ్రుత్తం రాసుకుంటాను తెల్లకాగితం యియ్యి, రెండురూపాయలు డబ్బు యియ్యి' అని అడుగుతూవుండేవాడు.

జమీందార్ల యిళ్ళల్లో జేబుఖర్చుకు కావలసిన డబ్బంతా, యింటి పెద్దకోడలువద్ద వుంటుంది. ఇంట్లో ఎవరికి డబ్బు కావలసి వచ్చినా పెద్దకోడలు వద్దకువచ్చి డబ్బు అడిగితీసుకుని ఖర్చు చేసుకుంటూ వుంటారు. జ్యోతి పెద్దకోడలు కావటంవల్ల డబ్బంతా ఆమెచేతిలోనే వుంటుంది. జ్యోతికి స్వంతఖర్చు ఏమీలేదు. అందువల్ల ఆమెవద్ద డబ్బంతా మిగుల్తూవుండేది. ఆమె తనదగ్గిర మిగిలివున్న డబ్బును బీదలకు, అనాథులకూ దీనులకు ధర్మంచేస్తూవుండేది.

ఇదివరలో జరిగిన సంఘటనతర్వాత జ్యోతి లక్ష్మీకాంతుడి గదిలో అడుగుపెట్టలేదు. రాత్రులందు నిర్మలప్రభతోపాటు గదిలో పడుకుంటూవుండేది. జ్యోతి యీవిధంగా గదిలో ఒంటరిగా పడుకోటంచూసి, పరిచారికలు తమలోతాము యీసంగతి చెప్పుకుంటూ వుండేవారు. జ్యోతి యీవిధంగా తనగదిలో ఒంటరిగా ఎందుకు పడుకుంటున్నదో అడిగేందుకు ఎవరూ ప్రయత్నించనేలేదు. అయినా వారికి అడగవలసినంత అవసరమేముంది? పైగా వాళ్ళు ఆమెను అడగటం బాగుండదనికూడా వూరుకున్నారు.

ఒకనాటి సంగతి. నిర్మలప్రభ జ్యోతివద్ద లేదు. జ్యోతి తమలపాకులు మడుస్తూవుంది. ఈ యింట అడుగుపెట్టిననాటినుంచీ,

యీ పని జ్యోతికి వప్పగించబడింది. ఇప్పుడే ఆమె స్నానంచేసి, తతిమ్మా కొందరపనులన్నీ పూర్తిచేసుకొని, తమలపాకులు చుడిచేందుకు కూర్చుంది. ఆమె తల విరీయబోసుకొని కేశములను ఆరబెట్టుకుంటూ, సున్నమురాచిన ఆకులమీద కాచు రాస్తోంది. ఇంతలోనే అవనాశుడువచ్చి "వదినా! క్షమించాలి. మీతో ఒక మాటచెప్పాలి" అన్నాడు.

జ్యోతి నిశ్చలంగా కూర్చుంది. ఏమాత్రం చలించలేదు.

అవనాశుడు యిలా చెప్ప నారంభించాడు. "వదినా! నిన్ను చూచినప్పుడల్లా ఇంద్రలోకపు జ్యోతివలె నాకు నీవు కనిపిస్తూవుంటావు. ఈ పాపిష్టి యింట్లోవుండటం నాకేమాత్రం యిష్టంలేదు. ఈ యింట్లో రాత్రింబవళ్ళు జరిగే పాపాలు, దురంతాలనూ తల్చుకొంటే శరీరం గగుర్పొడుస్తూంది. ఈ పాపాలు, అత్యాచారాలవల్లా యీ యింట్లో నాకు నలువైపులా అంధకారమే కనిపిస్తూవుంటుంది. నీ శుద్ధమూ పవిత్రమూనగు ప్రజ్వలిత రూప దీపంవల్ల యీ యింటిని పవిత్రంగా ప్రకాశవంతంగానూ చేసి, యీ అంధకారాన్నంతనీ పోగొట్టలేవా?"

జ్యోతి నిట్టూర్చింది. సానుభూతితో కూడుకొనియున్న యీ కోమలభావాలవల్ల దెబ్బతిన్న ఆమె హృదయంలో ఒక సంచలనం కలిగింది.

అవనాశుడు తన ధోరణిని ఆపలేదు. కొంచెంసేపు ఆగి, అతడు మళ్ళీ యిలాఅన్నాడు. "క్షమించు వదినా! సూర్యభగవానుడు ఏ మానవుడికీ లభించడు. కాని అతడి ప్రకాశమూ, స్వర్ణకిరణాలనూ చూసి ప్రతిమానవుడూ అతనిని ఒక వెలుగుజ్యోతిగా తలుస్తూవుంటారు. నిన్ను చూసినప్పుడు. నీవు తప్ప యీ యింటిని చక్కబెట్టగలవారు మరెవరూలేరని నాకు అనిపిస్తూవుంటుంది. కాని, నీవు వున్నప్పటికీ యీ యింటి పరిస్థితుల్లో మార్పు ఎందుకరాలేదో చెబుతావా?"

అవనాశుడు చెప్పినమాటలు జ్యోతిహృదయానికి నాటుకున్నాయి. ఆమె తనను సంబాళించుకోలేకపోయింది. ఆమెకళ్ళు-

కన్నీటితో నిండాయి. అవనాథునికి ఆనాటి సంగతులు తెలుసునేమో? అనే భయంతో ఆమె తలవంచుకుంది.

అవనాథుడు మళ్ళీ ప్రారంభించినాడు "బహుశా నీకేదో కష్టం వున్నట్టుంది. నాకీసంగతి చాలారోజులనుంచీ తెలుసు. ఈవిధంగా మెదలకుండా ధైర్యంగా కూచుంటే లాభంలేదు. నీవే గృహసర్వస్వమవు. ఈయింటిని బాగుచేసినా, చెడగొట్టినా నీవే చెయ్యాలి. నీవే యీయింటిని స్వర్గంగాగాని, నరకంగాగాని చెయ్యగలదానవు. నీవు కొంచెం గట్టిపట్టు పట్టావంటే, వ్యవహారం అంతా దారికివస్తుంది. నేనిలా అంటున్నందుకు క్షమించు. మీభర్త మనుష్యుడు కాదు, పశుతుల్యుడు. నీవు యీయింటికి వచ్చినరోజున, యీ బురదగుంటలో కమలం వికసిస్తుందని అనుకున్నాను. కాని, నేను అనుకున్నది ఒకటి యిక్కడ జరుగుతోన్నది మరొకటిగాకూవుంది."

ఈమాటలు వినగానే జ్యోతి కళ్ళవెంట కన్నీరు ప్రవహించసాగింది. కొన్ని కన్నీటిబిందువులు తమలపాకుల పెట్టెలో పడ్డాయి.

అవనాథుడు జ్యోతి విచారాన్నిచూచి మళ్ళీ యిలా చెప్పసాగాడు. "వదినా! నీ మెతకతనం, సాత్వికతనమూ పనికిరావు. ఈఇంటి యజమానిదగ్గర్నుంచి నౌకరువరకూ అందరిసంగతీ చూశావు. కఠినంగా వుంటేనే ఎవరైనా పనిచేస్తారు. లేకపోతే ఎవడికివాడు దొంగలా ప్రవర్తిస్తాడు. ఇతరులసంగతే ఎవరికీపట్టదు. కళ్ళెర్రచేసి మాట్లాడందే ఎవడూ జవాబైనా యివ్వరు. నీవికముందు కఠినంగా ప్రవర్తించకపోతే, ఏమీ లాభంవుండదు. ఇంతేగాదు నిన్ను ఇంట్లోనుంచికూడా వెళ్ళగొడతారు. నీవు పెద్దకోడలివి. ఇంటి యజమానురాలివి నీవే. కాబట్టి నీవు నీ కర్తవ్యాన్ని గుర్తించాలి. నీవు మెతకతనంవల్ల యీ దురాగతాల్ని అన్నిటినీ సహించి వూరకున్నావంటే, యీ పాపభారం అంతా నీపాలిటపడుతుంది. కర్తవ్యాన్ని పాటించకపోవటం అంటే పాపాలను స్వయంగా కొనితెచ్చుకోవటం అని తెలుసుకో."

అవనాథుడికి జ్యోతి ఏమని జవాబు చెప్పగలదు? కన్నీటి ప్రవాహంవల్ల ఆమెకళ్ళమీద తెరపడ్డట్టుగా అయింది. పైట కొంగుతో జ్యోతి కన్నీటిని తుడుచుకుంది.

(11)

అవనాశుడు జ్యోతికి చాలా దగ్గరగా వచ్చాడు. నాల్గు వైపులా చూశాడు. ఎవరూ కనిపించకపోయేప్పటికి అతను మెల్ల మెల్లగా ప్రేమతో జ్యోతి శిరస్సును తన తొడమీదకు వాల్చు కున్నాడు.

జ్యోతి ముఖంపైనుంచి మేలిముసుగు తొలగిపోయింది. కన్నీటి ప్రవాహంవల్ల ఆ మెముఖకాంతి కొంచెం క్షీణించింది.

అవనాశుడు మళ్ళీ చెప్పసాగాడు – "వదినా! ఈవిధంగా దుఃఖించినందువల్ల ప్రయోజనం ఏదీలేదు. నేనీయింట్లో వున్నంత వరకూ నీకు ఏవిధమైన కష్టమూకలగదు. ఎవరూ నిన్ను కష్టపెట్టేందు కూడా సాహసించలేరు. నీవు నన్ను నీ సహాయకుడిగానూ, శుభ చింతకుడు గానూ భావించుకో. కాని ఒక్క సంగతి, ఇకముందునుంచీ నీవు కఠినంగామాత్రం ప్రవర్తిస్తూ వుండాలిసుమా! నీ యీ స్వర్ణ రాజ్యంమీద యితరులు పెత్తనం చెలాయిస్తూ ఆనందాన్ని అనుభ విస్తూవుండటం నాకేం బాగుండలేదు. నీవు దీన్ని ధైర్యంతోనూ, శాంతంగానూ సహించి వూరుకుంటే వూరుకుందువుగాక; కాని నేను మాత్రం నీ యీహక్కును యితరులు హరిస్తూవుంటే, చూస్తూ వూరు కోలేను. ఒక్కసారి యిటుచూడు వదినా, యీయింటికీ నాకూ సంబంధం ఏమిటి? ఏమీలేదుగదా! కాని, కఠినంగా ప్రవర్తించి నాకు కావలశినంత సుఖంగా వుంటున్నాను. కాని, నీవు యింటి యజమానురాలివి. ఈమాత్రమైనా చేయలేవా? నేనుకూడా ప్రథ మంలో యిక్కడకు వచ్చినప్పుడు, నన్నొక తుచ్ఛుడిగా భావించుకుని అయినవాడూ, కానివాడూ – ప్రతివాడూ అనేమాటల్ని పడుతూ వుండేవాణ్ణి. ప్రతివాళ్ళకీ అణకువగా వుంటూవుండేవాణ్ణి. కాని, యిలా వినయంగానూ, అణకువగానూ వున్నందువల్ల ప్రయోజనం లేదని తెలిశినప్పటినుంచీ, నిర్భయంగా తిరుగుతూ, బెదిరించి పని చేయించుకోవటం ప్రారంభించాను. ఏదోవిధంగా డబ్బు పంపించే యేర్పాటు చేసుకుని, కలకత్తా వెళ్ళి చదువుకోసాగాను. ఇదివరకటి కంటె ఎక్కువ నిశ్చింతగా యిప్పుడు వుంటున్నాను. నేనుకూడా యిక్కడిపరిస్థితులు తెలుసుకోకుండా, అందరకీ అణకువగా వుంటూ వున్నట్టయితే, ఇప్పుడు నేవున్నస్థితిలో వుండేవాణ్ణికాను. అందు

వల్లనే నేనిలా నీతో తెరచాటున వున్నందువల్లా, అణకువగా వున్నందువల్లా యిక్కడ పనిజరగదని చెబుతున్నాను. నిష్పూరన్నాకువలె అందరూ నీకు ఝుడిసి దూరంగా వుండేటట్టుగా ప్రవర్తించు. ఇలా చేయటం మొదలుపెట్టినప్పట్నించీ, నరకసదృశంగావున్న యీ యిల్లు స్వర్గతుల్యంగా అవుతుందో లేదో చేసిచూడు."

జ్యోతియిక మౌనంగా కూర్చోలేక పోయింది. అవనాథుడి ప్రసంగం ఆమె హృదయంలో గాఢంగా నాటుకుంది. కళ్ళు తెరుచుకున్నాయి. పాప పుణ్యాలను గురించి ఆమెకు చక్కగా బోధపడ్డది. ఈ పాపిష్టిప్రదేశంలో ఆమెకు నేడొక దేవుడు కన్పించాడు. అంధకార బంధుర భయంకర అరణ్యంలో ఆమెకు వెలుగు కనిపించింది. "నిజమేమరిదీ! నేనొక పేదయింటి బిడ్డనుగదా!" అందిజ్యోతి.

"నీవేమీ ఎవరినీ యాచించేందుకు పోలేదుగదా! వీళ్ళంతట వీళ్ళేవచ్చి నిన్ను తెచ్చుకున్నారు". అన్నాడు అవనాథుడు.

"మరిదీ! నాలో అంతశక్తివున్నదా?"

"ఆ, ఎందుకులేదు నీలో అపారమైన శక్తివుంది. నీ శక్తిని గురించి నీకుతెలియదు. ఇక ముందునుంచి, నేనుచెప్పినట్లు చెయ్యి. శక్తిప్రదర్శనచెయ్యి. నిన్ను గౌరవిస్తున్నారో లేదో చూసుకో. నీఆజ్ఞను ఉల్లంఘించేందుకు ఎవడుసాహసించలేడు".

తాంబూలాలు మడవటం పూర్తిఅయింది. "అలాగే చేస్తాను! నీవుచెప్పిన విషయం అంతా ఆలోచించి చూస్తాను. కళ్ళు వుండికూడా గ్రుడ్డిదానిలాగా కూర్చుని వున్నాను. ఇక్కడనుంచి వెళ్ళిపోవాలని కూడా అనుకున్నాను. ఒకవిపత్తులో వున్న స్త్రీకి వాగ్దానం చేసాను. అందువల్ల వుండిపోవాల్సివచ్చింది. ఇకనీవు చెప్పినప్రకారం చేస్తాను. ఈకార్యంలో అబలనైన నాకు నీవుసహాయం చెయ్యాలిసుమా? అంది జ్యోతి.

# 19

లక్ష్మీకాంతుడు అనాథ జ్యోతిని యింట్లోనుంచి వెళ్ళి పొమ్మన్నాడు. కాని, ఆమెను యింట్లోనుంచి వెళ్ళగొట్టేందుకు సాహసించలేకపోయాడు. జ్యోతిని తాను ఏవిధంగానూ యింట్లో నుంచి వెళ్ళగొట్టలేనని లక్ష్మీకాంతుడికి బాగా తెలుసు. ఆమెను వెళ్ళగొట్టినందువల్ల తనకే అవమానం కలుగుతుంది. బీదబ్రాహ్మణ పిల్లను పెళ్ళాడి, యింట్లోనుంచి వెళ్ళగొట్టాడంటే, తననే లోకులు నిందిస్తారు. అలా చేసినందువల్ల తన గౌరవప్రతిష్ఠలకు భంగం వాటిల్లుతుంది. ఇలాంటి పాడుపనిచేసి తనవంశానికి కళంకం తేవటానికి అతడు యిష్టపడలేకపోయాడు. జ్యోతి చాలా నిశ్చయస్తురాలయింది. జ్యోతి తన తండ్రితో యీసంగతిఅంతా చెబుతుందేమో అనే భయంతో కూడా లక్ష్మీకాంతుడు తనకోపాన్ని లోలోపలనే అణచుకున్నాడు. ఇలాంటి సిగ్గుమాలిన నిర్భాగ్యపు స్త్రీముఖం చూడగూడదని అతడు ప్రతిజ్ఞ చేసుకున్నాడు కూడాను. ఇలాచేస్తే, చివరకు జ్యోతియే లొంగివస్తుందని అతడి వుద్దేశ్యం.

ఆమెగదిలోకి తానువెళ్ళి పడుకోకుండావుంటే, తనగదిలో ఒంటరిగా పడుకోలేక, భయపడి ఆమెయే తనవద్దకు వస్తుంది — అని తలచి లక్ష్మీకాంతుడు తనగదిలో నిద్రించటం మానివేశాడు. జ్యోతి నిద్రించే గదిలో అతడు పొరపాటుగాకూడా అడుగుపెట్టటంలేదు. ఆమె క్షేమసమాచారాలనుకూడా కనుక్కోవటం మానివేశాడు. లోకుల పొగడ్తలలో అతడికి జ్యోతినిగురించి ఆలోచించవలసిన అవసరం లేకుండా, ఆనందం లభిస్తోంది. కాని, చివరకు అతడికి జ్యోతియొక్క మంచి — చెడ్డలు కనుక్కోవలసిన అవసరం తనకు వున్నట్టు అనుభవం అయింది అవనాథుడు అప్పుడప్పుడు వచ్చి తన ఆట — పాటల్లో పాల్గొంటూ వుండేవాడు. అతడిమాటలవల్ల లక్ష్మీకాంతుడికి రకరకాల అనుమానాలు కలుగుతూవుండేవి. రానురాను లక్ష్మీకాంతుడికి అవనాథుడంటే ఒకవిధమైన భయం ఏర్పడటమేగాక అతడి ప్రశ్నలకు జవాబుచెప్పటంకూడా అతడికి కష్టమైపోయింది.

అవనాశుణ్ణి కలవటం లక్ష్మీకాంతుడికి యిష్టంలేదు. కానీ అలా చేయలేక పోయాడు. అవనాశుడు బామాకాళీకి మరది కొడుకు. అతన్ని ఎవరూ ఏమీ అనేందుకు సాహసించలేరు. ఒక్క నవ్వు నవ్వి తప్పించుకోవటం తప్ప, అతడి ప్రశ్నలకు ఎవరూ ఏ జవాబూ ఇవ్వలేరు.

లక్ష్మీకాంతుడు ఏకాంతంగా వుండటం చూసి, ఒక రోజున అవనాశుడు అతడితో యిలా చెప్పసాగాడు. "పెద్ద బాబూ మీ అమూల్యమైన సమయాన్ని నష్టపరుస్తున్నందుకు క్షమించాలి. మిమ్మల్ని ఒక అవసరమైన సంగతి అడగాల్సివుంది. మీరు సంతోషంతో జవాబు చెప్పి, నన్ను కృతార్థుణ్ణి చేస్తారా?"

"ఏమిటో చెప్పు" మన్నారు లక్ష్మీకాంతుడు ఈ మాట అంటూ వుండగా అతడి శరీరం ఆందోళకంపించింది. అవనాశుడి మాటలు అసాధారణంగా వుంటాయి. అతడి మాటలకు జవాబు చెప్పటం సులభమైన పనికాదు. అందువల్లనే లక్ష్మీకాంతుడు వణికాడు.

"రాత్రిళ్ళు మీ రెక్కడ నిద్రిస్తున్నారో?" అన్నాడు అవనాశుడు.

"బయటి గదిలో"

"మీ గది విడిచి బయటి గదిలో ఎందుకని నిద్రిస్తున్నారో?"

"ఈ మధ్య లోపలి గదిలో మితిమీరి ఉమ్మ దిస్తోంది".

"కాదు బాబూ! అది కాదు. నేను కలకత్తా నుంచి వచ్చినప్పట్నించి చూస్తూనే వున్నాను. మీరు పొరబాటుగా కూడా వదినగారి గదిలో అడుగు పెట్టటంలేదు, ఎందుకనో కాస్త చెప్పవచ్చునా?"

"నీకేం ప్రయోజనం వుంది?"

"సానుభూతి, కుల గౌరవ ప్రతిష్ఠల్ని దృష్టిలో వుంచుకుని అడుగుతున్నాను. మా పట్ల సానుభూతి లేనప్పుడు మిమ్మల్ని యీ సంగతి అడిగేవాణ్నే కాదుగదా? లోకులకు యీ సంగతి తెలిస్తే ఏమనుకుంటారు?"

"లోకులకు యీ పని తప్ప వేరే పనేమీ లేదా?"

"లేదు"

అవనాశుడు మాట్లాడకుండా కుర్చీలో కూర్చున్నాడు. లక్ష్మీకాంతుడు దీర్ఘంగా నిట్టూర్చాడు. అవనాశుడు మాట్లాడకుండా వూరుకునేప్పటికే, అతడికి ప్రాణాలు కుదుటబడ్డట్టు అనిపించింది. మళ్ళా ఏమైనా అడుగుతాడేమో — అనే భయంతో లక్ష్మీకాంతుడు అక్కడినుంచి తప్పించుకుపోయేందుకు ప్రయత్నించాడు. కాని, అవనాశుడు అతణ్ణి పోనివ్వలేదు. మళ్ళీ 'పెద్దబాబూ!' అన్నాడు.

లక్ష్మీకాంతుడు ఉలికిపడి "ఏమిటి?" అన్నాడు.

"ఆమె క్షేమసమాచారాలు కనుక్కునే తీరికయే లేనప్పుడు, పరాయియింటిపిల్లను పెళ్ళిచేసుకొని తీసుకురావటం ఎందుకు? తల్లి దండ్రులు ఆమెకు ఆమాత్రం అన్నం పెట్టలేకపోయారా?"

"నీకు తెలియదు అవనాశూ! ఆమె రాక్షసి"

"రాక్షసా! ఎలాగో కాస్త చెబుతారా?"

"అదొక పెద్దగాథ. ఏమైనా కానీ, ఆమెకూ నాకూ యిక సరిపడదు."

"ఎందుకని? సరిపెట్టుకునేందుకు ప్రయత్నంకూడా చేశారన్న మాట!"

అవనాశుడు అన్నమాటలను లక్ష్మీకాంతుడు సహించలేక పోయాడు. లక్ష్మీకాంతుడు తనలోతాను "నా కృపాదృష్టిని ఆశించి, నా పెట్టు — పోతల్లో పెరిగిన వీడు, నన్ను యిలా అడుగుతాడా? నన్నిలా బాధించవలసిన అవసరం వీడికి ఎందుకు కలిగింది? రోజు రోజుకూ వీడి వ్యవహారం మితిమీరిపోతోంది" అనుకొని, కోపంతో యిలా అన్నాడు — "నీ ప్రశ్నలకు జవాబు చెప్పాల్సిన అవసరం లేదునాకు. నా యిష్టంఅయితే వుంచుకుంటా, లేకపోతే లేదు. నన్నడిగేందుకు నీవెవరవు? నీవు యిలా ఎందుకుచేస్తున్నావో నాకు అర్థంకావటల్లేదు. నాదగ్గర్నించి వెళ్ళిపో."

"పెద్దబాబూ!"

"పెద్దబాబూలేదు. చిన్నబాబూలేదు! నేనేం వినదలుచుకోలేదు. నాయింటి వ్యవహారాల్లో జోక్యం కలిగించుకునేందుకు నీవెవరవు?"

(కోపంతో) "పెద్దబాబూ! కొంచెం సంబాళించుకు మాట్లాడండి. మీయిష్టంవచ్చిన మాట అనండి. నేను సహించి వూరుకుంటాను. ఏమాత్రం కోపం తెచ్చుకోను. మీ పెట్టు-పోతల్లో వున్నాను కాబట్టి ఏమీ అనుకోను. కాని ఒక్క సంగతి! వదినగారి విషయంలో మాత్రం యిలా మాట్లాడకండి. అందరూ మనలాగే అని అనుకోరాదు. ఐదు వేళ్ళూ ఒకేమాదిరిగా వుండవుగదా?"

క్రోధంవల్ల లక్ష్మీకాంతుడికళ్ళు నిప్పులు క్రక్కసాగాయి. లక్ష్మీకాంతుడికి జవాబుయిచ్చేందుక్కూడా అవకాశం యివ్వకుండా అవినాశుడు మళ్ళీ చెప్ప నారంభించాడు-" నాకుఅన్ని సంగతులూ తెలుసు నాకు తెలియని సంగతిఏదీలేదు. కళ్ళేర్ర జేసినందువల్ల జడిసేవాణ్ణికాను. ఇలాచేశారంటే, మీగుట్టుఅంతా బయట పెట్టి నిర్మలప్రభ భర్తతో యిక్కడిసంగతులన్నీ చెబుతానని తెలుసుకోండి".

అవినాశుడి యీమాటలు వినేటప్పటికే లక్ష్మీకాంతుడికి భయంవేసింది. "నిర్మలప్రభసంగతి యితడికి ఎలా తెలిసింది? జ్యోతి చెప్పిందేమో? రాక్షసిముండ!. అనిలోలోపల అనుకున్నాడు. పాపం, జ్యోతి యీవిషయంలో పూర్తిగానిరపరాధి. తానారాత్రి చూచిన పాపదృశ్యాన్ని గురించి ఎవరితోనూ చెప్పదలుచుకోలేదు, చెప్పలేదు.

నిర్మలప్రభ బలాత్కారంగా యీ పాపగుండంలో పడవేయబడ్డదన్న సంగతి జ్యోతికి తెలుసు. ఈవిషయంలో ఆమెపూర్తిగానిరపరాధియనికూడా తెలుసు. నిర్మలప్రభకు తానుచూసిన సంగతి చెప్పి, ఆమెను యింకా కష్టపెట్టటం జ్యోతికి యిష్టంలేదు.

అవనాశుడికి స్వయంగానే నిర్మలప్రభసంగతి తెలుసు. ఆతడు కలకత్తానుంచి యిక్కడకు వచ్చినప్పుడు రెండు మూడు సార్లు యీ దుష్కార్యాన్ని స్వయంగా చూసికూడా, చూడనట్లు నటించేవాడు. నిర్మలప్రభ సతీత్వాన్ని కాపాడేందుక్కూడా ప్రయత్నించాడు. కాని వుపయోగం లేకపోయింది! అతను నిర్మలప్రభ భర్తకుడా రహస్యంగా ఒకవుత్తరంకూడా రాశాడు. అందులో "నిర్మలప్రభ అనారోగ్యంగా వున్నదనీ, మిమల్ని విడిచిపెట్టి వచ్చినప్పటినుంచి విచారంగా వుంటూ వున్నదనీ, ఆమెపరిస్థితిని బట్టిచూస్తే, ఆమెను యిక్కడ వుండటం

యిష్టంకానట్టు తెలుస్తున్నదనీ, మీరాకకోసం ఎవరు చూస్తున్నదనీ వెంటనేవచ్చి తీసుకు వెళ్ళవలశిందనీ” వ్రాశాడు. ఇంతేగాక “ ఈ వుత్తరం రహస్యంగా వుంచవలసిందనీ, బయటపెడితే ఆమె ఆత్మహత్యచేసుకోవచ్చుననీ, అందువల్లమీకే అవమానం కలుగుతుందనీ, కూడా వ్రాశాడు.

చివరకు నిర్మలప్రభ భర్త ఆమెనుతీసుకు వెళ్ళేందుకు వచ్చాడు. భర్తతనను తీసుకుని వెళ్ళేందుకు ఎందుకువచ్చాడోఆమెకు తెలియలేదు. అయినప్పటికీ, భర్తరాగానే సంతోషంతో అతడివెంట వెళ్ళిపోయింది.

నిర్మలప్రభ ఎదైనామాట అవనాశుడితో చెప్పినప్పుడు, అవనాశుడు ఆమెముఖాన్ని రహస్య మయదృష్టితో చూస్తూ వుండేవాడు. నిర్మలప్రభపైన లక్ష్మీకాంతుడి నీడకూడా పడనివ్వ రాదని అతడి అభిలాష. ఈవిష్యయంలో నిర్మలప్రభ నిరపరాధి అని అతడికి తెలుసు. ఈ సుకర్మ జరిగిన రోజురాత్రి అవనాశుడు లక్ష్మీకాంతుడి వద్దకువచ్చి “ పెద్దబాబూ! ఇంతరాత్రివరకు మేలుకు వున్నారేం! ఇటూఅటూ తిరుగుతున్నారు. ఎందుకని?” అన్నాడు.

లక్ష్మీకాంతుడికి కోపంవచ్చి “అమితంగా ఉక్కపోస్తోంది, నిద్ర రావడంల్లేదు. అందుకని యిటూ అటూ పచార్లుచేస్తున్నాను. గాలి అనేమాటేలేదు. ఆకుకూడా కదలటల్లేదు” అన్నాను.

“అబ్బ! అంత ఉక్కపోస్తుందా!” అని బయటి గదిలోకి వెళ్ళిపోయాడు అవనాశుడు.

నిర్మలప్రభమాట తెచ్చినప్పుడు, యిందువల్లనే లక్ష్మీకాంతుడు భయపడి, రహస్యంకాస్తా బయటపెడతాడేమో అనే భయంతో చల్లగా గదిలోనుంచి బయటకు జారుకున్నాడు.

అవనాశుడు గుమ్మంవద్ద మొదలకుండా నుంచునివున్నాడు. లక్ష్మీకాంతుడు యింకా వెళ్ళిపోవటం చూసి, దీర్ఘంగా నిట్టూర్చి, నదివైపుకు షికారుకు వెళ్ళాడు.

# 20

ఆరోజు రాత్రి అవనాశుడు చాలా పొద్దుపోయాక యింటికి వచ్చాడు. ఒళ్ళంతా విరగ్గొట్టినట్టుగానూ, తల భరించరానంత నొప్పిగానూ వుంది. అందువల్ల అన్నం తినాలనికూడా అనిపించలేదతడికి. మెదలకుండా ప్రక్కమీదకుపోయి పండుకున్నాడు.

ఇన్నాళ్ళనుంచీ కలిగిన పరిచయము, సంభాషణలవల్ల జ్యోతికి అవనాశుడిమీద కొంచెం శ్రద్ధ ఏర్పడ్డది. ఈవిశాలభవనంలో యిప్పటివరకు జ్యోతికి కనిపించినవాళ్ళందరిహృదయాలూ పాషాణంకంటే ఎక్కువ కఠినమైనవిగా కనిపించాయి. రాతిగుండెవాళ్ళతో స్నేహం చెయ్యటమూ, వాళ్ళతో కలుపుగోలుతనంగా వుండటమూ – యిది రాతితో తల బ్రద్దలుకొట్టుకోవటంవంటిది. ఆమెకు కనిపించినంతవరకు ఒక్క అవనాశుడుమాత్రం యితరులబాధలను చూచి తానుకూడా బాధపడుతూ వుంటూన్నాడు. అతడి హృదయంలో ప్రేమ, అనుకంప, సానుభూతి – వున్నాయి. అతడిక్కడికి ఎందుకు వొస్తున్నాడు? పిన్నిగారికీ అతడికీ గల సంబంధం ఏమిటి? – అనే సంగతులు ఆమె హృదయంలో గిలిగింతలు పెడుతున్నాయి. అవనాశుడు జ్యోతిహృదయంలో తనకు స్థానాన్ని సంపాదించుకున్నాడు. జ్యోతికి అవనాశుడితో స్నేహం ఏర్పడింది. ఆమె యిప్పుడు అవనాశుడి అన్నపానాదులు, కష్ట – సుఖాలపట్ల శ్రద్ధ తీసుకోసాగింది. ఇంతకుమించి స్త్రీ తన స్నేహాన్ని ప్రకటించగలమార్గం యింకేముంది!

అవనాశుడు కూడా జ్యోతిని అనురాగంగా చూస్తున్నాడు. భోజనసమయంలో భోజన పళ్ళెంవైపు చూచినప్పుడు, ఆ పళ్ళెంలో పెట్టిన వస్తువులన్నీ పరిశుభ్రమైనవీ, శ్రేష్ఠమైనవిగానూ కనిపిస్తూ వుండేవి. ఎటుచూసినా అంతే, స్నేహం తొణికిసలాడుతూ వుండేది.

ప్రపంచంలో ప్రేమ, స్నేహములను మించి యింకేం వున్నాయి?

ఆ రాత్రి అవనాశుడు భోజనం చెయ్యలేదు. జ్యోతి వంటయింట్లో కూర్చుని అతడిరాకకు ఎదురుచూస్తూవుంది. అతడెందుకు

రాలేదు? ఎక్కడకు వెళ్ళి వుంటాడు? — అనే ప్రశ్నలు ఆమెను చీకాకు పరచసాగాయి. ఈ విషయాన్ని గురించి ఆమె ఎవరినీ ప్రశ్నించలేదుకూడా. ఈ యింటి పరిస్థితుల ననుసరించి, యిలా అడిగి తెలుసుకోవటం, నూతిలో కాళ్ళు జాపుకు తనంతతానే మృత్యువును పిలవటంలాంటిది. ఒక్క బామాకాళికి తప్ప, తక్కిన వాళ్ళెవరికీ, ఆఖరుకి దాసీలకుకూడా, తాను అవనాథుడిపట్ల యింత శ్రద్ధ చూపుతున్నట్లు తెలిస్తే సహించి వూరుకోరు. తను భర్తను విడిచిపెట్టి వెళ్ళటట్టైతే, అవనాథుడికి అతిథి సత్కారాలు చేసేందుకు ఎలా వీలవుతుంది?

ఇలా అని ఆలోచించి ఆమె మెదలకుండా కూర్చునివుంది. అందరూ భోజనాలుచేసి నిద్రపోయేందుకు వెళ్ళిన కొంతసేపటికి, జ్యోతికూడా పడుకొనేందుకు తన గదిలోకి వెళ్ళింది. లక్ష్మీకాంతుడు తనగదిలో లేకపోవటం చూసి, ఆమె నిర్మలప్రభను వెతికేందుకు బయలుదేరింది. నిర్మలప్రభ తనగదిలో మంచంమీద పడుకొని వుండటాన్నిచూసి "నిర్మలా!" అని పిలిచింది.

నిర్మలప్రభ జవాబేమీ యివ్వలేదు. ఆమె ఒడలెరుగకుండా నిద్రపోతూవుంది నిర్మలప్రభ యీ విధంగా గాఢనిద్రలో వున్నందువల్ల, అక్కడినుంచి బయలుదేరి అవనాథుడి గదివద్దకు వెళ్ళింది. అవనాథుడిగది చీకటిగా వుంది. ఒకవైపున వున్న కిటికీమాత్రం తెరిచివుంది. చంద్రుడి పండు వెన్నెల కిటికీలోనుంచి అవనాథుడి మంచంమీద పడుతోంది. గుమ్మంవద్దకు వచ్చి, "మరిదిగారూ!" అని పిలిచింది.

జ్యోతి పిలుపు విని అవనాథుడు కళ్ళుతెరిచి "వదినగారా?" అన్నాడు.

"అవును"

"ఇంత రాత్రిపోయి వచ్చారేం వదినా? కులాసాగా వున్నారా?"

"ఆ, అంతా కుశలమే. భోజనానికి రాలేదేం?"

"ఇవ్వాళ నాఒంట్లో బాగాలేదు. తల నొప్పిగావుంది. అందు కని భోజనానికి రాలేదు."

ఇలా చెప్పి అవనాథుడు తన రెండుచేతులతోనూ తల పట్టు కున్నాడు. మంచంమీదనుంచి లేచి కూర్చున్నాడు. జ్యోతి అతడి దగ్గరకివచ్చి అతడి తలమీద చేతితో నిమరసాగింది. "అబ్బ! ఎంత వేడిగావుంది. వసవస కొట్టుకొంటోంది." అని, తరువాత అతడిచేతిని నిమిరి "చెయ్యికూడా నిప్పులాగ కాలిపోతోంది" అంది జ్యోతి.

"చలిగా వుందా?"

"మరే, కొంచెం చలిగానేవుంది."

"ఏమంటున్నావ్? జ్వరం బాగావచ్చింది. మంచంమీద పడు కునివుండు. ఉడుకులాం తీసుకువస్తాను" అని చిరునవ్వు నవ్వి జ్యోతి అంది.

"వదినా! నాకోసం మీరెందుకు కష్టపడతారు? నిద్రపోయి లేచేప్పటికే అంతా కుదుటబడుతుంది. తల నొప్పికూడా తగ్గిపోతుంది. మీరు నాకోసం శ్రమపడవద్దు. వెళ్ళి పడుకోండి."

"కామరే, నీవు పడుకో, ఇప్పుడే తిరిగివస్తాను."

"వదినా! నాశరీరం ఉక్కుశరీరం. అంత తేలికగా కందిపో యేది కాదు"

జ్యోతికి అవనాథుడమాటలు వినేప్పటికే దుఃఖం కలిగింది. అవనాథుడు తనతో యిలా ఎందుకు అన్నాడా – అనిపించింది. ఇక్కడ ఎక్కువసేపు వుండటం మంచిదికాదనుకుని జ్యోతి తిన్నగా తనగదిలోకి వెళ్ళిపోయింది. లక్ష్మీకాంతుడు యింకారాలేదు, పెట్టె తీసి అందులోనుంచి సీసా బయటకుతీసి ముంగిలిలోకి వచ్చింది. మెట్ల మీద ఎవరివో చెప్పులచప్పుడు వినిపించింది. లక్ష్మీకాంతుడు పైకి వస్తున్నాడు.

అవనాథుడికిగదిలో కుంపటిమీద ఒకపాత్ర పెట్టి, దాంట్లో ఉడుకలాంపోసి కలిపి, దాన్ని అతడి తలమీద పెట్టింది. ఆసమ యంలో అవనాథుడు శరీరస్మృతిలేకుండా వున్నాడు.

అవనాశుడి తలమీద ఉడుకులాం పెట్టి, అతడికి జ్యోతి విసన కర్రతో విసరసాగింది. జ్వరతీవ్రతవల్ల అవనాశుడు ఏమాత్రంకూడా స్పృహలేకుండా వున్నాడు. రాత్రి గడిచినకొద్దీ, జ్యోతికి నిద్ర రాసాగింది. చేతులు రెండూ నెప్పిపెట్టసాగాయి. అయినప్పటికీ ఆమె విసనకర్రను విడచిపెట్టలేదు.

అవనాశుడి జ్వరం కొంచెం తగ్గసాగింది. అతను కళ్ళుతెరిచి చూచేప్పటికే, జ్యోతి కునికిపాట్లు పడుతూ కంపించింది. అప్పటి కూడా ఆమె విసనకర్రను విడువలేదు. ఏదోదినంగా విసురుతూనే వుంది. వికసించిన కమలంలాంటి జ్యోతిముఖం వాడిపోయింది. ఆమె ముఖాన్ని అవనాశుడు ధ్యానంగా చూశాడు. గ్లాని అనుకంపలతో అతడిహృదయం నిండిపోయింది. ఓపికచేసుకుని "వదినా!" అని పిలిచాడు.

జ్యోతి సిగ్గుపడుతూ "క్షమించు, కొద్దిగా నిద్రమత్తువచ్చింది" అంది.

"వస్తేవచ్చిందిలెండి. రాత్రల్లా మేలుకుని నాకు పరిచర్య చేశారు."

"చేస్తేనేం?"

"కాని వదినగారూ! మీరు నాకోసం యింత కష్టపడటం ఎందుకండీ?"

"దానికేంగాని, జ్వరంగానీ, తలనొప్పిగానీ ఏమైనా తగ్గిందా?"

"మీరు నా శరీరాన్ని చేతితో నిమిరి నావ్యాధినంతటీ పోగొ ట్టారు. ఇప్పుడువెళ్ళి సరోవరంలో స్నానంచేశిరానా? సరోవరంలో స్నానంచేసి వస్తే హాయిగా వుంటుందేమో అనిపిస్తోంది".

"వద్దు. అలా చెయ్యరాదు! నిన్ను స్నానమూ చెయ్యనివ్వను భోజనమూ చెయ్యనివ్వను."

"అయితే నాకు జావయిస్తారా వదినా? రాదురాదు. నాజన్మలో నే నింతవరకు జావ తాగలేదు. నాకోసం వృధాగా ఎందుకు కష్టపడతారు?"

"ఏం ఫరవాలేదు. చేతులు కడుక్కుని కాస్త జావ తాగు. జ్వరం తగ్గిపోయిందన్నావు. కాని, ముఖం మటుకు చూచేందుకు అలాగే వుంది."

"దీనికేంలెండి. మృత్యువు తరువాతకూడా మానవ శరీరంలో వుండే ఉష్ణం పూర్తిగా లేకుండాపోదు. శరీరంలో అలాగే నిలిచి వుంటుంది!

"సరేలే, నీవు లేచి కూర్చో"



## 21

ఆనాడు సాయంత్రం అవనాథుడికి మళ్ళీ జ్వరం వచ్చింది. జ్యోతి అతడికి జావకాచి తెచ్చేందుకు వంటింట్లోకి వెళ్ళింది. పగటి సమయంలో అతడికి శుశ్రూషచేసే బాధ్యత నిర్మలప్రభకు వప్పగించింది. పగలల్లా అతణ్ణి విడిచిపెట్టకుండా కూర్చోవలిసిందిగా నిర్మలప్రభతో చెప్పి, అవసరమైన పనులన్నీ పూర్తిచేసుకుని, ఆతరవాత జ్యోతి అతడిగదిలోకి వస్తుంది.

ఇంట్లోవున్నవాళ్ళెవరుకూడా అవనాథుడి జ్వరంసంగతి పట్టించుకోకపోవటం చూసి జ్యోతి ఆశ్చర్యపడింది. ఇంట్లో వున్నవాళ్ళంతా పూర్వంవలెనే యధాప్రకారంగా ఎవరిపనిలోవారు లీనమైవున్నారు. తాను ఒక్కతే ఆదుర్దాగా యిటూ ఆటూ తిరుగుతూ వుంది. ఆమె సంగతికూడా ఎవరికీ పట్టలేదు. చివరకు అవనాథుడి పిన్తల్లికూడా అతడిసంగతి పట్టలేదే! అతడు నిన్నరాత్రి ఎందుకు భోజనం చెయ్యలేదో అడిగి తెలుసుకోవాలనికూడా ఆమె ప్రయత్నం చెయ్యలేదెందుకని? ఈవిషయాలన్నీ జ్యోతిని మాటిమాటికీ బాధించసాగాయి.

సాయంత్రం అయిన తరువాత అవనాథుడికి మళ్ళీ 102 డిగ్రీలు జ్వరం వచ్చింది. రెండు కళ్ళూ రక్తంలాగ ఎర్రగా వున్నాయి. ముఖం కాల్చిన యినుములాగా వుంది. అతడి పరిస్థితి చూచేప్పటికే జ్యోతికి భయంవేసింది. ఇక డాక్టర్ని పిలిపించకపోతే మాటదక్కదు.

కాని, ఎవరితో చెప్పి పిలిపించాలి — అనే సమస్య జ్యోతిని బాధించింది. నిర్మలప్రభతో చెప్పి యీ పని చేయిస్తాననుకుని, నిర్మలప్రభతో యీసంగతి చెప్పింది. ఆ మాట వినగానే నిర్మలప్రభ "వదినా! నాతో చెప్పటంకంటే పెద్దబాబుతో నీవు చెబితే ఎక్కువ బాగుంటుంది. ఆస్పత్రినుంచి యింటికి వెళ్ళేటప్పుడు డాక్టరుగారు వచ్చి చూసి వెడతారు?" అంది.

"ఏం, ఎందుకని? నీవే వెళ్ళి మామగారితోనూ, అత్తయ్యగారితోనూ చెప్పు."

వేదికను ఆయింట్లో వున్న వాళ్ళందరూ అత్తయ్యగారని పిలుస్తుంటారు.

"ఈయింటి వ్యవహారాలు విచిత్రంగా వుంటాయి. నెలకు ఒక పర్యాయం డాక్టరుగారు యింటికి వస్తూవుంటారు. ఆసమయంలో ఎవరైనా అనారోగ్యంగావుంటే, మందు యిస్తారు, లేకపోతే లేదు. అదేగాదు, యిక్కడ పనిచేసేవాళ్ళంతా పనిచేయకుండా తప్పించుకు తిరగాలని చూస్తేవారే. ఎవరితోనైనా డాక్టరుగారిని పిలుచుకురమ్మని నేనే చెబుతాననుకో, అతడు, వెళ్ళికొంతసేపు అటూయిటూ తిరిగివచ్చి, డాక్టరుగారు వస్తున్నారని చెబుతాడు. పెద్దబాబు జ్వరపడ్డప్పుడు పరిస్థితి వేరు. అవనాథుడి సంగతి ఎవ్వరికి కావాలి?" అంది నిర్మలప్రభ.

"పాపం!" అని జ్యోతి మెదలకుండా వూరుకుని, నిర్మలప్రభ ముఖాన్ని ధ్యానంగా చూడసాగింది. మళ్ళీ నిర్మలప్రభ యిలా చెప్పసాగింది — "డాక్టరుగారు విచిత్రమైనవ్యక్తి; మనయింట్లో వున్న వాళ్ళల్లో ఒక పెద్దబాబుగారికి తప్ప, మరెవరికి జ్వరం వచ్చినప్పటికీ ఆయనకు వచ్చేందుకు తీరికవుండదు. అందుకనే, పెద్దబాబుగారితో చెప్పమని చెబుతున్నాను. లేకపోతే..."

నిర్మలప్రభ మాటలను విని "అయితే, యిప్పుడు నన్ను పెద్దబాబుగారి దగ్గరకి వెళ్ళి ప్రార్థించమంటావన్నమాట" అంది జ్యోతి ఆనాటి సంఘటన తరువాత జ్యోతి లక్ష్మీకాంతుడితో మాట్లాడకపోవడమే గాక, అతణ్ణి చూడనైనా చూడలేదు. కాని, యివ్వాళ యీవిషయంకోసం ఆయనతో మాట్లాడాలి. అసంభవం!

పోనీ, పూరుకుందామా అంటే మరింకొకమార్గం ఏదీ కనిపించ లేదు. చివరకు ఒకపరిచారికను ఒకపావలా ఇనాంయిస్తానని ఆశపెట్టి పెద్దబాబుగారివద్దకు పంపింది. ఆమె వెళ్ళి "వదినగారు పిలుస్తున్నారు. ఏదో అవసరమైన పని వున్నదిట" అని చెప్పింది.

"ఏమిటాపని? పెద్దబాబుగారు పనిలోవున్నారు. వచ్చేందుకు వీల్లేదు." అని ఆమెకు జవాబు లభించింది. ఈ కటువైన జవాబును గైకొని పరిచారిక వెళ్ళిపోయింది. ఆమెనుండి యీజవాబు వినగానే జ్యోతికళ్ళు కన్నీటితో నిండిపోయాయి. ఒక్క క్షణంకూడా తానిచ్చట వుండకూడదని ఆమె నిశ్చయించుకున్నది.

వెంటనే ఆమె అవనాథుడి గదిలోకి వెళ్ళింది. అవనాథుడు స్పృహ లేకుండా మంచంమీద పడుకునివున్నాడు. నిర్మలప్రభ అత డికి విసురుతూవుంది.

"నీవు వెళ్ళు. స్నానాదులు పూర్తిచేసుకుని మందిగారికి జావ తీసుకురా" అని జ్యోతి నిర్మలప్రభతో అంది.

నిర్మలప్రభ వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినతరువాత జ్యోతి అవనాథుడి ముఖంవైపు చూస్తూ కూర్చొనివుంది. "ఇంతయింట్లో ఒక్కమనిషికూడా ఎదటివాళ్ళ కష్టాన్నిగురించి ఆలోచించేవాడే లేడు." అనుకుంది. ఆమెకీయిల్లు నరకంలాగా కనిపించసాగింది. ఈయింట్లో వుండేవాళ్ళందరూ నిర్దయులూ, దురంతకులూనూ! — అనుకుంది.

ఇంతలో నిర్మలప్రభ జావ తీసుకువచ్చింది. జ్యోతి చెమిచాతో అవనాథుడిని త్రాగించసాగింది.

జ్యోతి పిలవగానే అవనాథుడు కళ్ళు తెరచి, చిన్నపిల్లవాని వలె జావ త్రాగసాగాడు.

"నీవు వెళ్ళి, భోజనం చేసి త్వరగా రా. నీవు వచ్చాక నేను వెడతాను ఇతణ్ణి ఒంటరిగా విడిచిపెట్టి వెళ్ళటం మంచిది కాదు" అంది జ్యోతి నిర్మలప్రభతో.

నిర్మలప్రభ అవనాథుడిశరీరాన్ని చేతితో తాకి చూచి "బాగా జ్వరం తగిలింది" అంది.

"అవును" అంది జ్యోతి.

రాత్రి చాలా ప్రొద్దుపోయినతరువాత ఏదో విధంగా రెండు మెతుకులు తిని జ్యోతి అవనాశుడిగదిలోకి వచ్చింది. నిర్మలప్రభతో "వెళ్ళి విశ్రాంతి తీసుకో" అని చెప్పింది.

"మరి నీవో?" అంది నిర్మల.

"ఇంకా కొంచెంసేపు వుండి, అతడికి స్పృహ రాగానే, నేనుకూడా వచ్చి నీగదిలో పడుకుంటాను."

నిర్మలప్రభ ఏమీ అడ్డుచెప్పలేదు. జ్యోతికి మాటపట్టుదల వున్నసంగతి నిర్మలప్రభకు తెలుసు. నిర్మలప్రభ తనగదిలోకి వెళ్ళిపోయింది. జ్యోతి గతరాత్రికివలెనే అవనాశుడి తలవైపున కూర్చుని అతడికి విసరుతోంది.

## 22

రాత్రి చాలా ప్రొద్దుపోయింది. చాలారోజులనుంచి రాత్రిళ్ళు మేల్కొని వుంటున్నందువల్ల జ్యోతి బాగా నలిగిపోయింది. నిద్రలేని మూలాన ఆమె కునికిపాట్లు పడుతోంది. విసరటంలో ఒక్కొక్కప్పుడు ఆమెతల అవనాశుడి దిండును తాకుతూవుంది. ఆసంగతే ఆమెకు తోచలేదు. ఆకస్మికంగా ఏదో పెద్దశబ్దం అయేటప్పటికే ఆమె కళ్ళు తెరుపుడుపడ్డాయి భయంతో వణుకుతో లేచికూర్చుంది. తనఎదుట లక్ష్మీకాంతుడు నుంచునివున్నాడు.

లక్ష్మీకాంతుడు రావటంతోటే 'వెంటనే బయటకు వెళ్ళిపో' అన్నాడు.

జ్యోతి అవనాశుడివేపు చూసింది. అత డింకా నిద్ర పోతూనే వున్నాడు. లక్ష్మీకాంతుడి అరుపులకు అవనాశుడికి నిద్రాభంగం అవుతుందేమోననే భయంతో జ్యోతి నెమ్మదిగా లక్ష్మీకాంతుడి వెంట వెళ్ళింది.

లక్ష్మీకాంతుడు జ్యోతిచేతిని పట్టుకొని బలవంతంగా తన గదిలోకి యీడ్చుకుపోయాడు. వెంటనే గదితలుపు మూసేశాడు.

"సాధ్వి! పతివ్రత!! సతి!!!" అని ఆమెను సంబోధిస్తూ, "యింత రాత్రివరకూ ఆగదిలో ఏం చేస్తున్నావో చెప్పుతావా?" అన్నాడు.

లక్ష్మీకాంతుడు యిలా మాట్లాడేప్పటికి జ్యోతి తమాయించుకుని వూరుకుంది. "కొంగల్లాగ ఏమి పేరాజులాట!" అని మనసులో అనుకుంది. ఈ అసహనీయమైన వ్యాఖ్యవల్ల ఆమెగుండె దడదడ కొట్టుకోసాగింది. లక్ష్మీకాంతుడు ఆమెచేతిని పట్టుకొని, గట్టిగా నొక్కి "చెప్పవేం?" అన్నాడు.

లక్ష్మీకాంతుడికి తనమీద కలిగిన సందేహభ్రమలకు జ్యోతి లోలోపల కోపం తెచ్చుకుంది. అతడి యీచీవాట్లూ గద్దింపులూ చూశి ఆమెహృదయం బరువెక్కిపోయింది. 'అవనాథబాబుకు జ్వరం వచ్చింది' అంది చివరికి.

ఆమెమాటలలో నమ్రత ఉట్టిపడుతూవుంది.

లక్ష్మీకాంతుడు చిరునవ్వు నవ్వి— "పాపం, అవనాథుడిమీద చాలా అనుగ్రహం చూపుతున్నట్టున్నావు ఈగదిలో పడుకోకుండా అక్కడ అతడిగదిలో అతడిప్రక్కన పడుకున్నావా?" అన్నాడు.

జ్యోతి తనలో తాను "ఈహాస-పరిహాసాలను ప్రచండాగ్నిలో పడవేసి భస్మం చేస్తే బాగుండును" నీచుడు! పాపి!! చండాలుడు!!!" అనుకుని, కొంచెంసేపు లక్ష్మీకాంతుణ్ణి చూస్తూవుండి "వూరుకోండి. యిలాటిమాటలు అనటానికి మీకు సిగ్గయినా కలగ లేదా?" అంది.

"నోరు మూసుకో. నేనెందుకు సిగ్గుపడాలి. నన్ను నీవా బెదిరించేదానివి! నీయిష్టం వచ్చినట్టు చేస్తూంటే, మేం చూస్తూ వూరుకోవాలా?"

జ్యోతి కళ్ళు మిరుమిట్లుగొలిపాయి. కోపంతో అతణ్ణి చూస్తూ "నోరు సరిచేసుకు మాట్లాడండి. అనవసరంగా నిందలు వెయ్యవద్దు" అంది.

"రేపే నీజుట్టు తీయించి, గాడిదమీద కూర్చోపెట్టి, యింట్లో నుంచి వెళ్ళగొట్టకపోతే, నేను లక్ష్మీకాంతుణ్ణే కాను" అని లక్ష్మీకాంతుడు గర్జిస్తూ అన్నాడు.

"సరే, మీయిష్టం వచ్చినట్టు చెయ్యండి. నేను ఎంత చెడ్డదాన్నైనప్పటికీ, మీరే నన్ను ఏరికోరి పెళ్ళిచేసుకు తెచ్చుకున్నారు. నేనేం నాఅంతట నేను కోరుకరాలేదు. 'అర్థాంగి' అని నన్ను మీరు ఎన్నోమార్లు పిలిచారు. ఇక అనవసరంగా గందరగోళం చెయ్యవద్దని పాదాలు పుచ్చుకు ప్రార్థిస్తున్నాను. రేపుప్రొద్దున్నే వెళ్ళిపోతాను. ఇంతరాత్రివేళప్పుడు గల్లంతు చెయ్యకండి. పైగా అక్కడ మామగారుకూడా నిద్రపోతున్నారు. ఆయన్నిగురించికూడా ఆలోచించండి. నేను ఎలా వున్నప్పటికీ ఫరవాలేదు. మీకులగౌరవాలకు కళంకం రానివ్వకండి. అందరూ మిమ్మల్నే నిందిస్తారు. నేను పూర్తిగా నిర్దోషిని."

"చాల్లే నోరు మూసుకో. నీవేం నాకు ఉపదేశం చెయ్యనక్కరలేదు."

"పోల్లెండి, వూరుకుంటాను. నాతోపాటు మీరుకూడా వూరుకోవాలి. మీరు నన్ను వెళ్ళగొట్టటం, నాకు చాలా అదృష్టవంతమైన సంగతి."

"ఎలాగూ వెళ్ళగొడతాను. ఏదోవిధంగా యీరాత్రి గడవనీ. తెల్లవారగానే, చిన్నప్పటి ఉగ్గుపాలు జ్ఞాపకంవచ్చేట్టు చేస్తా చూసుకో."

ఇలా అని లక్ష్మీకాంతుడు తలుపు తెరుచుకుని బయటకువెళ్ళిపోయాడు. కొంచెంసేపు అయినతరువాత ముంగిలిలో ఎవరో, 'పందులు! దుష్టులు!! కుక్కలు!!!' అని అరవటం వినిపించింది. ఈ మాటలతోపాటు ఎవరో క్రిందపడిన చప్పుడుకూడా వినిపించింది.

తనను యింతగా అవమానించినప్పటికీ, మాట్లాడకుండాజ్యోతి ఒక కారణంవల్ల సహించి వూరుకున్నది. కాని చివరకు ఆమె భయపడ్డట్టుగానే జరిగింది. ముంగిలిలోకి పరుగెత్తుకు వెళ్ళి చూసింది. అవనాశుడు స్పృహలేకుండా నేలమీద పడివున్నాడు. అతడిముందు నుంచుని లక్ష్మీకాంతుడు కుక్కలాగా రొప్పుతున్నాడు.

జ్యోతి వెంటనే లక్ష్మీకాంతుణ్ణి దూరంగా నెట్టివేసి, అవనాశుడి శిరస్సును తనఒడిలోకి తీసుకుని నేలమీద కూర్చున్నది.

ఈగల్లంతువిని నిర్మలప్రభకూడా అక్కడకు వచ్చింది. ఆమెను చూచి "నిర్మలా! కొంచెం నీళ్ళు తీసుకురా. మరిదిగారిస్థితి ఏమీ బాగుండలేదు" అంది జ్యోతి.

నిర్మలప్రభ నీళ్ళు తెచ్చింది. జ్యోతి అవనాశుడిముఖం కడిగింది. లక్ష్మీకాంతుడు కొంచెంసేపటివరకు మెదలకుండా నుంచుని వున్నాడు. జ్యోతియొక్క యీప్రవర్తన చూచేటప్పటికి అతడికి ఆశ్చర్యం కలిగింది. నిర్మలప్రభ లక్ష్మీకాంతుడితో "పెద్దబాబూ! మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. అవనాశుడికి స్పృహ వచ్చాక. మే మతణ్ణి యింకొకగదిలోకి తీసుకవెళతాము." అంది.

నిర్మలప్రభ యిలా అనేటప్పటికి, అత డేమీ జవాబు చెప్పకుండా, భయభీతబాలునివలె మెల్లగా అడుగులు వేసుకొంటూ తనగదిలోకి వెళ్ళిపోయాడు.

## 23

రాత్రి ఆఖరుజాముకు అవనాశుడికి స్పృహ రాగానే, అచ్చటినుంచి లేచి తనగదిలోకి వెళ్ళిపోయాడు. జ్యోతి నిర్మలప్రభగదిలోకి వెళ్ళింది. మాటలసందర్భంలో తనకూ లక్ష్మీకాంతుడికీ జరిగిన సంభాషణ అంతా నిర్మలప్రభతో చెప్పింది. "నీవు నాతో ముందుగా చెప్పివుంటే, యింతవరకూ రాకుండా చూసేదాన్ని" అంది నిర్మలప్రభ.

"నిర్మలా! నీ కీసంగతులన్నీ ఎలా చెప్పను? యిలా అన్నందుకు క్షమించు. శాస్త్రాల్లో స్త్రీకి భర్త దైవమని చెప్పబడింది. శాస్త్రాజ్ఞను శిరసావహించటం మనధర్మం. ప్రపంచంలో దేవతల గౌరవప్రతిష్ఠలకు లోపం వచ్చిందనే నెపంతో మనంకూడా మన భర్తలను నిరాదరించవలసిందేనా?"

"రేపు పెద్దబాబుముందు యీచర్చ తెస్తే జరిగినసంగతులన్నీ ఆయనయెదుట చెప్పగలవా?"

"ఇదంతా ఆయనయెదుట చెప్పాలా? ఆయనముందు చెప్పగలుగుతాననా నీవుద్దేశ్యం? ఈసంగతి తెచ్చేవా రెవరు? ఏమని తెస్తారు?"

"ఈసంగతే. నిన్ను అవమానం చేసి యింట్లోనుంచి వెళ్ళగొడతానని అన్నమాట."

"నీకేమైనా మతి పోయిందా ఏం? ఇలా చెయ్యగలశక్తి ఎవరికి వుంది? లేనిపోని నిందలు నీ వింతగా వేసుకుంటున్నావు. మీ బాబుగారికి యీమాత్రం సాహసమే వుంటే యీపాటికి తా ఎందుకు? ఆయన వుండగా యింత పాపకృత్యం యిక్కడ జరగలదా?"

జ్యోతి మళ్ళీ చెప్ప నారంభించింది – "ఈయింట్లో ప్రతి వాళ్ళకీ ఒకర్ని చూస్తే మరొకరికి భయమే. ఎవరికీకూడా ఎవరినీ మందలించే సాహసం లేదు. ఒకవేళ మీ పెద్దబాబుగారు అన్నారనే అనుకో, ఆయన యితరులముందు యిలా అన్నానని ఒప్పుకుంటారా? ఎప్పుడూ ఒప్పుకోరు. ఈవిషయాన్ని అందరికీ చెప్పినప్పటికీ ఆయన లక్ష్యపెట్టరు."

జ్యోతి చెప్పిన యీమాటను వినేప్పటికే నిర్మలప్రభ శరీరం అంతా కంపించింది. ఆమె తనలోతాను "ఇందులో నాదోషమేమైనా వున్నదా? ఈమాటల్లో నాకు సంబంధించిన విషయం ఏమైనా వున్నదా?" అనుకుంది.

నిర్మలప్రభ దుఃఖిస్తూ "వదినా!" అంది. ఆమెమాటలలో వినయం తొణికిసలాడుతోంది.

"నిర్మలప్రభా! భయపడవలసిన కారణం ఏదీ లేదు. నే నెవరితోనూ ఏమీ చెప్పను. ఏదోషమూ లేకుండానే నే నింత ఘోరమైన అవమానాన్ని సహించవలసివచ్చినప్పటికీన్నీ, ఏవిధమైన ఆపత్తీ లేకుండానే యీయింటిని విడిచి వెళ్ళిపోతాను నీ సుఖ – దుఃఖాలకు ఆధారభూతుడైన వ్యక్తిని గురించి ఒక్కమాటైనా నేను మాట్లాడను. రేప్పొద్దున నన్ను చీపురుకట్టతో కొట్టి వెళ్ళగొట్టినప్పటికీకూడా, నే నేమీ అనను."

నిర్మలప్రభ మెదలకుండా కూర్చుంది. ఆమె లోలోపల యీ విషయాలనుగురించి ఆలోచించసాగింది. 'జ్యోతిలోవున్న హృదయ బలంలో శతాంశం నాకు వున్నప్పటికీ, నా కీస్థితి సంభవించేది కాదు.

నాహృదయదౌర్బల్యంవల్లనే నేను ప్రతివాళ్ళతోనూ మాటలు పడవలసి వొస్తోంది.'

జ్యోతి మళ్ళీ చెప్పసాగింది. "నిర్మలా, ఒకమాట చెబుతాను వింటావా? నే నీయిల్లు విడిచిపెట్టివెళ్ళేరోజున, ఏదోవిధంగా నీవు కూడా యీయిల్లు విడిచి వెళ్ళాలనే సంగతి జ్ఞాపకం వుంచుకో! నీభర్త యింటిదగ్గర వున్నప్పటికీ, లేకపోయినప్పటికీకూడా నీ వీయిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోవలసిందే. నీ వీపని చెయ్యలేకపోతే నీప్రాణాల మీదికి నీవే ఆపద తెచ్చుకున్నదానివి అవుతావు. భవిష్యత్తులో యీ దురాగతుడు, నిర్దయుడూ, దురాచారుడినీడ నీమీద పడ్డా, అది నీసర్వనాశనానికే కారణం అవుతుందని గుర్తుంచుకో. నీభర్తకు యిక్కడిసంగతులు ఏమాత్రం తెలిసినప్పటికీ, అతడు చాలా దుఃఖపడతాడనేసంగతి తెలుసుకో. నీ వింత భయపడవలసిన అవసరమేమిటో నాకు బోధపడటంలేదు. నీవు ఒక్కరోజైనప్పటికీ తల ఎత్తుకు తిరిగావంటే యీదుష్టుడు నీముందు ఆకువలె గజగజ వణికిపోతాడు. అతడు నిన్ను కన్నెత్తి చూచేందుక్కూడా సాహసించడు. పాపాత్ముడు ఎంత బలిష్ఠుడైనప్పటికీ, అతడిని మించిన నిర్బలుడూ, పిరికిపందా ప్రపంచంలో మరెవడూ వుండడనేసంగతి జ్ఞాపకం వుంచుకో. ఈమాట నిజమని నమ్ము."

జ్యోతి చెప్పిన మాటలు నిర్మలప్రభ హృదయంమీద బాగా పనిచేశాయి. ఆమె వెక్కివెక్కి ఏడుస్తూ "నేను రేపే యిక్కడినుంచి వెళ్ళిపోతాను. నేను వెళ్ళిపోయేందుకు తగిన ఏర్పాటు చెయ్యి. నాయింట్లో నేను ఎవరికీ భయపడనక్కరలేదు. పైగా నా కేకష్టమూ వుండదుకూడాను. నే నక్కడ ఒంటరిగా వున్నప్పటికీ నా కేభయమూ వుండదు" అంది.

"నిన్నక్కడ దింపివచ్చేవా రెవరు? అవనాశబాబు ఆరోగ్యంగా వున్నట్టయితే నిన్ను దింపిరమ్మని పంపించివుండేదాన్ని. కాని అతనికు యింకా జ్వరం తగ్గలేదు. అవనాశబాబు జ్వరతీవ్రతలో వుండగా వీరి పెద్దబాబుగారు ఇతణ్ణి కొట్టారు. అందువల్ల అతడు మరింత దుర్బలుడయ్యాడు. ప్రయాణశ్రమను సహించేస్థితిలో లేడతడు."

ఇలా అని జ్యోతి మెదలకుండా వూరుకుంది. ఈసంగతి అవనాశుడికి వినిపిస్తుందేమో అనే భయంతో ఆమె గదిలోనుంచి బయటకు వెళ్ళింది.

కొద్దిసేపుఅయాక జ్యోతి మళ్ళీ వచ్చి నిర్మలతో యిలా అంది — "నాకు అనుమానంగా వుంది."

"ఏమని వదినా?"

"పోనిద్దూ. యిందువల్ల వచ్చే ప్రయోజనం ఏదీ లేదు" అని జ్యోతి మెదలకుండా వూరుకుంది.

ఆకాశంలో విదియచంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చాలా సేపటివరకు ఆకాశంవంక చూస్తూవుంది జ్యోతి. నక్షత్రాలు ప్రపంచ వాసుల దుస్థితిని చూసి భయంతో స్తంభించిపోయాయా — అన్నట్లు ఆమెకు అనిపించింది. అసారమైన సంసారమందలి దుమ్ము ఎగిరి శుద్ధమూ నిర్మలమూ నగు ఆకాశాన్నికూడా అపవిత్రమూ, అపరిశుద్ధమూ చేస్తుందేమో అనే భయంతో ఆ నక్షత్రాలన్నీ మౌనంగా వున్నాయా — అనిపించింది ఆమెకు. చివరకు దీర్ఘంగా నిట్టూర్చి జ్యోతి నిర్మలప్రభతో "నిర్మలప్రభా! అవనాశబాబు ఏం చేస్తున్నాడో కాస్త చూచివస్తావా?" అంది. నిర్మలప్రభ కొంచెంసేపటికి తిరిగివచ్చి "అవనాశబాబు అక్కడ లేడు వదినా" అంది.

"ఏమిటి!" నిర్మలప్రభమాట విని ఆమె చకితురాలయింది "నిర్మలా! ఎక్కడికి వెడతాడు? ఇక్కడే ఎక్కడో వుంటాడు ఇద్దరం కలిసి చూద్దాం పద" అంది.

జ్యోతీ, నిర్మలా — యిద్దరూ కలిసి యిల్లంతా గాలించారు. ఎక్కడా అతడు కనిపించలేదు. చివరకు వాళ్ళిద్దరూ అతడిగదిలోకి వెళ్లారు. అవనాశుడి మంచంమీద వున్న తలగడక్రింద ఒకలేఖ కానిపించింది. జ్యోతి దాన్ని తీసి యిలా చదివింది—

"వదినా!

నేను వెడుతున్నాను. ఎక్కడికో నాకే తెలియదు. ఈయింట్లో వుండటంకన్న ఏగోడ్డు ప్రక్కనో చావటం శ్రేయస్కరం. నా

మగాలంగా మీరు తిట్టుతిన్నారు. మీకు యిలాటికష్టం కలిగించినందుకు క్షమాపణ వేడుకుంటున్నాను. నే నేమని చెప్పను. నాబోధ భగవంతుడి కెరుక. నాబాల్యంలోనే మాఅమ్మ స్వర్గస్తురా లయింది. మిమ్మల్ని చూసి నేను మాతృవియోగదుఃఖాన్ని మరిచిపోయాను. మీభర్తయొక్క దుష్ప్రవర్తనను చూసి, సాహసాన్ని కోల్పోవొద్దు. మీఅధికారాలను రక్షించుకోనండి. ఈగృహాన్ని చక్కబెట్టేభారం అంతా మీమీద వుంది. మీరు బధకించి, యీగృహాన్ని చక్కబెట్టక పోయేయెడల, భగవంతుడిముందు మీరు జవాబు చెప్పకోవలసి వస్తుంది. కొన్నిరోజులు అయినతరువాత, వీలు చూచుకుని మిమ్మల్ని దర్శిస్తాను. నాకోసం ఏమాత్రం విచారపడవద్దు. గవర్నమెంటు ఆస్పత్రులు వున్నంతకాలం, మందు లేకుండా చావవలసిన దుస్థితి నాకు రాదు. మీరు నాపట్ల చూపిన కృప మరియు స్నేహదృష్టి నన్ను జీవించివుండేటట్టు చేశాయి."

మీ

"అవనాశ్"

ఉత్తరం పూర్తిఅయింది. జ్యోతి కళ్ళనుంచి కన్నీరు బొట బొట కారసాగింది.

"వదినా! ఏమి టది?" అంది నిర్మల.

"నిర్మలా! నే నేమని అనుమానించానో, అదే జరిగింది!"

"ఏమి టది?"

"జ్వరంలోనే అతడు వెళ్ళిపోయాడు."

"అయ్యో! భగవంతుడు రక్షించుగాక!"

# 24

లక్ష్మీకాంతుడు ఆనాడే జ్యోతిని యింట్లోనుంచి వెళ్ళగొట్టాలని అనుకున్నాడు. కాని, యిప్పటివరకు అలా చెయ్యలేదు. ఏతప్పూ లేకుండా జ్యోతిని యింట్లోనుంచి వెళ్ళగొట్టేందుకు వీల్లేకపోవటమే యిందుకుగల కారణం. పైగా, యిలా నిర్దోషియైన జ్యోతిని వెళ్ళగొడితే తననే లోకులు నిందిస్తారు. అందువల్లనే

అతడు మెదలకుండా వూరుకున్నాడు. ఏదో దోషం చూపించి జ్యోతిని యింట్లోనుంచి వెళ్ళగొట్టేటట్టయితే, తనగౌరవానికి ఏకొరతా రాదనే తలంపుతో అవకాశంకోసం ఎదురు చూస్తున్నాడు. అవనాశుడు వెళ్ళిపోయాడన్న వార్త వినేటప్పటికే అతనికి అపారమైన ఆనందం కలిగింది. అతడిహృదయం హర్షోద్దీపితమైంది. అతడు వెంటనే శ్యామాకాళీదగ్గరికి వెళ్ళి జ్యోతినిగురించి తనయిష్టం వచ్చినరీతిని చెప్పాడు. "అవనాశుడు యింట్లోనుంచి వెళ్ళిపోవటానికి యీపిశాచమే కారకురాలు. నిన్నరాత్రి స్వయంగా నాకళ్ళతో నేను చూశాను. అతను శయ్యమీద పడుకొనివున్నాడు, అతడి ప్రక్కని నీయీపాపిష్టికోడలు........పాపం, అవనాశుడు చాలా మంచివాడు, ఎంతవరకు సహించి వూరుకోగలడు? భరించలేక యింట్లో నుంచి వెళ్ళిపోయాడు."

లక్ష్మీకాంతుడిమాటలు వినేటప్పటికే శ్యామాకాళికి మిక్కుటమైన కోపం వచ్చింది "ఇలాటి సత్స్వభావుడు, కలుపుగోలుతనం గలవాడుఅయిన భర్త వుండగా యిది యిలాటి కళంకివంతమైన పని చేసుందా? దీనిముఖమైన చూడరాదు" అని మనస్సులో అనుకుని– "సరేలే నీ వేమీ మాట్లాడకుండా వూరుకునివుండు. తక్కినసంగతి అంతా నేను చూస్తాను" అని అతడితో చెప్పింది. తరువాత అక్కడి నుంచి బయలుదేరి జ్యోతివుండే గదిలోకి వెళ్ళింది. జ్యోతి ఆసమయాన గదిలో లేదు. నిర్మలప్రభతో కలిసి బట్టలు వుతికేందుకు వెళ్ళింది. తడివస్త్రాలతో శరీరసౌందర్యాన్నంతనీ కారుమబ్బుల చాటున దాగివున్న చంద్రునివలె, దాచుకుని జ్యోతి యింటికి వచ్చింది. ఆమె వస్తూవుండటాన్ని గదికిటికీలోనుంచి శ్యామాకాళి చూసి "అమ్మాయీ! ఒక్కమాటు పైకి రా" అంది.

శ్యామాకాళియొక్క ఉదాసీనతతో వాడిపోయివున్న ముఖాన్ని చూసి జ్యోతి కంపించింది. తడిగుడ్డలతోనే పైకి వెళ్ళింది. "అమ్మాయీ! అవనాశుడు ఎక్కడికి వెళ్ళాడో నీకు తెలుసా?" అంది శ్యామాకాళి.

"నిన్న ఎక్కడికో వెళ్ళిపోయాడు అత్తయ్యా."

"ఏం? అకస్మికంగా ఎందుకు వెళ్ళిపోయాడు? ఎక్కడికి వెళ్ళాడు?"

"నాకేం తెలుసు?"

"నిన్నరాత్రి నీవెక్కడ పడుకున్నావు?"

"నిన్నరాత్రే కాదు, మొన్నరాత్రికూడా నేను అక్కడే వున్నాను. మరిదిగారికి జ్వరం వచ్చింది. అందువల్ల నేనక్కడ కూర్చోని వున్నాను."

"జ్వరంవచ్చిందా? అతడికి జ్వరంతగిలిందనే సంగతే నాకు తెలియదే. ఇంట్లోఎవరకూ కూడా యీ సంగతి తెలియదు. నీవే చెబుతున్నావు యీ సంగతి. నేనెలానమ్మను? నీవు చెప్పేమాటలో నాకే మాత్రం నిజం కనిపించుటలేదు."

'మొన్న అతడికి 102 డిగ్రీలు జ్వరం వచ్చింది. నిన్నరాత్రి అతడు భోజనంకూడాచెయ్యలేదు. కొద్దిగాజావత్రాగి పడుకున్నాడు.'

"అమ్మాయీ, నాకీమాటలతో పని లేదు. అలాటి మంచి పిల్లవాణ్ణి నువ్విలా చేశావు!"

శ్యామంకాళీ అన్న మాటను సహించలేకపోయింది జ్యోతి. "అత్తయ్యా!" అంది.

శ్యామా కాళీ జ్యోతిమాటను అడ్డువచ్చి "నీవు నన్ను చూస్తూకూడా జరిగినసంగతిని నా నోటితో చెప్పించాలని చూస్తున్నావు! పాపపుపని చేసిందికాకుండా పైగా యీ మూర్ఖత్వంకూడానా! సిగ్గు లేదూ? పైగా కళ్ళెర్రచేసి చూస్తావేం" అంది.

"అత్తయ్యా! అలా మాట్లాడతారేం? నే నేం చేశాను? ఎవరు చెప్పారు మీకు?" అని జ్యోతి బిగ్గరగా అంది.

"ఇతరుల కేం అవసరం? ఎవరి నెత్తిన కుంపటి పెట్టావో వాళ్ళే చెప్పారు. ఇం కెవరు చెబుతారు? నీ ఆట లిక్కడ సాగవు. పుట్టింటికివెళ్ళి నీ యిష్టంవచ్చినట్టు ఆడు."

"నాకూకూడా యీ యింట్లో వుండేందుకు యిష్టం లేదు. ఇప్పుడే వెళ్ళిపోదలుచుకున్నాను. పట్టపగలు చూస్తూవుండగానే యిలాటి దురంతాలు జరుగుతూవుండగా, యిలా అన్యాయముగా నిందలు వేస్తూవుండగా యిక్కణ్ణించి వెళ్ళిపోకుండా ఎవ రుంటారు?

అత్తయ్యా! యీ యింట్లో వుండటం చాలా కష్టమని నాకు బాగా బోధపడింది."

"ఏం, ఎందుకని? నా ముందర యిలా మాట్లాడేందుకు సాహసిస్తావు కాదూ? ఏమైనా కానీ యివ్వాళే నిన్ను యింట్లోనుంచి వెళ్ల గొట్టిస్తా. నీ మాటలు నీ కెంత ప్రమాదం కలిగిస్తాయో బాగా తెలిసేటట్టు చేసిచూపిస్తా! ఇలా అని బామాకాళీ గజగజ వణుకుతూ అక్కడినుంచి వెళ్ళిపోయింది. జ్యోతి నవ్వుకుంటూ నిర్మలప్రభవద్దకు వెళ్ళి "నేను వెళ్ళిపోతున్నాను" అంది.

"ఎందుకని వదినా?"

"అత్తయ్యగారే స్వయంగా నన్ను వెళ్ళిపొమ్మన్నారు."

"వదినా! నన్నేం చెయ్యమంటావు?"

"నిర్మలా! నీ మేలును నీవు కోరుకునేటట్లయితే యివ్వాళే నీ భర్తకు యిక్కడి విషయాలన్నీ తెలిసేటట్టుగా వుత్తరం రాయి. నన్ను వెంటనే తీసుకువెళ్ళవలసిందనీ, యిక్కడ నేను వుండటము అసంభవమనీ రాయి. ఒకవేళ నాలుగైదురోజులు వుండాల్సివస్తే పరిచారికలతో వుండి కాలక్షేపం చెయ్యి. వాళ్ళుకూడా స్త్రీలే గదా! స్త్రీ ఎంత దుస్స్వభావురాలైనప్పటికీ తనఎదుట పర స్త్రీ సతీత్వాన్ని కోల్పోతూవుంటే చూస్తూ ఊరుకోలేదు." అంది జ్యోతి.

తరువాత యిద్దరూ ఎవరిగదిలోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

## 25

చివరకు నిర్దోషియైన జ్యోతిపైన దోషారోపణ చేయబడింది. ఒక పరిచారికవెంట ఆమెను పుట్టింటికి పంపించారు. జ్యోతియొక్క అదృష్టానికి అసూయపడుతున్న గ్రామస్థులందరూ ఆమె ఒక పరిచారిక వెంట రావటం చూసి చకితులయ్యారు. ఈ సంగతి వూరంతా తెలిసింది. ఎవరికి తోచినట్టు వారు చెప్పుకున్నారు. ఇంతకుపూర్వం జ్యోతి తన పుట్టింటికి వచ్చినప్పుడు ఆమెవెంట చాలామంది నౌకర్లు వచ్చారు. ఆ సమయంలో ఆమె రాణివలె కనిపిస్తూవుండేది. కాని, యీ పర్యాయం వచ్చినప్పుడు ఆమెవెంట ఒక పరిచారికమాత్రమే

వచ్చింది. సామానుకూడా సామాన్యంగానే వుంది. ఒక్క బెడ్డింగు మాత్రమే వుంది! దీనికి కారణ మేమిటి?

ఎవరికీ ఏమీ అర్థంకాలేదు. కాని ఏదోవిధంగా గ్రామస్థులు అసలుసంగతి కనిపెట్టారు. క్రమక్రమంగా కులస్థులందరికీ తెలిసింది. వాళ్ళు కళ్ళెర్రజేశారు. జ్యోతి ఘట్టింటికి వచ్చిన నాల్గయిదురోజులకే గ్రామస్థులు యీ విషయమై క్షోభ్యం కలిగించుకునేందుకు సంసిద్ధమయారు.

జ్యోతిని లక్ష్మీకాంతచౌదరి తన యింటినుంచి ఎందుకు వెళ్ళగొట్టాడో చర్చించేందుకు కులస్థులందరూ చండీ దేవాలయంలో సభ చేశారు. భట్టాచార్యులవారినికూడా పిలిపించారు. ఆయన దేవాలయములో అడుగిడగానే "మిమ్మల్ని కులంనుంచి ఎందుకు వెలి వెయ్యకూడదు? మీ కూతుర్ని వొదులుకుంటారా? లేక కులాన్ని వొదులుకుంటారా? భర్త వెళ్ళగొట్టిన పిల్లకు మీయింట్లో ఎందుకు ఆశ్రయం యిచ్చారు?" అని ప్రశ్నించారు.

"ఈవిషయంలో జ్యోతి నిర్దోషి" అని భట్టాచార్యులు జవాబిచ్చారు.

కులస్థులందరూ ఏకకంఠంతో "అసంభవం" అన్నారు.

"ఇలాటి అందగత్తెఅయిన భార్యను ఎవడైనా అనవసరంగా వెళ్ళగొడతాడా? తప్పకుండా ఏదో కారణం వుంటుంది."

భట్టాచార్యులవారు జ్యోతినోటి వెంట విన్నవృత్తాంతం అంతా సవిస్తరంగా చెప్పారు.

జ్యోతిపైన దోషారోపణ చేసి, అతణ్ణి కులంనుంచి వెలివేసేందుకు కావలసిన ఆధారం ఏదీ కులస్థులవద్ద లేదు. భట్టాచార్యుల నోట అవనాశుడిపేరు వినగానే గ్రామస్థులందరికీ ఆనందం కలిగింది. ఏవిధమైన శ్రమయూ లేకుండానే వారికి కావలసిన ఆధారం దొరికింది.

"జ్యోతి యీవిషయంలో, పూర్తిగా నిర్దోషి. అవనాశుడు జ్యోతిని 'అమ్మా' అని సంబోధించాడు. అవనాశుడు వ్రాసిన లేఖ కూడా ఒకటి జ్యోతివద్ద వుంది. మీ రావుత్తరాన్ని చూడగోరేయెడల, ఆవుత్తరం చూపిస్తాను" అని భట్టాచార్యులవారు అన్నారు.

కలస్థులందరూ ద్వేషంతో వున్నందువల్ల అతడిమాటలను ఎవరూ వినిపించుకోలేదు. భట్టాచార్యుల కళ్ళనుండి ప్రవహిస్తున్న కన్నీరుగాని, అతడి వాడిపోయిన ముఖంగాని ఎవరిహృదయాన్నీ కరిగించలేకపోయింది. వారందరూ కలిసి భట్టాచార్యులతో యిలా స్పష్టంగా చెప్పారు. "కూతురును యింట్లో వుంచుకొనేయెడల భట్టాచార్యులవారు కులస్థులతో సంబంధం తెంచివేసుకోవాలి. ఈ రెండింటిలో ఎవరినో ఒకరిని విడిచిపెట్టితీరాలి. కూతురుతోనే సంబంధం త్రెంచుకుంటాడో, లేదా కులంతోనే సంబంధం త్రెంచుకుంటాడో ఆలోచించుకొనేందుకు రెండురోజులు గడువు యిస్తున్నాం. ఈరెండు రోజులు అవగానే, ఆయన తనకులస్థులకు తన నిశ్చయాన్ని తెలియజెయ్యాలి."

ఇంటికి రాగానే భట్టాచార్యులవారిదృష్టి ప్రప్రథమంగా జ్యోతిపై పడింది. ఆమెను చూడగానే ఆయన అరుస్తూ, బిగ్గరగా "సిగ్గుమాలినదానా! నీకు చావైనా వచ్చింది కాదు. ఈముఖంతో నన్ను పాడుచేసేందుకు యిక్కడి కెందుకు వచ్చావే?" అన్నాడు.

అత్తవారింట జరిగిన అవమానం, నిరాదరణలవల్ల జ్యోతి హృదయం యింతవరకే వ్రక్కలై వుంది. అందుమీద తండ్రి చేసిన నింద, కటువాక్యాలవల్ల ఆమె చెట్టునుండి తెగిపడ్డ కొమ్మవలె క్రింద పడిపోయింది. కొద్దిసేపటిలో చూస్తూవుండగానే ఆమె యిల్లు విడిచి వెళ్ళిపోయింది.

ఇల్లు విడిచి ఆమె తిన్నగా నదీతీరానికి వెళ్ళింది. ఆసమయంలో రేవువద్ద ఎవరూ లేరు. సూర్యభగవానుడి స్వర్ణకిరణాలు నదీజలంలో తమ రంగును కలిపి రక్తంవలె ఎర్రగా వొనర్చాయి.

నదీజలం యీవిధంగా రక్తవర్ణంగా వుండటం చూసి, జ్యోతి హృదయరక్తంకూడా ఉప్పొంగింది. ఆమె మెల్లమెల్లగా నీటిలోదిగింది. ఆమె గర్వం మాటిమాటికీ నీటితో ఢీకొని ఒకవిధమైన కరుణ రాగాన్ని ఆలాపిస్తూవుంది కంఠంలోతువరకు నీటిలోదిగి జ్యోతి తనలోతాను "సంఘం అంటే యిదేనా? ఈక్షణికజీవితానికేనా మానవుడింత అభిమానపడుటు? ఈపాపసముద్రంలో చిక్కుకొని జీవితాన్ని గడిపినందువల్ల లాభం ఏముంది? మానవహృదయంలో

సాటిమానవునిగురించిన జాలి నాకు మాత్రానికైనా లేదు. ఈర్ష్యా ద్వేషాలు, శత్రుత్వం స్వార్థపరత్వం, కపటం వంచన, పాపం – అత్యాచారా లనెడి అగ్నియే అందరి హృదయాల్లోనూ ప్రజ్వరిల్లుతూ వుంది. ఇలా వుండుటకుగల కారణ మేమిటి” అని అనుకుంది.

పోనీ, తనభర్తసంగతి వదిలేద్దాం. తండ్రిమటుకు తక్కువగా నిందించాడా? భర్త తనను చిన్నప్పటినుంచీ పెంచి పెద్దదాన్ని చెయ్యలేదు. అందువల్ల అతడు తనను అర్థంచేసికొనకపోవచ్చు. అంతే గాక తనసంగతి పూర్తిగా తెలియదుగాబట్టి అతను తనను ఆదరణగా చూడకపోవచ్చు. కాని, చిన్నప్పటినుంచీ పెంచి పెద్దదాన్ని చేసి, నాస్వభావం పూర్తిగా తెలిసిన తండ్రికూడా నన్ను యీవిధంగా దుర్భాషలాడి వెళ్ళగొట్టాడే! దిక్కులేని నాలాంటి పిల్లను యిలా వెళ్ళగొడితే ఏమైపోతుం దనిఅయినా ఆలోచించలేదు. ఇంకా తాను ఏముఖంపెట్టుకు జీవించగలదు? ఎక్కడకు వెళ్ళగలదు? ఏం చెయ్యగలదు? ఏమీ తోచలేదు......ఏమీ లేదు!

కాని, ఈ అంతిమసమయంలోకూడా ఆమెకు ఒకవ్యక్తిని చూడాలనే అభిలాష వుంది. ఆ ఒక్కడిహృదయంలోనే ఆమె సానుభూతిని చూడగలిగింది. అతడిహృదయంలో అనుకంప కూర్చి కూర్చి నింపివుంది. అతడు మూర్తీభవించిన సానుభూతియే. అతడికీ తనకూగల సంబంధ మేమిటి? ఏదీ లేదు. అతడు పరాయివాడై వుండికూడా, తనవాళ్ళకంటే ఎక్కువగా జ్యోతిని ఆదరించాడు. అతడికి జ్యోతిపట్లగల సానుభూతి, స్నేహము మరియు దయలలో ఏమాత్రంకూడా స్వార్థంలేదు. అతడు జ్యోతిని ఎంతగా ఓదార్చాడు! ఎంతెటి సంతోషకరమైన మాటలు చెప్పాడు; తాను స్వయంగా కష్టాలలో మునిగికూడా, ఎంతటి హృదయాకర్షకమైన ఆశను కలిగించాడు! తనకోసం ఎన్నో కష్టాలు పడ్డాడు. పాపం, అతణ్ణి ఎవ రెంతగా నిందించారూ?

అలాంటి ఉదారహృదయుడైన ఆనాథుణ్ణి మృత్యుసమయంలో దర్శించగలిగితే బాగుంటును! ఏదీ! ఈదురంతాలను నేను సహించలేను. కష్టాలమీద కష్టాలు వచ్చాయి. ధైర్యాన్నీ సంతోషాన్నీ కోల్పో

యాను" అని అతనితో తాను చెప్పగలిగేది. ఆదైవస్వరూపుని ఏదో విధంగా ఒక్కక్షణమైనా దర్శించగలిగితే, ఏవిధమైన గ్లాని యీ హృదయంలో లేకుండా తాను నిశ్చింతగా, సంతోషంతో ప్రాణత్యాగం చేస్తుంది.

# 26

కొలనులమధ్య దేవాలయానికి ఒకమూలగా ఒకవ్యక్తి మెదలకుండా కూర్చొని వున్నాడు. ఒక్కమాటకూడా అతడు అనలేదు. మధుసూదన భట్టాచార్యులవారు దేవాలయంనుంచి బయలుదేరగానే అతడుకూడా ఆయనవెంట బయలుదేరాడు. భట్టాచార్యులు యింట్లోకి వెళ్ళాడు. కాని అతడు యింటిబయటనే వున్నాడు. కొంత సేపటివరకు అతడు గుమ్మంలో నుంచుని వున్నాడు; కాని ఎవరూ కూడా అతణ్ణి లోపలకు పిలువకపోయేప్పటికే, అతని దక్కర నుంచోటం దుర్భరమైపోయింది. అతడు చాలా వ్యాకులపడ్డాడు. ముఖంమీద ఉదాసీనత వ్యాపించింది. దుఃఖాన్ని ఆపుకోలేక క్రింద పడిపోయాడు. అతడికి స్పృహవచ్చి చూచేప్పటికే జ్యోతి త్వర త్వరగా అడుగులు వేసుకుంటూ, నదివైపు వెళుతూవుంది. అతడు కూడా మెదలకుండా ఆమెవెంట వెళ్ళాడు. జ్యోతి నీళ్ళలోకి దిగుతున్నప్పుడు అతడు మెట్లమీద నుంచునున్నాడు. ఆమె నీళ్ళలో మునగబోతున్నది. ఇంతలోకే అతడు హఠాత్తుగా నీటిలో దూకి ఆమెను వెంటనే బయటకు లాక్కువచ్చాడు. కొంచెం శ్రమచేసిన పిమ్మట ఆమె కళ్ళు తెరచింది. తనఎదుట హేమంతుడు నుంచుని వున్నాడు. ఆసమయాన సూర్యభగవానుడు తన ఎర్రనిముఖాన్ని ఆవైపునవున్న దట్టమైన అడవిలో సిగ్గువల్ల దాచుకున్నాడు.

"హేముదాదా! నన్నెందుకు యిలా బాధిస్తున్నావ్?" అంది జ్యోతి.

"ఎందుకని యిలా చచ్చిపోదలచావో ముందుగా నాకు చెప్పు."

"నేనెవరికోసమని బ్రతకను? బ్రతికివున్నందువల్ల కలిగే లాభం ఏమిటి?"

హేమంతుడు దీనికి జవాబివ్వలేకపోయాడు.

"హేము బావా! నన్ను వదలిపెట్టు. నే నిక జీవించదలచుకోలేను. జీవించి చేసే పనికూడా ఏదీ లేదు."

"జ్యోతీ! నేను నిన్నిలా చావనివ్వను. నేను జీవించివున్నంత వరకు నీ వీడిసంగా చేసేందుకు వీల్లేదు. నీవు మరణించగోరితే, అందరి కంటె ముందు నేను మరణిస్తాను. నేను చనిపోయిన తరువాత నీ యిష్టంవచ్చినట్టు చేసుకో. నాకళ్ళయెదుట నిన్నెన్నడూ చావ నివ్వనుసుమా!"

"హేము బావా! నాకీ ప్రపంచంలో వుండేందుకు ఎక్కడా తావు లేదనే సంగతి నీకు తెలియదు. ఇక్కడవాళ్ళు నన్ను బ్రతకనివ్వ దలుచుకోలేదు."

"నీభర్తో!"

"హేము దాదా! నన్నింకా బాధించను సంఘంపేరట కులస్థులంతా కలసి నన్ను మ్రింగివెయ్యాలని చూస్తున్నారు. వాళ్ళనుంచి నీవు నన్ను రక్షించగలవా? నీవు ఒంటరిగా కాపాడగలవా? నీవు కూడా యీభయంకర పంజరంలో చిక్కుకుపోతావేమో ఆలోచించుకో."

"జ్యోతీ! పోనీ యీమాటల కేంలే. నీ పీడిసంగా చచ్చిపోయి నప్పటికికూడా కులస్థులు నిన్ను వదలిపెడతా రనుకొంటున్నావా?"

"ఏమైనా కానీ నా కేబాధా కలుగదుగదా!"

"అలా మాట్లాడకు జ్యోతీ! నా యిల్లువుండగా నీకు వుండేం దుకు నెలవు లేదని భయ మెందుకు కలగాలి?"

"మీ యిల్లా!"

ఒకానొక సంఘటన జ్యోతి స్మృతిపథానికి వచ్చింది. తన ఆశలనూ, అభిలాషలనూ ఒకనాడు హేమంతుడు పదదళిత మొనర్చిన ఆ యిల్లా? . శరీరంమీద వేలకొలది సూదులు గుచ్చినట్లనిపించింది జ్యోతికి.

"జ్యోతీ! ఒకానొకప్పుడు మనం యిద్దరమూ శరీరాలు రెండూ, ప్రాణం ఒక్కటిగా వుండేవాళ్ళం. ఆ తరువాత జరిగిన ఏవ

యాలు మనయిద్దర్నీ వేరుచేశాయి. ఈ సమయంలో మనం యిద్దరమూ యిలా నదిలో నుంచుని ఒకళ్ళముఖాన్ని ఒకళ్ళం చూసుకుంటూ వుండవలసిందేనా?"

హేమంతుడు మళ్ళీ యిలా అన్నాడు. జ్యోతీ! నేను నాకు పాపభయం లేదు. కులస్థుల్నీ సంఘాల్నీ లక్ష్యపెట్టదలచుకోలేదు. నీ వెందుకు భయపడతావు? నీ కులం ఏ కేమి యిచ్చింది? హృదయగ్లాని, అనాదరణల తప్ప నీ కులంవల్ల నీ కింకేం లభించాయి? రా జ్యోతీ! రా! మనం యిద్దరమూ చేతులు కలిపి యీ మందభాగ్యకలాన్ని మన పాదాలతో పదదళితంచేసి మన హృదయంలో వున్న ద్వేషాన్ని నివారించుకుందాం. ఆనందగీతాలు పాడుకుంటూ సౌభాగ్యరాగాన్ని ఆలాపన చేసి కులస్థులనూ లోకనిందనూ మృత్యుసాగరములో ముంచేద్దాం. రా జ్యోతీ! ఏమి టలా ఆలోచిస్తావు?"

జ్యోతి మెదలకుండా నుంచునివుంది. చావనున్న సమయంలో యీ విడ్డూరం ఏమిటా అని ఆమె ఆలోచిస్తోంది.

జ్యోతి ముఖంమీద సూర్యుడి గులాబివన్నె కిరణాలు పడుతున్నాయి. ఆమె ముఖచ్ఛాయలో కిరణాలరంగు కలిసిపోయి ఒక విచిత్రమైన దృశ్యాన్ని ఉత్పన్న మొనర్చాయి. ఒకనాటి సంధ్యాసమయంలో యిలాంటి దృశ్యాన్ని చూసి హేమంతుడు తనను తాను విస్మరించాడు. నేడుకూడా అలాగే సంభవించింది.

హేమంతుడు ఆకస్మికంగా జ్యోతి పాదాలమీద పడి ఆమె రెండుపాదాలూ పట్టుకుని "జ్యోతీ! నీవు నావానివి" అన్నాడు.

జ్యోతి తనపాదాలనుండి అతడి రెండు చేతులనూ విడిపించి "హేముదాదా! నాకు వివాహంఅయిన సంగతి నీకు తెలుసు. హృదయంలో ఏ వుద్దేశ్యం వున్నప్పటికి ధర్మానుసారం నేను పరులసొత్తును అయ్యాను. ఈ దృష్ట్యాతప్ప నన్ను మరే యింకేరంగానూ నీదానినిగా చేసుకోజాలవా? ప్రేమించటం పాపం కాదు. కాని మంచీ - చెడూ అనే దృష్టిభేదం వుంది. హేముదాదా! నీ వేం విచారించనక్కరలేదు. నేను నీ సోదరిని" అంది.

"జ్యోతీ! జ్యోతీ!" అంటూ హేమంతుడు వెర్రివాడిలా పిలి చాడు. జ్యోతి మోకాళ్ళమీద కూర్చుని హేమంతుడి చేతిని పట్టు కుని "ఛీ! ఇలాంటిపని చేయవచ్చా? లే, పాదాలు విడిచిపెట్టు" అంది.

సరిగ్గా ఆ సమయానికి ఒక నావ నదీతీరానికి వచ్చింది. నావ పైన ఒక పురుషుడు కూర్చునివున్నాడు. ఒడ్డుకు రాగానే అతడు నావనుండి దిగి, మెట్లమీద జ్యోతి నుంచునివుండటం చూచి ఆశ్చ ర్యంలో "వదినా?" అన్నాడు.

జ్యోతి ఉలికిపడ్డది. ఎదుట అవమానుడు నుంచునివున్నాడు. "మరిదిగారూ!" అంది.

"వదినా! ఒకమాట చెప్పేందుకు వచ్చానమ్మా"

అత నీమాట చెబుతూనే హేమంతుణ్ణి చూశాడు; అతణ్ణి చూడటంతోనే అవమానుడు నావమీదికి వెళ్ళిపోతూనే పడ వాళ్ళను పడవను పోనిమ్మని చెప్పాడు. జ్యోతి అతనిని చూసి "మరదీ! యిలా రా. నామాట వినిపించుకు వెళ్ళు నీవు చెప్పదలచిన సంగతినికూడా చెప్పి వెళ్ళు" అంది.

"ఏమీ లేదు వదినా! వెళ్ళిపోతున్నా" అన్నాడు. నావ త్వరత్వరగా వెళ్ళిపోయింది. కనిపించినంతమేరవరకు నావను చూస్తూ నుంచుంది జ్యోతి. చివరకు "అబ్బ! ఎంతటి అవిశ్వాసం! ఇంత విశ్వాస ఘాతమా! ఇంత సంశయమూ, ఇంత సందేహమూనా!" అనుకుంది.

తరువాత ఆమె "హేముదాదా!" అని పిలిచింది.

హేము నడిఒడ్డున మెదలకుండా నుంచునివున్నాడు. అతడి నోటినుండి ఒక్కమాటకూడా పెగిలిరాలేకపోయింది. జ్యోతి తనలో తాను "అబ్బ! అగ్ని, భయంకరాగ్ని!! శరీరంఅంతా దహించుకు పోతోంది. సముద్రంలో మునిగినదే యీ అగ్ని చల్లారదు. బాగు బాగు ఇలాగే కావాలి. స్త్రీని, మహాశక్తిని, శక్తికి చేతకానిప నే మున్నది? సమస్తమూ చేయగలను. నేనుకూడా అవిధంగానే చేస్తాను. నేను నాశన మౌతాను, ప్రపంచాన్నికూడా నాశనంచేస్తాను. పాపిష్టిమానవులు నన్ను పరిహాసం చేసేది? ప్రపంచమూ, కులస్థులూ అందరూ నన్ను చెడ్డదాన్ని అంటున్నారు. నిరపరాధిపై వేసిన యీ

నిందకు వాళ్ళుమటుకు పాపం అనుభవించరా? భగవంతు డంత గ్రుడ్డివాడా?" అని అనుకుంది.

తరువాత "హేమదాదా! నీవు నిజంగానే నన్ను కోరు తున్నావా? నిజం చెప్పు. సంధ్యాసమయం, నదీతీరం, ఒట్టు పెట్టుకు చెప్పు, నీవు నన్ను ప్రేమిస్తున్నావా?" అని జ్యోతి అంది.

"జ్యోతీ!" అని హేమంతుడు జ్యోతిచేతిని పట్టుకున్నాడు.

"సరే, నేను నీదానినిగా వుంటాను. నీవు నాకు ఆశ్రయం యిచ్చినంతకాలమూ నీకు సేవ చేస్తూ వుంటాను."

ఆతరువాత సంకోచమూ, లజ్జా త్యజించి హేమంతుడిచెయ్యి పట్టుకుని అతనియింటికి వెళ్ళింది జ్యోతి. సూర్యుడు అస్తమించాడు. చీకటి పడుతూవుంది. ఒకవైపునుంచి తీవ్రంగా ప్రళయకాలపు తుపానువలె తుపాను చెలరేగింది.

# 27

జ్యోతి హేమంతుడితో అతడియింటికి వెళ్ళింది. వెళ్ళగానే ఆమె హేమంతుడితో "ఇవ్వాళరాత్రి నీవు నావద్దకు రావద్దు. నే నిక్కడ వుండవలచుకోలేదు. కలకత్తాకు వెళతాము. అక్కడకు వెళ్ళినతరువాత నేను నీదానిని అవుతాను" అంది.

హేమంతుడితండ్రి మరణించాడు. అతడితల్లి యింకా జీవించి వుంది. ఇప్పుడుకూడా అత డప్పుడప్పుడు గ్రామానికి వస్తూ-పోతూ వుంటాడు. తల్లి ఎంతగా చెప్పినప్పటికీ హేమంతుడు వివాహం చేసుకోలేదు. చివరకు విసుగెత్తి కొడుకుతో యీవిషయం ముచ్చ టించటం విరమించుకుంది తల్లి.

ఈమాటు హేమంతుడు గ్రామానికి వచ్చినప్పుడు జ్యోతిని గురించి చాలా చెడుగా విన్నాడు. ఏవిధంగా పరిణమిస్తుందో - అనే ఉద్దేశ్యంతో ప్రథమంలో అతడు యీవిషయాలనుగురించి శ్రద్ధ గైకొనలేదు, పరిణామాన్ని విని అతడు చకితుడై, జ్యోతిని తన దానినిగా చేసుకునేందుకు ప్రయత్నించసాగాడు. జ్యోతి యీ విధంగా యింత సులభంగా తనకు లభ్యమవుతుందని అతడెన్నడూ

అనుకోలేదు. జ్యోతి తనకు లభించటంవల్ల అతడికి అపారమైన ఆనందం కలిగింది.

హేమంతుడు జ్యోతిని వెంట నిడుకొని కలకత్తాకు వచ్చాడు. కాని, తనయింటికిమాత్రం వెళ్ళలేదు. దూరంగా వుండే ఒకపేటలో ఒకభవనాన్ని అద్దెకు తీసుకుని, జ్యోతీ - తానూ అక్కడ వుంటోన్నారు. జ్యోతి తనకు లభించుటవల్ల అతడు ప్రపంచాన్నే మరిచిపోయాడు. జ్యోతికి కావలసిన పనులు చేసేందుకు ఒకదాసీనికూడా ఏర్పాటు చేశాడు. వంట చేసేందుకు ఒక బ్రాహ్మణుణ్ణీ, సంగీతం నేర్పేందుకు వొక సంగీతంమేష్టర్నీ ఏర్పాటు చేశాడు. జ్యోతి అన్నిటికీ అంగీకరించింది.

జ్యోతి తనను పూర్తిగా హేమంతుడికి అర్పించుకుంది. బాలుడు ఆటబొమ్మను ఆడించురీతిని, అతడు చేసినట్టుగా ఆబొమ్మ సహించి వూరుకొనురీతిని, జ్యోతికూడా హేమంతుడిచేతిలో ఆటబొమ్మవలె, అతడు చెప్పినట్లు నడుచుకోసాగింది. అతడు ఎలా చెబితే అలా ఎదురు చెప్పకుండా చేస్తూవుండేది. జ్యోతిముఖం మీద ఎల్లప్పుడూ ఆనందం చిందులాడుతూవున్నప్పటికీ, ఆ ఆనందం సజీవంగా కనిపిస్తువుండేదికాదు. జ్యోతి యిలా వుండటాన్ని చూసి, జ్యోతీ - తానూ వొకేయింటిలో వుంటున్నందువల్ల ఆమెకు యీ వ్యాకులత, అశాంతి దుఃఖమూ కలుగుతూవున్నాయా? అని హేమంతుడు ఆలోచిస్తూవుండేవాడు.

ఈఅభిప్రాయంతో వొకరోజున అతడు "జ్యోతీ! అవసరమనితోస్తే నీకోసం మరొకయిల్లు అద్దెకు తీసికోనా?" అని అడిగాడు.

"ఏం? ఈయింట్లో వున్నందువల్ల వచ్చే నష్టమేమిటి?"

హేమంతుడు జ్యోతిప్రశ్నకు తృప్తికరంగా జవాబివ్వలేకపోయాడు. అంతేగాక యీయింటిని వదిలిపెట్టవలసిన కారణం ఏమిటోకూడా అతడికి బోధపడలేదు.

తాను జ్యోతియొక్క జ్యోతిర్మయ సౌందర్యపిపాసకుడు, పైగా ఆమె ప్రేమపాత్రలో తాను ముగ్ధుడయాడుకూడాను. అందు

వల్ల జ్యోతి ఏ కారణంవల్లనైనా అసంతుష్టురాలై ఎక్కడికైనా వెళ్ళిపోతే తన గతి ఏమౌతుంది? అనే ఆలోచన అతణ్ణి ప్రతిక్షణం బాధిస్తూవుండేది. ఈ కారణంవల్లనే అతడు ప్రతి సమయంలోనూ జ్యోతిని చూసి భయపడుతూవుండేవాడు.

అతడు ఎంతగా ఆలోచించినప్పటికీ కూడా తనకు జ్యోతి లభించినప్పటికీనీ తనకు లభింపక వ్యాకులపరుస్తూవున్న ఆ ఆనందాభిలాష ఏదీ అని అతణ్ణి బాధిస్తూవుండేది. ఏ కారణంవల్ల తా నిలా వ్యాకులంగా వున్నాడో కూడా అతడికి అర్థం కాలేదు.

జ్యోతి తనతో నవ్వుతూ మాట్లాడుతుంది. ఒక విచిత్రవిధమున హృదయాకర్షకంగా తనను ప్రేమిస్తోంది. తన ప్రేమపూరిత వాగ్జాలంతో తనను ముగ్ధుణ్ణి చేస్తోంది. అయినప్పటికీ ఆమె ముఖంమీద విచారచిహ్నాలు ఎందుకు కనిపిస్తూన్నాయి? బాధతో కూడుకొని నిరాశాపూర్ణంగా వున్న వ్యక్తి ఏకాగ్రంగా ఏదో ఆలోచిస్తూవున్నట్టుగా ఆమె కనిపిస్తూవుంటుంది. ఎందుకని ఆమె అలా వుంటుంది? ఈవిధంగా ఎంతగా ఆలోచించినప్పటికీ హేమంతుడికి ఏమీ బోధపడలేదు.

ఒకనాడు చాలాసేపటివరకు మౌనంగా కూర్చునివున్న తరువాత జ్యోతి హేమంతుణ్ణి "నీవు కాలేజీలో చదువుతూవుండేవాడివి కాదా?" అని అడిగింది.

హేమంతుడు ఉలికిపడి 'అవును' అన్నాడు.

"నే నెరిగిన ఒక కుర్రవాడు కలకత్తాలో ఏదో కాలేజీలో చదువుకుంటున్నాడు. అతణ్ణిఒకపర్యాయం వచ్చి నన్ను కలుసుకోమని చెప్పేందుకు వీ లవుతుందా?"

జ్యోతి యిలా చెప్పేప్పటికే హేమంతుడి హృదయం దడదడమన్నది. ఏమిటీ యీ సంగతి అని ఆలోచించసాగాడు.

"అతణ్ణి యిక్కడకు తీసుకురాగలవా?"

"అత డెవరో, పే రేమిటో, ఏ కాలేజీలో చదువుతున్నాడో తెలియకుండే అతణ్ణి ఎలా పిలుచుకురాగలుగుతాను?"

"అతడి పేరు అవనాశచంద్రుడు. బి. ఏ., చదువుతున్నాడు."

"ఏ కాలేజీలో?"

"ఏమో? నాకు తెలియదు."

"అయితే చాలా కష్టమే. కలకత్తాలో చాలా కాలేజీలు వున్నాయి. అనేకమంది విద్యార్థులు చదువుతూవుంటారు."

"అయితే అతన్ని తెలుసుకునేందుకు వీల్లేదా?"

"వీల్లేదు."

ఆరాత్రి ఆనందంగా గడవలేదు.

మర్నాడు హేమంతుడు యింట్లోనుంచి బయటకు వెళ్ళగానే, జ్యోతి ఒక కుర్రవాన్ని పిలిచింది. అతడి తండ్రి జాడ ం తియ్యటంలో ప్రసిద్ధి పొందినవాడు. అతడిపేరు రసికుడు. జ్యోతి అతని చేత అయిదురూపాయలనోటు పెట్టి, "అతడిజాడ తెలుసుకొనివస్తే యింకొక అయిదురూపాయలు బహుమానం యిస్తాను" అంది.

"మీరు ఆజ్ఞాపిస్తే పులిపాలుకూడా పిండుకురాగలను. అలాంటప్పుడు కాలేజీవిద్యార్థి జాడ తీయటం ఒకలెక్కా?"

రసికుడు చిరునవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. అతడెందుకు నవ్వుతున్నాడో జ్యోతి అర్థంచేసుకుని 'మూర్ఖుడు' అనుకుంది.

అతడు వెళ్ళిపోగానే జ్యోతి తనగదిలోకి వెళ్ళి హార్మోనియం వాయించసాగింది. కాని ఆమె మనస్కరించలేదు. హార్మోనియం వాయించటం మాని, డాబామీదికి వెళ్ళింది. "అబ్బ! ఎంత అంధకారం! ఎటు చూస్తే అటే పాపమయం-ఈపాపదుర్గంధంవల్ల శ్వాస కూడా ఆగిపోతోంది. ఆకాశంకూడా యిందువల్లనే నీలవర్ణాన్ని ధరించింది" అనుకుంది.

క్రమక్రమంగా ఆమెకు పాతసంగతులన్నీ జ్ఞాపకం రాసాగాయి. నిర్మలప్రభ, లక్ష్మీకాంతుడు, బామాకాళి, అవనాథుడు తరువాత తనపెళ్ళిసంగతీ జ్ఞాపకం వచ్చాయి. ఆతరువాత చండీ ఆలయమూ,

తనపాపగాథ, హేమంతుడూ జ్ఞప్తికి వచ్చారు. ఇలా వొకటితర్వాత ఒకటిగా అన్ని సంగతులూ జ్ఞప్తికి వచ్చాయి. నాలుగు డబ్బులకోసం యింత పాపపని చెయాల్సివచ్చింది. ఎంతపాపం! ఛీఛీ! తానిలా ఎందుకు పతితయ్యింది? ఇందుకు కారణం తానేనా? తా నీపాపాన్ని బుద్ధిపూర్వకంగా చేశిందా – లేక పరిస్థితులు తనచేత బలవంతంగా యిలా చేయించాయా? జ్యోతి వెక్కి వెక్కి ఏడ్వసాగింది. కళ్ళనుండి కన్నీరు కారుతున్నాయి. ఈవృత్తిని, యీ నీచవృత్తిని తాను స్వయంగా స్వీకరించలేదు. తనభర్త, తండ్రీ యిందుకు కారకులు. అపుడు జ్ఞాపకం వచ్చింది. ఇందులో నాభర్త, నాతండ్రియొక్క దోషంకూడా లేదు. ఈదోషమంతా నాకలస్తులది. కలస్తులపేరిట సంఘానిది – ఆమెకళ్ళ నుండి బొటబొట కన్నీరు కారసాగింది.

ఇలా ఆలోచిస్తున్నంతలోనే ఏవరో మెట్లు ఎక్కుతున్న శబ్దం వినిపించింది. వెంటనే జ్యోతి పైటచెంగుతో కన్నీరు తుడ్చుకుంది. రసికుడు చెప్పిన పోలికలనుబట్టి ఆయువకుడు అవనాశుడే అయి వుంటాడని అనుకుంది.

"ఇదుగో, యీ ఐదురూపాయలూ తీసుకో. వెంటనే ఒక బండీ తీసుకువచ్చి, నన్నతనివద్దకు తీసుకు పోవాలి"

రసికుడు తన అదృష్టానికి లోలోపల ఆనందిస్తూ "అలాగే, కాలేజీ మూసేందుకు యింకా వొకగంట టైము వుంది" అన్నాడు.

బండిలో కూర్చుని యిద్దరూ బయలుదేరారు. కాలేజీకి కొంచెము దూరంలో బండీని ఆపి అవనాశుడివద్దకువెళ్ళి "మిమ్మల్ని కలుసుకునేందుకు ఒక్క స్త్రీ వచ్చిందని" రసికుడు చెప్పాడు.

"నాకోసమా? ఎవరా స్త్రీ?"

"రండి, వచ్చి చూద్దురూ! మీతో ఏదో అవసరమైనపని వుండి వచ్చారు."

అవనాశుడు కంపిస్తూవున్న హృదయంతో బండివద్దకువచ్చి నుంచున్నాడు. అవనాశుడు రావటం చూసి "మరిదీ? ఇలా రా" అంది జ్యోతి.

పామును ఆకస్మికంగా చూసి మానవుడు భయపడుతాడిని, అవనాశుడుకూడా జ్యోతిని చూసి అలా భయపడ్డాడు. "ఎవరు, వదినగారా?" అన్నాడు.

బండీవాడు బండీతలుపు తెరిచాడు. ఇష్టంలేకుండానే అవనాశుడు లోపలకు చూశాడు. వెంటనే బండితలుపును మూసి "వదినగారూ! సంగతులన్నీ విన్నాను. మీతో నా కిప్పుడు ఎలాటి సంబంధమూ లేదు. మీ రిలా నన్ను బాధిస్తూవుండేట్లైతే, నేను విరక్తుణ్ణై కలకత్తా విడిచిపోవలసివస్తూంది. ముందుగానే మీ కీసంగతి చెబుతున్నాను. మీ రిలా చేయదలుచుకుంటే చెప్పండి?" అన్నాడు.

"వద్దు ? వద్దు !! అలా చేయవద్దు. నేను వెడుతున్నాను. మీరు వెళ్ళవచ్చు" అంది జ్యోతి.

ఇలా అని బండీవాణ్ణి బండి తోలమని చెప్పింది. అసహనీయాగ్నిజ్వాలలవల్ల జ్యోతి శరీరం అంతా భగభగ మండసాగింది. బండీ త్వరత్వరగా కలకత్తా వీధులగుండా నడచిపోతోంది.

—...—

# 28

జ్యోతి అవనాశుణ్ణి కలుసుకునేందుకు వెళ్ళినసమయాన హేమంతుడు యింటివద్దలేడు. అతడు యింటికి వచ్చేప్పటికే జ్యోతి యింటివద్ద లేదు. అతడికి మిక్కుటమైన కోపం వచ్చింది. "నేను తనకోసం యిల్లూ వాకిలీ అన్నీ విడిచిపెట్టివచ్చేశాను. ఎన్నికష్టాలైనా సరే అనుభవించి, తనను సంతోషంగా ఉంచేందుకు రాత్రింబవళ్ళు ప్రయత్నిస్తూవుండేవాణ్ణి అలాంటినన్ను నిర్లక్ష్యంచేసి, నాపరువూ — మర్యాదాకూడా ఆలోచించకుండా ఎవర్నో కలుసుకునేందుకు వెళ్ళింది జ్యోతి. ఇక సహించి వూరుకోలేను. ఇవాళ ఏదో వొకటి తేల్చుకోవాలి. ఇంత కంటె అవమానకరమైన పనేముంది?" అనుకున్నాడు హేమంతుడు.

సరిగ్గా జ్యోతి యింటిగుమ్మంలో అడుగుపెట్టే సమయాన హేమంతుడు హైరానంగా అనుకున్నాడు. జ్యోతి యింట్లోకి రాగానే 'జ్యోతీ! నేను వెళ్ళిపోతున్నాను' అన్నాడు.

జ్యోతి నిరాశాజనకస్వరంతో 'మంచిది!' అంది.

జ్యోతి నోటినుండి యీమాట వినగానే హేమంతుడి హృదయం వ్రక్కలయింది. వెర్రివానివలె — "జ్యోతీ! నీది రాతిగుండె. నీహృదయంలో ఏమాత్రం దయాలేదు. నీకోసం నామిత్రులు - ప్రక్కలను వదిలేశాను. భవిష్యత్తును నాశనం చేసుకున్నాను. నీకోసం నేనెంత త్యాగం చేసినప్పటికి నీకుమాత్రం ఏమీ లక్ష్యం లేకుండా వుంది." అన్నాడు.

జ్యోతి దృఢంగా అవును అంది.

'నే నివ్వాళ అవనాశుణ్ణి కలుసుకునేందుకు వెళ్ళాను. నేను చేసినతప్పు - హేమంతుణ్ణి అడుగకుండా వెళ్ళటయే! నాయీ స్వల్పమైన తప్పుకే యింత క్రోధోన్మత్తుడై, తాను చేసిన ఉపకారాలను చెప్పి నన్ను దెప్పుతున్నాడు. తాను మగవాడై వుండీ, తాను చేసిన ఉపకారాలను గర్వంతో చెప్పుకుంటూవున్నాడు. కాని స్త్రీనై వుండికూడా అతడికోసం నేను చేసిన త్యాగాలను చెప్పుకోనైనా చెప్పుకోలేను. స్త్రీలకు అమూల్యరత్నమైన సతీత్వరత్నాన్ని' స్త్రీ సహజమైన సంకోచాన్నీ లజ్జనూ తనకోసం త్యాగం చేశాను. అంతేగాదు. నామరిదికి నామీదవున్న విశ్వాసాన్నికూడా యితని మూలంగా త్రెంచి వేసుకున్నాను. తనను సంతోషపెట్టుటకై, నన్ను నేను దగ్ధం చేసుకున్నాను. తనకు నామీద నమ్మకం లేకపోతే, నాహృదయాన్ని చీల్చిచూస్తే, నాహృదయంలో ఎన్నమచ్చలు పడి వున్నాయో తెలుస్తుంది. తాను చేసిన ఉపకారాలు మాత్రం బాగా జ్ఞాపకం వున్నాయి. కాని తనకోసం నేను చేసిన త్యాగాలుమాత్రం అతడికి జ్ఞాపకంలేవు. ఎంత విచిత్రమైన వ్యక్తి!

జ్యోతిని చూపి 'ఎక్కడకు వెళ్ళావు?' అన్నాడు హేమంతుడు.

'అవనాశబాబును కలుసుకునేందుకు'

"నన్నేం లక్ష్యపెట్టలేదు గామా?"

జ్యోతి నవ్వింది. ఏమీ మాట్లాడలేదు. మెల్లగా గదిలోనుంచి బయటకు వెళ్ళబోయింది.

హేమంతుడు అడ్డువచ్చి ఎక్కడకు? అన్నాడు.

"బయటకు."

"ఎందుకు?"

"నీతోపాటు వుండలేను. ఇవ్వాళే కాదు, ఎప్పుడూ నీవంటే నాకు అయిష్టమే. నీవు నానోట నిజమైన సంగతి వినాలనుకుంటే, సావధానంగా విను. నే నీకలకత్తాకు పంజరంలోని పక్షివలే వుండేందుకు రాలేదు. నీప్రేమజాలంలో చిక్కుకోనికూడా రాలేదు. అవనాశబాబు కలకత్తాలో వుంటూన్నాడు. ఇక్కడ ఏదో కాలేజీలో చదువుకుంటూన్నాడు. ఎప్పుడైనా అతన్ని కలుసుకో గలిగటట్లైతే శంక – సందేహాలవల్ల ఎలాంటి పరిణామం కలుగుతుందో చెబుదామని వచ్చాను. నీవు నాకు సహాయం చేశావు; నీవు నాకు చేసిన మేలుకు ప్రతిగా నా అమూల్యమైన సతీత్వాన్ని నీకు అర్పించాను. ఇక నీ దారి నీవు చూసుకో, నాదారిని నేను పోతాను."

జ్యోతి మాటలు హేమంతుడిలో మార్పును కలిగించాయి. అతడామె చేతిని పట్టుకుని "జ్యోతీ!" అన్నాడు.

"వద్దు, నన్ను వదిలిపెట్టు."

ఇలా అని జ్యోతి తనను హేమంతుడి చేతినుంచి విడిపించుకుని నేను నిన్ను ఒక్క రోజుకూడా – కాదు, కాదు– ఒక్కక్షణం సేపుకూడా ప్రేమించలేదు. నీవు నా ముందు ప్రేమను చూపినప్పుడల్లా, నా ప్రతి అవయవమూ భగభగ మండిపోతూవుండేది. నాహృదయం దగ్ధమై బూడిదగా అవుతూవుండేది. కాని, ఏమని చెప్పను– నేను నీదానిని కాను, నీదాన్నిగా వుండాలనికూడా ఎన్నడూ అనుకోలేదు. నీవు హృదయంలో ఏ చిహ్నాన్నీ నాటజాలవనే సంగతి జ్ఞాపకం వుంచుకో. నా శరీరం ఎంత అపరిశుద్ధమూ, అపవిత్రమూ

అయినప్పటికిన్నీ, నా హృదయం మాత్రం పూర్వం వలెనే శుద్ధంగానూ పవిత్రంగానూ వుంది. నీకీసంగతి తెలియును. కాని నాను మాత్రం యీ సంగతి బాగా తెలుసు" అంది.

ఆ తరువాత జ్యోతి తనను ఒక మహాఘాతంలో పడవేసుకొన్నది. వేశ్యావృత్తిని అవలంబించింది. కలకత్తాలో వుండే వెలయాలులతో పాటు తాను కూడా తన సౌందర్యాన్నీ యౌవనాన్నీ అమ్ముకోసాగింది. అనేకమంది ధనవంతులూ, జమీందార్లూ, బాబులూ వచ్చారు. లోపల అసహ్యించుకుంటూ వున్నప్పటికీ వారి అందరి ముందూ తన సౌందర్య సంపదను పెట్టి, నిస్సంకోచంగా వెలచెప్పి, అమ్ముకునేది.

జ్యోతి వేశ్యావృత్తిని అవలంబించినప్పుడు నారాయణబాబు జ్యోతికి అమూల్యమైన వస్త్రాభరణాల నిచ్చాడు. జ్యోతి నిస్సంకోచంగా స్వీకరించింది.

జ్యోతి తాను స్వయంగా తన చేతులతో వెలిగించిన మనోహర దీపప్రకాశమునకు గురియై పెక్కుమంది భోగవిలాసులు, సౌందర్యదాసులు, ప్రేమపిపాసులూ — శలభములవలె దగ్ధమై పోయారు.
ఆమె యితరులను దగ్ధం చేయుటేగాక, స్వయంగా తానుకూడా దగ్ధమౌతూన్నది. ఆమె మానసిక వాసనలకు ఎరయైనది. తనతో పాటు యితరులనుకూడా దగ్ధం చేస్తోంది. ఈ మైకం ఆమెను మత్తిల జేసింది. ఈ విధంగా అభినయించుట ఆమెకు సంతోషకరం. అవనాశుడి విముఖత్వం ఆమె హృదయాన్ని బాగా గాయపరచింది. అవనాశుడు తనను అధమురాలుగా భావించాడు. అతను తన ఆచరణను సందేహించాడు. తనకు విశ్వసించకలేక పోయాడు. స్త్రీ ప్రజ్వరిల్లజేసే అగ్నిలో భస్మం కాని శక్తి యీ ప్రపంచంలో ఏదీ లేదు.

హేమంతుడితో సంబంధం త్రెంచుకున్న తరువాత, వేశ్యావృత్తితో పాటు జ్యోతి తన పేరుకూడా మార్చుకుంది. ఇప్పుడామె పేరు విద్యుల్లేఖ. మెరుపు తీగవలె ఆమె సౌందర్యవతి. అంతే గాదు తన సౌందర్యాగ్నిలో లోకాన్నంతనీ దగ్ధంచేయగల శక్తిశాలిని కూడాను.

పెక్కురు విటులు ఆమెకు తమ ఆస్తులు రాశియిస్తామన్నారు. కాని ఆమె అంగీకరించలేదు. అంతే గాదు. తాను ప్రథమంలో వున్న యింట్లోనే వుంటూన్నది కూడా.

ఇలా వుండటానికి కారణ మేమిటని ఎందరో అడిగారు. నా కీయింట్లో సంపూర్ణమైన ఆనందం లభిస్తుంది. అందువల్ల నే నీ యింటిని విడిచిపెట్టలేకుండా వున్నానని చెప్పేది.

సంధ్యాసమయంలో తనను ఆకర్షణీయంగా సింగారించుకుని, వరండాలో సౌందర్యప్రతిమవలె నిలబడి, వీధినిపోయే వారిని మాస్తూ వున్నప్పుడు ఎన్నడైన అవనాశుడుకూడా యీ దారినిపోతూ, తనను చూసి, తాను సందేహించినందువల్ల 'వదిన' ఎలా మారిపోయిందో చూస్తాడనే భావంతో ఆలోచిస్తూవుండేది. కాని పెక్కురాత్రులు, పగళ్ళు గడిచిపోయాయి. ఒక్క నాడుకూడా అవనాశుడు యీ వీధిని రాలేదు. ఇందువల్ల విద్యుల్లేఖ పొందిన దుఃఖవ్యథకు మేర లేదు.

—•••—

## 29

ఇవ్వాళ రమణుణ్ణి పంపివేసిన తరువాత విద్యుల్లేఖ తన గడచిన జీవితాన్నంతను ఒకమారు పరీక్ష చేసుకొంది. తనలో త్వర త్వరగా కలుగుతూవచ్చిన మార్పుల్ని గమనించి ఆశ్చర్యచకితురాలయింది. ఈ ఆలోచనలో కాలంకూడా నెమ్మది నెమ్మదిగా గడవసాగింది. ఇంతలోనే గంగ వచ్చి "అమ్మా! తల దువ్వించుకోరా?" అంది.

"వద్దు"

"నారాయణబాబుగారు రాత్రికి వస్తానని కబురు చేశారు."

"ఆయన పైకి రాకముందే, యివ్వాళ నా ఒంట్లో బాగాలేదనీ యివ్వాళ ఆయన్ని కలుసుకోలేననీ చెప్పేశెయ్."

గంగ మాట్లాడకుండా వూరుకుంది. ఆమెకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. విద్యుల్లేఖ స్వభావం గంగకు బాగా పరిచితమే కాని నేటి ఆమె ప్రవర్తనలో విచిత్రమైన మార్పు వచ్చింది. గంగ క్రిందికి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోగానే విద్యుల్లేఖ మంచంమీద పడు కుంది. ఇంతలోకే ఎవరో నౌకరు వచ్చి, దీపం వెలిగించాడు. "తల నొప్పిగా వుంది. దీపం ఆర్పేశెయ్యి" అంది జ్యోతి. ఆమాట విన గానే నౌకరు ఆశ్చర్యపడ్డాడు. కొంచెంసేపు అలా నిలబడివుండి తరు వాత దీపం ఆర్పివేసి, గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయాడు.

మంచంమీద పడుకుని, విద్యుల్లేఖ తనజీవితాన్నిగురించి మళ్ళీ ఆలోచించసాగింది. "ఎలువైపులనుంచీ అసంఖ్యాకంగా జనం గుమి గూడి పోతున్నారు. ప్రతివాడూ తనను దారంతో బంధించు కుని ఎలా దూరం చేసుకుంటున్నారు! ఎన్నో తుపానులు వచ్చాయి. వాటినిగురించి ఆలోచించేందుకే తనకు తీరిక లేకపోయింది. గ్రుడ్డి దానివలె కళ్ళు మూసుకు కూర్చొన్న. ఆ నిర్మలప్రభ ఎక్కడ వున్నదో? లక్ష్మీకాంతుడు, బామాకాళీ, తన తల్లిదండ్రులూ, తన కులస్థులూ, సహృదయుడైన అవనాథుడూ, అతడొక్క క్షణం సేపటివరకు తొందరపడి యిలాటి తప్పు చేయకుండా వున్నట్లయితే, విద్యుల్లేఖ తన భవిష్య జ్జీవితాన్ని ఏ మార్గాన నడిపించేదోగదా? ఎంత ఆలోచించినప్పటికీ ఆమెకు ఏ మార్గమూ గోచరించలేదు. అవ నాథుడి మాటలకు అసంతుష్టురాలై తానొనర్చిన ప్రతీకారం సముం జసమైనదేనా? అవనాథుడు హాయిగా యింట కూర్చుని సుఖంగా జీవిస్తూ వుండవచ్చు. భోగవిలాసాల్లో రాత్రింబవళ్ళు మగ్నమైవున్నం దువల్ల అతడు జ్యోతిని పూర్తిగా మరిచిపోయి వుండవచ్చు. అతనిని గురించి అసంతోషపడవలసిన అవసరమేముంది? అతడు చేసిన అనుచిత ప్రవర్తనకు పగతీర్చుకుందామని అనిపిస్తోంది. కాని అలా చెయ్యను.

ఇక హేమంతుడు! అతడి భావాలు లక్ష్మీకాంతుడి భావాల లాటివే. వీళ్ళంతా ఇంద్రియదాసులు. ఛీ! ఛీ!! వీళ్ళందర్నీ విద్యు ల్లేఖ గడ్డిపోచతో సమానంగా తలుస్తూంది. వీళ్ళెవరికీ కూడా హృద

యంలో స్థానం యివ్వదు. అపనాశ్! నేడు విద్యుల్లేఖ సంకోచము-లజ్జ లనెడి శృంఖల్ని తెగగొట్టుకొని, స్త్రీ జీవితానికి మూలకందమైన సతీత్వాన్ని విడనాడి, తను తాను చితిగా నొనర్చుకున్నది. తాను ప్రజ్వరిల్లజేసిన చితాగ్నిజ్వాలలో ఏ ఒక్కజ్వాలయినా అవనాథునకు సోకిందా? ఏమాత్రం అతడికి సోకినా యీపాటికి అతడు కూడా దగ్ధం అయిపోయేవాడు అంతే గాదు, తనదారికడ్డు వచ్చి అలా మరలి పోయేవాడుకూడా కాదు. అయితే, విద్యుల్లేఖ తను తానే యీఅగ్నిలో దగ్ధం చేసుకున్నదా? విద్యుల్లేఖ కళ్ళనుండి జర జర కన్నీరు కారసాగింది. ఆకన్నీ రామెహృదయానికి కొంత సంతోషాన్నిచ్చింది. ఏడ్చి-ఏడ్చి తనహృదయాగ్నిని శాంతింపజేద్దామనుకుంది. కాని ప్రయోజనం కలుగలేదు. అది ఆరిపోయే అగ్ని కాదు. అది సతీమణియొక్క చితాగ్ని! స్త్రీ హృదయంలో భగవానుడు లోతైన కన్నీటిసాగరాన్ని దాచివుంచాడు. ఆమె ఈర్ష్యవల్ల దగ్ధమైన శ్వాస, ఆసాగరంలో ఎప్పుడు లీనమై పోతుందో ఎవరి కెరుక!

# 30

ఉదయం నిద్ర లేవగానే విద్యుల్లేఖ ఒకకంసాలిని పిలిపించింది. అతడు రాగానే విద్యుల్లేఖ తన నగలనన్నిటిని ఎదుటవున్న బల్లమీద పడవేసి "ఈనగలన్నీ యిప్పుడే అమ్మివేయదలచాను. వీటికి ఎంత డబ్బు వస్తుందో, యిప్పుడే చెప్పు" అంది. అతడు విద్యుల్లేఖవాలకం చూసి చాలాచౌకగా ఆనగలన్నీ బేరం చేసుకొని, వెలయిచ్చి, సంతోషంతో యింటికి వెళ్ళిపోయాడు. ఇంటివాళ్ళంతా ఆశ్చర్యపోయారు. క్రింది అంతస్తులనుంచి రేవతీ తదితరులుకూడా వచ్చారు.

విద్యుల్లేఖ గంగను పిలిచి ఆమెకు కొన్నినగలు, ఒకవంద రూపాయలు నగదూ బహుమతిగా యిచ్చింది. "ఇక ఎవరివద్దకైనా వెళ్ళి నౌకరీ చేసుకో. ఈపేటలో వుండరాదు సుమా!" అంది. గంగ తలవంచుకొని "మీ రెక్కడికి వెడతారమ్మా?" అంది.

'తీర్థయాత్రలకు' అని విద్యుల్లేఖ జవాబిచ్చింది.

విద్యుల్లేఖ చెప్పినమాట విని గంగ ఆశ్చర్యపడ్డది. ఆమెకీమాట నచ్చలేదు. ఈ ఐశ్వర్యాన్నంతనీ త్యజించి పేదదానివలె, తీర్థాలకు వెళుతుందా! అబ్బ! ఆమె యీ కోమలసుకుమారశరీరం యాత్రాకష్టాన్ని సహించగలదా? ఇన్నాళ్ళవరకు చేసిన సేవవల్ల యీ నగలూ, డబ్బూ తన శేషజీవితాన్ని సుఖంగా గడుపుకునేందుకు సరిపోతాయి అని అనుకుని గంగ ఆనాడే అక్కడినుంచి వెళ్ళిపోయింది

రేవతీ, సూరమ్మా ఎంత చెప్పినప్పటికి విద్యుల్లేఖ లక్ష్యపెట్టలేదు. బాడుగబండిని పిలిపించింది. ముందుగా కాళీఘాటుకు వెళ్ళింది. నౌకరుకు డబ్బుపెట్టె యిచ్చి, కాళికాదేవి దర్శనం చేసుకోనేందుకు వెళ్ళింది. దేవికిసాష్టాంగనమస్కారం చేసింది. తరువాత దేవాలయానికి ప్రదక్షిణం చేసి నౌకరును పిలిచి

"ఆ బాబుగారియిల్లు తెలుసా? అంది."

"ఏబాబుగారు?"

"బండికిందపడ్డ బాబుగారు"

"తెలుసునమ్మా"

"అయితే, బండీ అక్కడకు తోలించుకు వెళ్ళు".

నౌకరు బండిని పిలుచుకురాగానే, విద్యుల్లేఖ బండిలో కూర్చుంది. కటాల్ పాడాలో ఉన్న బోర్డింగ్ హౌసుముందు బండి ఆగింది. పెట్టె చేతబుచ్చుకొని విద్యుల్లేఖ, నౌకరును వెంటతీసుకుని మేడపైఅంతస్తుకు వెళ్ళింది. ఎవరో ఒకమనుష్యుడు [illegible] నుంచుని వున్నాడు. అతన్ని చూడగానే విద్యుల్లేఖ స్తంభించిపోయింది. ఇదేమిటి?అవనాశబాబు యిక్కడ వున్నాడేమిటి?" అనుకుంది. ఆమె కళ్ళు చీకట్లు క్రమ్మాయి. తనహృదయావేశాన్ని అణుచుకుని "ఇక్కడ, రమేశ్ అనేవాడున్నాడా?" అని అతన్ని అడిగింది. అవనాశుడు కూడా ఆమెను చూసి ఆశ్చర్యపడ్డాడు "ఇంతకాలానికి వదినగారు యీవస్తులతో యిక్కడకు వచ్చారేమా"అని తనలో అనుకున్నాడు చివరకు సంబాళించుకొని "వున్నాడు, ఇలా రండి" అన్నాడు.

అవనాశుడు విద్యుల్లేఖను వెంట నిడుకొని ఒకగదిలో ప్రవేశించాడు. ఆ సమయాన, రమణుడు ఒకకుర్చీలో కూర్చుని, ఆకాశం

వేపు చూస్తూన్నాడు. విద్యుల్లేఖ "అబ్బాయీ రమేశ్!" ఆని పిలిచింది.

రమేశ్ ఉలికిపడి నుంచున్నాడు. 'ఎవరీమె?'... అనుకుని, వెంటనే సంబాళించుకుని విద్యుల్లేఖ పాదాలమీద వ్రాలి, ఆమె పాదధూళిని లలాటమున ధరించి "అమ్మా, నన్ను చూచేందుకు వచ్చారా?" అన్నాడు.

"అవును రమేశ్! ఈడబ్బు దాచుకునే యేర్పాటు చేసుకుంటే నేను వెళ్ళిపోతా ?"

"ఎక్కడికైనా వెళతావా అమ్మా?"

"అవును బిడ్డా! శరీరంనిండా ఎన్నోనల్లటిమచ్చలు పడ్డాయి. తీర్థాల్లో వుండే శుద్ధనిర్మలజలంతో తోముకుని, సాధు - మహాత్ముల పాదధూళిని నలుగిడి, యీ నల్లమచ్చలు పోతాయో లేవో చూద్దామని అనుకుంటున్నాను. ఈలోకంలో లేకపోయినా, పరలోకంలోనైనా సుఖించాలని ఆశపడుతున్నాను."

ఇప్పటివరకు అవనాశుడు ఏమీ మాట్లాడలేదు. జ్యోతినోట యీమాటలు వినగానే అతడిలా అన్నాడు - "సాధు-మహాత్ముల పాదధూళిని శరీరానికి నలుగిడినంత మాత్రాన యీమచ్చలు మాసిపోవు. వీటిని పోగొట్టుకొనే మార్గం శుభకార్యాచరణ, సాంసారిక సుఖ - భోగాలను త్యజించుటయే. పరలోకంలో పొందే సుఖ - దుఃఖాలు [illegible]ంలో చేసే సుకృత దుష్కృతాలమీద ఆధారపడి వుంటాయి. ఈలోకాన్ని చక్కచేసుకుంటే, పరలోకం చక్కబడుతుంది. ఇంట్లో సంతోషం ఆనందం వుంటే, బయట కూడా సంతోషం ఆనందం లభిస్తుంది. బాహ్యస్థితి ననుసరించి ఆంతరికస్థితి ఏర్పడుతుంది.

ఈఅసారసంసారంవలెనే పరలోకంలోకూడా మూడురకాల స్థితులు వుండటం అత్యావశ్యకం. మొదటిశ్రేణిలో సాంసారిక జీవితాన్ని సుఖ - భోగాలతో గడిపేవారు వుంటారు. వీరు దాన - పుణ్యాలొనర్చుట తమజీవితాలయొక్క విశేషోద్దేశ్యంగా తెలుసుకుని వుంటారు. కాని, వీరు ఏదైన పొరపాటువల్లగాని, లేదా ఏదైన

బాహ్యకారణాల వల్లగాని సాంసారికకష్టాలను అనుభవించవలసి వుంటుంది. లేదా పాపకర్మల దుఃఖాలను అనుభవించవలసివుంటుంది. పరలోకంలో వీరికి ఉత్తమగతులు లభిస్తాయి. ఈలోకంలో యిలాటిమానవులు దుఃఖాలు కష్టాలు అనుభవిస్తున్నప్పటికీ, పరలోకంలోమాత్రం వీరిలాటి కష్టాలూ దుఃఖాలూ అనుభవించవక్కరలేదు. తాముచేసిన శుభకర్మలయొక్క సూక్ష్మఫలాన్ని వారు పరలోకంలో అనుభవిస్తారు. ఆత్మ సూక్ష్మస్వరూపిగాన వీరిఆనందం కూడాసూక్ష్మంగానే వుంటుంది.

ఇక రెండవశ్రేణిలో, యీప్రపంచమందలి మాయామోహాలలో చిక్కుకొని, ప్రకృతిని పూజిస్తూ ఇంద్రియవాసనలకు దాసులై తమజీవితాలను పశుతుల్యంగా గడిపేవారు వుంటారు. పరలోకంలో కూడా వారు యీవాసనలతోనే నిండివుంటారు. స్వర్గలోకంలో కూడా వారికి ఆనందం లభించదు. వీరు పతితులైన నీచప్రకృతికి చెందినమానవులు.

ఈప్రపంచాలో పాపాలు, దుష్కార్యాలూ చేసిన మనుష్యులు మూడవశ్రేణిలో వుంటారు. వారికి తాము చేసిన దుష్కార్యాలకుతగిన దుష్ఫలాలు లభిస్తాయి. పాపి తాను పాపం చేస్తున్నానని తెలిసియే ఆపని చేస్తాడు. దానితోపాటు అతనిహృదయంలో తనుచేసిన పాపానికి తనుశిక్ష అనుభవిస్తాననే భయంకూడా వుంటుంది. అతడు తాను చేసిన పాపానికి తగిన శిక్ష పొందనంతవరకు ముక్తి పొందజాలడు.

అజ్ఞానవశాన ఒకబాలుడుగాని పశువుగాని యితరమనుష్యుని ప్రాణాన్ని బలిగా గొని, తాను పుణ్యము చేసెనో, పాపము చేసెనో తెలియనిస్థితియందున్నచో, అతడికి తాను చేసిన పనికి శిక్ష వుండదు. శుభాశుభవివేకం కలిగివుండి పాపకృత్యం చేసే మానవుడే శిక్షింపబడతాడు. పాపాత్ముని భయము, లజ్జ, సంకోచాలవల్ల గుర్తించవచ్చును. ఈలక్షణాలు వున్నమానవుని పాపిగా తలంచవలెను. శుద్ధాచారణగల మానవునియందు వీలక్షణాలుగోచరించవు ఇహలోకంలో తాను చేసిన పుణ్యపాపాల ననుసరించి పరలోకంలో తనకు సుఖ-దుఃఖాలు లభిస్తాయని తెలిసిన మానవుడు దుష్కార్యాలు చేయజూలడు. చేతనైనంతవరకు దుష్కార్యాలు చేయకుండావుండుటే

మనను మనము రక్షించుకొనుట. దుష్కర్మలపట్ల అసూయ మరియు ద్వేష సాగరములను నలువైపులా ప్రవహింపజేయవలెను. స్వార్థావేశం కూడా హృదయమున వుండనివ్వరాదు.

జీవితాన్ని మార్చుట సులభమూ, కఠినమూ కూడాను. ఈవిషయం తెలిసినవానికి యీపని కఠినం కాదు. కఠినంగా తలచు వానికి తేలికపనికూడా కఠినంగానే అవుతుంది. ఒకపని సులభమైనదా-లేక కఠినమైనదా -అనే విషయం మన ఆలోచనను బట్టి వుంటుంది. పాపములు చేసిచేసి పాపాత్ముడైన వ్యక్తి కొద్దిగా ప్రయత్నిస్తే పవిత్రుడుకూడా కావచ్చు. ఇదివరకు చేసిన పాపాలకు పశ్చాత్తాపపడి ఇకముందు పాపాలను చేయనని ప్రతిజ్ఞ చేసినమానవుడు, యీప్రపంచంలోనే సులభంగా సజ్జనుడు కావచ్చును. కాని, తాను చేసిన పాపాలను పశ్చాత్తాపపడక, భవిష్యత్తులో యీపాపాలు చేయకుండుటకై ప్రయత్నించని వ్యక్తి పరలోకంలో తప్పక నరకాన్ని అనుభవిస్తాడు.

అవనాశుడియీమాటలు విని రమణుడు విచిత్రంగా మారిపోయాడు. "వీరు నాగురుదేవులు, ఈకాలేజీపిల్లలనే తమ బిడ్డలుగానూ, తమసర్వస్వంగానూ భావించివుంటారు" అన్నాడు ఆమెకు పరిచయం కలిగిస్తూ.

తరువాత అతడు అవనాశుతోడి "ఈమె నాప్రాణరక్షణ చేసిన తల్లి. ఈమె అనుగ్రహంవల్లనే నేనిక్కడకు రాగలిగాను" అన్నాడు.

అవనాశుణ్ణి గురించి విద్యుల్లేఖహృదయంలో గల దురభిప్రాయాలన్నీ మటుమాయమై పోయాయి. ఆమెకళ్ళురెండూ కన్నీటితో తడిసిపోయాయి. ఆమె అవనాశుడి పాదాలమీద వ్రాలి "మీ ఉపదేశం నాకు ముక్తిమార్గాన్ని చూపించింది. మీ యీ ఉపదేశం విద్యుల్లేఖవలె నాహృదయాంధకారాన్ని తొలగించింది. మీ ప్రతి మాటా నా హృదయానికి హత్తుకొన్నది. ఇక నేను వాస్తవమైన ఆనందాన్ని అన్వేషిస్తాను. సాధు-మహాత్ముల సత్సాంగత్య లాభంవల్ల నా హృదయాంధకారాన్ని తొలగించుకునేందుకు ప్రయత్నిస్తాను. ఇహ-పర

లోకాలు రెంటినీ కాపాడుకునే ప్రయత్నం చేస్తాను. ఇంతవరకూ ఆశిస్తున్న ఆశ నెరవేరుతుందనే నమ్మకం కలిగింది. మరదీ! నీవు నన్ను విశ్వసించి, నా కేదైనా పనిని వప్పగిస్తావా? నే నేపని చేస్తే నాకు యిహ-పరలోకాల్లో ముక్తి గలుగుతుందో చెప్పు. నీకు లోబడి, నీ యిష్టానుసారం పని చేస్తాను. నాహృదయం లోలోపల దగ్ధమై బూడిదయై పోతోంది నీవీ హృదయాగ్నిని శాంతింపజెయ్యి. నీవు తప్ప దీనిని శాంతపరచగలవారు మరెవరూ లేరు. నీవేమాత్రం అలక్ష్యంగా వున్నప్పటికీ, యీ అగ్ని యింకా పెద్దదై నన్ను బూడిదగా చేస్తుందనే సంగతి జ్ఞప్తియం దుంచుకో" అంది.

"భారతనారీమణులకు స్వభావసిద్ధమైన మహాదర్శాన్ని అవలంబించు ప్రపంచమందలి యీ అశాంతిమయ స్త్రీ తన కర్తవ్యము, దయాధర్మ, మాయా-మమకారము లనువాటివల్ల యీ ప్రచండాగ్నికుండమందలి వేడిని చల్లార్చగలదు."

"మరదీ! నీవు ఎలా చెబితే అలా చేస్తాను. నీవు నన్ను విశ్వసించేయెడల, నాలో అపారమైన శక్తి కలుగుతుంది."

"వదినా! నీవు అన్నప్రకారం నడుచుకోగలవా అని నా అనుమానం. భగవానుడు నీ ఈఅభిప్రాయం మారకపోకుండా చేయాలని నా ప్రార్థన."

"కాదు కాదు! ఎన్నడూ అలా మారదు. నీకు విశ్వాసముంటే!"

ఇలా అంటూ విద్యుల్లేఖ రమణుణ్ణిదగ్గరకు తీసుకుని "నా ఈరమణుడే సాక్షి. ఈతని తలమీద చెయ్యి ఉంచి మాట తప్పను అని ఒట్టు పెట్టుకుంటున్నాను." అని అంది.

"అమ్మా! అమ్మా!! అనిరమణుడు వంగి ఆమెపాదాలుగట్టిగా పట్టుకొని చుట్టవేశాడు.

అవనాశుడు యిదంతా ఆశ్చర్యంగా చూస్తూ తనలో "ఇది ఇంద్రజాలంగా ఉందే" అని అనుకున్నాడు. చూస్తూండగానే ఆమె శరీరంలో విద్యుత్ కిరణంలాంటి ప్రకాశకిరణ మొకటి అతని కంటి

ుందు ప్రకాశించింది. వీరితోడు "అమ్మా" అన్న అపనాశుని సం
ోధన, అతనిలో ఆమెపైగల అసహ్యభావాన్ని, ఆమెకు గల అప
ృతియనెడి మచ్చలను, పాము కుబుసం వీడినట్లు అతని మనస్సు
ండి పూర్తిగా విడిచిపోయాయి. అపూర్వమైన మాతృ తేజం విద్యు
ఖయందు ప్రకాసించటం. అతను చూడగలగాడు. అపనాశుడు
ద్యుల్లేఖ పాదాలమీద వ్రాలి "వదినా! నీయందు నేను దేన్ని
ాడాలని ఆశిస్తూ ఉండేవాణ్ణో ఆమాతృ మూర్తిని ఇప్పుడు చూడ
ుగుతున్నాను. నీవు వాస్తవంగా దేవీ స్వరూపిణివి. రమణుడికే
ాదు. నేటినుండి నాకుకూడా నీవే తల్లివి. నీవు నిశ్చయంగా విద్యు
ఖవే. నేడు నేను నీలో విద్యుత్ కాంతిని చూడగలిగాను. విద్యు
్త్తివలె దహింపగలశక్తి నీలోకూడా ఉంది." అని ఆమెపాదాలకు
ుస్కరించాడు.

* * *

వారిద్దరిని విడిచి విచారభారంతో విద్యుల్లేఖ ఎక్కడకో
ెళ్ళిపోయింది. నాటికీ నేటికీ కూడా ఆమె అట్లా ఎక్కడికి వెళ్ళింది
ెవ్వరికీ తెలియదు. ఆమె తన శేషితజీవితాన్ని ఎలా గడపిందో
ెప్పగలిగినవారుకూడా ఇంతవరకూ మాకుకనిపించలేదు.

సంపూర్ణం

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TDLA 109 13 158 |
| పుస్తకం పేరు | జోగిలికవ్వలి |
| తారీఖు | 26-10-024 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | ,4,136 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |